# వ్యామోహము.

(ఒకసాంఘిక నవల)

గ్రంథకర్త.

కొత్త భావయ్య చౌదరి.



పబ్లిషరు:-

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీ సత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

శ్రీచింతామణి ప్రెస్సునందు, ముద్రింపబడియె.

రాజమండ్రి.

1936.



వెల 1—0—0

# విషయసూచిక







# పీఠిక

నేటిదినములలో గొన్ని పద్య గద్య గ్రంథములను వ్రాసి ప్రకటించి యుంటిని. గాని నవలా రచనమున కిదియే నా ప్రథమ యత్నము అందుచే నీగ్రంథరచనము పాఠకుల కెట్లుండునో వారే నిశ్చయింపవలసియున్నది.

అపరాధపరిశోధకాది నవలలు చదువుటకు వినోదముగ నుండినను సంఘమున కవి చేయదగినంత పనిని చేయజాలవని నేను మొదటి నుండియు నమ్మువాఁడను. నారీ ప్రేమముచే నింపివైచిన గొన్ని నవలల స్థితియుగూడ నట్లే యగును. అందుచేతనే రాను రాను దేశమునందు నవలలు హెచ్చినకొలఁదిని వానిపై నాదరణముగూడ హెచ్చుటకు బదులు తగ్గిపోవుచున్నట్లు మనకు దెలియుచున్నది. ఇట్టి యుద్దేశ్యము మనసున నిడుకొనియే మున్ను నేనొక సాంఘిక నవలా రాజము నాంగ్లీకరించి యొక ప్రకాశకుని కిచ్చితిని. గాని యది 'పరహస్తంగతంగతః' యను వాక్యమును రూఢిపఱచెను. పిమ్మట నీ సాంఘిక నవలను నేనే కల్పించి వ్రాయఁబూనికొంటిని. మన సంఘములలో గన్పడు దురాచారముల నెన్నిటినో నచ్చటచ్చట జూపితిని గాని యివి యెవ్వరిమీఁద గాని యుద్దేశించి వ్రాయబడలేదు. కేవల కల్పనా గ్రంథమగు దీనియందుగల పాత్ర లెవ్వరిని దూషించుటకు గాని, భూషించుటకుగాని కల్పింపఁబడలేదని తెలుపుకొనుచున్నాను. సాధారణముగా జనులు వివిధ వ్యామోహములకు జిక్కుకొని చెడుచుందురు. అందుచే నీగ్రంథమునకు ప్రధాన పాత్రలగు రాగలతికా భరతుల పేళ్ళు పెట్టవలసియున్నను దీనికి నేను 'వ్యామోహ' మనియే నామకరణము గావించితిని. ఈపేరన్ని పాత్రలకును వర్తించి యుండుటచే నట్లు గావించుట సమంజసమని తలంచితిని. ఈగ్రంథ ప్రకాశకులకు నాకృతజ్ఞతా సూచక వందనము లర్పించుచున్నాఁడను.

ఇట్లు

సంగం జాగర్లమూడి
10-7-36

కొత్త. భావయ్య
గ్రంథకర్త.

శ్రీ ర స్తు.

# వ్యా మో హ ము.



## మొ ద టి ప్ర క ర ణ ము.

### విలాసము.



సుశీల గదిలో చదువుకొనుచుండెను. ఆమె చదువుచున్నది హరిశ్చంద్ర చరిత్రము చంద్రమతీ లోహితాస్యులను వారణాశీ క్షేత్రమున హరిశ్చంద్రుఁడు విక్రయించుభాగము నామె యందు విలోకింపవలసి యుండెను గాని యొకటిరెండు పద్దెములు చూచువరకే యామె ముందు చదువఁజాలకపోయెను. స్త్రీజన సహజ దయారసమే దీనికి గారణమై యుండవచ్చును. అంతటితో నామె తన గ్రంథము నొకమూలం బడవైచి శయ్యపై బవ్వళింపనెంచెనుగాని యూహాపరంపర లామె మనస్సును కలంచివైచుటచే నిద్రపట్టదయ్యెను. అందు నది పగటిపూట. ఒంటిగంటకాలము! సాధారణముగా మనగృహములలో ప్రొద్దున పనిపాటలైనంతనే మధ్యాహ్నమున గార్యములేమియు లేమిచే జనులు నిద్రింతురు. ఇతర దేశములలో నట్లుగాక దినమెల్లను గష్టించుచుందురు. అచ్చట నానావిధ పరిశ్రమ స్థానములుండుటయే దీనికి ముఖ్యహేతువు. అందు వలననే ఆదేశస్థులు క్రమముగా ధనవంతులగుటయు, మనవారు నిర్ధనులై నిరంతర దారిద్ర్యముతో తులదూగుటయు జరుగుచున్నది.

పాపము సుశీల విషయమున మాత్ర మిట్టిదిగాదు. తెల్లవారకమున్నే లేచి పాచిపనులన్నియు నిర్వర్తించుకొని, స్నానముజేసి, వంటజేసినది

భర్త పొలమునకుఁ బోవునని పెందలకడనే వంటపూర్తి జేసి యాయన కింతపెట్టి, తానింతదిని పిమ్మట నాయన పొలమునకుం బోవఁగనే యింటితలుపుగడియవైచుకొని తన శయనగృహమున బరుండి గ్రంథకాలక్షేపము జేయుచుండెను. సుశీల పెద్దవిద్యావంతురాలు కాదు. భారత భాగవతాదులను జదివి యర్థము దెలుసుకొనగల సమర్థత లేదుగాని వచనగ్రంథములు, నాటకములు, కథలపుస్తకములు మున్నగునవి చదివి బోధపఱచుకొనఁగలదు. అందుచే నామె పురాతన చరిత్రము లన్నియు నిత్యము గొంతసేపు ఉబుసుపోకకై పఠించుచుండును. అందలి ధర్మములన్నియు దాను దప్పకుండ నాచరింపవలయునని తలంచుచుండును.

సుశీల ప్రకాశముగారి భార్య. ఆయన గొప్పరైతు. విశేషపాండిత్యము గలవాఁడు కాకున్నను, ప్రకాశముగారు సుశీలకన్న మేధావంతుఁడే. కాని యాతఁడు సుశీలకన్న శాంతమనస్కుఁడు కాదు. కొంచెము కోపిష్ఠి. ముక్కోపియగుటచే నాతఁడు దేనికైనను సుశీలను కోపించినను నయ్యది వాగాడంబరముతో సరిపోవును. ప్రకాశము సుశీలను చక్కఁగా ప్రేమించెను. వారిద్దఱు సాయంకాలమైనంతనే యింటిముం దఁ ధ్యానమువంటి కాళీస్థలమున గూర్చుండి లోకాభిరామాయణములం జెప్పుకొనుచు కాలక్షేపము జేయువారు. వారిద్దఱికివిషయమున నైన నభిప్రాయభేదము గల్గినపుడెల్ల నైకమత్యముతో జర్చించుచు వాదప్రతివాదములు సల్పువారు. ఒక్కొకసారి సుశీల జెప్పినదే న్యాయమగుటయు, మఱొక్కొకసారి ప్రకాశమువాదమే నెగ్గుటయు జరిగెడిది. కాని ప్రకాశము ముక్కోపియగుటచే సుశీలవాదము నెగ్గినపు డోర్పు లేక యేదో యొక నెపమున నామె నావలికి బంపివైచి తనవాదలోపమునకు లోలోన బశ్చాత్తాపము జెందువాఁడు. కాని యందువలన సుశీలపై మాత్రమెప్పుడు నాగ్రహము జూపఁబోఁడు. అందుచే వారి

వాదములు నిత్యము సామాన్యములై పోయెను. క్రొత్తగా జూచువారి కవి నిజముగా గయ్యములనియే తోచునుగాని యవి దుర్వాదములేయని పల్కినచో సరిపోవును. ఇంతకు వినా, నాదంపతులలో నేపారుపునులేక కలసిమెలసి యే యుండిరని చెప్పవచ్చును.

ప్రకాశముగారికి నాలుగు పుచ్చెళ్ళ భూమిగలదు. అది యాతఁడు పాలేరులచే వ్యవసాయము జేయించును. స్వయముగా నాతఁడు దున్ని వ్యవసాయము జేయకున్నను గొన్నాళ్ళయినను తండ్రి 'హయాము' లో జేశినవాడే యగుటచే నాతనికన్నిపనులు దెలియును. అందుచే పాలేరు లెట్లేయేపొలములలో పనిచేయవలసినదియు నిర్ణయించుచు దినమున నొకటి రెండుమూర్లు పొలమునకేగి పరిశీలించి వచ్చుచుండును.

ప్రకాశ మానాడు పొలములో కూలీలు కలుపుదీయుచుండఁగా కొంతసేపుండి మఱల నేమిబుద్ధిగల్గెనో గాని వెంటనే యింటికరుగు దెంచెను. సుశీల యాతని రాక నెఱింగి యాతఁడు వెలుగెత్తి తలుపు దీయుమని పిలుచుటతోడనే యులికిపడి లేచివచ్చి వాకిలదీసెను అప్పు డాతఁడు నవ్వుచు 'ఇంతనిద్దురయా? ఇట్లులైనచో నెప్పుడో యొక ప్పుడు మన యిల్లు గుల్లగావలసినదే యనుచు లోనికేగెను. సుశీలయు మరల తలుపు గడియవైచుకొని లోపలికేగి 'అప్పుడే వచ్చితిరేమి? సాయంకాలము వరకు కూలీలు పనిజేతురు గనుక నచ్చటనే యుండెద నని మీరుచెప్పి వెళ్ళితిరే? ' యని ప్రకాశమును ప్రశ్నించెను. తన నెదురు ప్రశ్నించి నందులకే మికోపము దెచ్చుకొని యాతడా సుశీలనుజూచి "అదియంతయు నీకెందుకు? నాయిష్టము. అని పల్కెను. గానిని గాంచి సుశీలయు నిప్పుడే యెండలోనుండి వచ్చినవారి నింకను పల్కరించినచో నేమివచ్చునో యను భయమున మౌనముద్ర వహించెను.

ప్రకాశము కొంతసేపటికి లోని తాప మడంచుకొని బడలిక దీర్చుకొని 'సుశీలా! బెజవాడలో నీదినము హరిశ్చంద్రనాటకమాడెదరట పాత్రధారులు సుప్రసిద్ధులగుటచే నది చాల బాగుగా నుండునట. దానిని నేను జూడబోయెదను. అమ్మాయి యేదీ? యిల్లువాకిలి భద్రముగా గాపాడుదువా? లేక యెప్పుడునిదురపెద్దమ్మనే జేరియుందువా' యని ప్రశ్నించెను. సుశీల యామాటలు విని తా నదివరకే చదువుచున్న హరిశ్చంద్ర చరిత్రము జ్ఞప్తికిరాగా నుత్సాహ పరవశయై 'అమ్మాయి నిదురించు చున్నది. నాకుకూడ నీనాటకమును జూపింపరాదా?' యనెను. ప్రకాశమునకు మరల కోపమువచ్చి 'అదిగో తిరిగి మొదలు పెట్టి నావు. నీకుగూడ నాటకము జూపింపవలయునుగా? ఇక నేమేలక? మీారే మగవాండ్రు కావచ్చునులే? ఇట్టి విపరీత భాషణము లెప్పుడు నాడకుము నిన్నుజూచి అమ్మాయిగూడ నేర్చుకొనును.' అని పలికెను. సుశీలయు 'అంతకోప మెందులకండీ? మీారుచు సెరుగని దాననా? అయి ననేమందురో చూతమని యడిగినంతనే యంత యాగ్రహపడనా? ఏమి? మేముమాత్ర మంత తీసివేసినవారమా? నాతండ్రి పుణ్యమాయని నాకించ తచదువు వచ్చినదిలెండు. అదినాకు చాలును' అని శాంతముగా ననెను. 'సరిలే? నీసోది నిత్యమున్నదియే గాని పెట్టెలోనున్న నాలుగు రూపాయలు తీసుకొనిరా నేను మూడుగంటలబండికే వెళ్ళి ముందుగా టిక్కెట్టును తీసుకొనినగాని లేనిచో స్థలముదొరుకదు. నాకేమైన తినుట కున్నదా?' యని ప్రకాశమనెను.

సుశీల తానదివరకే చేసి యుంచిన పకోడీల నాయనకు ఫలహార ముగా నొసంగి, పెట్టె దీసి రూపాయలు దెచ్చెను. ఇంతలో ప్రకాశము తన చొక్కాయిని, కోటును ధరించుకొని, గొడుగొకటి చేతబట్టుకొని సుశీలకు భద్రములుచెప్పి బయలుదేరి పోయెను. సుశీలయు నొంటరి భయముచే నాటిరాత్రి తన యింటియందే యుండమని పనిచేయు దాసికి జెప్పి యట్లే యారాత్రి ముగించెను.

ఉండవల్లి యంత పెద్దగ్రామముగాదు. కుగ్రామమని గూడ చెప్పుటకు వీలులేదు. కాని యిది చరిత్ర ప్రసిద్ధమైనది. ఇచట నొక కొండగలదు. దీనిలో ననేక గుహాలున్నవి. ఈగుహాల యందజంతా యెల్లోరా గుహాలయందు వలె ననేక శిల్పచిత్రములు లిఖింపబడి యున్నవి. కాని వానిలోపలె నింకున్న శిల్పములు బుద్ధశిల్పములవలె గాన్పించుటలేదు. ఈగుహాలయంతస్థులలో నొకదానియం దనంతశయ నుని దేవాలయము గలదు. ఈయాలయ మీకథాకాలమునాటికి పాడు వడిపోయినను, పూర్వమిదిమహోన్నతపదవిలోనుండి యఖండోత్సవము లతో నెల్లపుడు నిండియుండెడిదని వదంతి. వెంకటాద్రిప్రభువు కాలము వరకుగూడ నట్లు జరుగుచుండెననియు, నాప్రభుత్వము క్షీణించుటతో నయ్యుత్సవములుగూడ క్రమముగా క్షీణించెననియు విందుము. ఈ యాలయము పాడువడినను, భక్తులప్పటివరకు వచ్చి యాస్వామిని సేవించియే పోవుచుందురు. పండుగ పబ్బములలో నుండవల్లి గ్రామస్థులు తప్పక నాదేవుని దర్శించుచుందురు. ఈగుహాలయము చుట్టునున్న స్తంభముల శ్రేణులలో నన్నింటిపైనను, వివిధములగు విగ్రహములు చెక్కబడి యున్నవి. అవి యన్నియు పురాణప్రసిద్ధములగు కథలకు సంబంధించియున్నవి. అనంతశయనుని పాదములవైపున జయవిజయుల ప్రతిమలును, మొదటిస్తంభముపై వృషభాసుర మర్దనకథయు, రెండవదానియందు గోవర్ధనోద్ధారణ వృత్తాంతము నతిచమత్కారముగా జెక్కబడియున్నవి. ఈకడపటిదానిలోనున్న యొక లేగవిగ్రహ మొక్కటి ముద్దుగురాటగట్టునట్లుగా నేటికిని కాన్పించుచున్నది. తలక్రిందుగానుంచి చరణము లాకసమునకు మరల్చ యుగ్రతపోసమాధియందుండిన యొకతాపసోత్తముని విగ్రహముగూడ నింకను జెక్కబడియున్నది. ఇంకను దంతావళా రూఢుండగు నొకభూపాలుని చిత్రమును పరిచారికాగణపరివృతయగు నొక పట్టపుదేవి శిల్పమును, శంఖచక్రగదాధరుండగు విష్ణు

దేవునివిగ్రహము, వామనావతారము, అశోకతరుచ్ఛాయను హను మం తునితో మాటలాడుచున్న సీతాదేవిచిత్రము, ఆంజనేయుఁడు మహా భక్తిపరుఁడై శివుని కభిషేక మొనర్చుచున్నట్లు గన్పడు ప్రతిమలు ఇట్టి వెన్నియో నిందున్నస్తంభముల శ్రేణులపై గలవు. ద్వారమునకు కుడి వైపున నారసింహావతారము జిత్రింపఁబడియున్నది. ఆనరసింహాకృతి మిక్కిలి భీకరమై, వదనగాంభీర్యమును, హిరణ్యాక్షుని దైన్యముఖమును గన్పరచుచు మనపూర్వీకుల శిల్పకళానైపుణ్యమునకు నిదర్శనముగా నున్నది. ఇట్టిపౌరాణిక కథ లెన్నియోజిత్రించి, తన్మూలమున నెట్టిపామరులనైనను, భగవద్భక్తి సంపన్నులుగా జేయుటకై యెందఱో నృపాలుర, ఋష్యాదులు, ఆస్తికులు, ధనవంతులు, భక్తిపరులు తమద్రవ్యమును వెచ్చించి చిరయశస్సును బొందిరి. వారి కల్పనాసామర్థ్యమువనో, వారి నిష్కాపట్యమహ్యాదయశీలమునవో లేక భగవంతుని మహిమాతిశయమునవో యనేక పామర ... యీగుహాలయమందుఁగల దేవతలలో దమకిచ్చవచ్చిన కులదేవతలగొల్చి యీప్సితముల నందుకొని తరించుచుండెడివారు. కాని యీకాలములో వానివంక జూచువారు లేక నవి పాడువడిపోవుచున్నవి.

ప్రకాశమటు బయలుదేరి యీకొండప్రక్కగా నడుచుచుండెను. దానిని గాంచినంతనే యందున్న దేవతలను దలంచుకొనిఁ యాతఁడొక నమస్కారము జేసెను. భగవచ్చింతనమే పురుషార్థమని తలంచెడి యీ హిందూదేశమున నిది ప్రాచీనాచారము. ఈకొండకుదాపునే రైలుమార్గముబోయినను, రైలుబండ్లచ్చట నాగవు. రెండుమూడు ఫర్లాంగుల దూరములోనున్న కృష్ణాకెనాలుననే యవి యాగును. అందుచే ప్రకాశమచ్చటికే బోవుచుండెను. ఆతనికి ప్రక్కనే కృష్ణాతరంగిణి కనుచూపు మేరలో ప్రవహించుచుండెను. ఆతరంగధ్వనులు వీనులకింపుగానుండి ప్రకృతిదేవత బాడెడి గీతములా యనునట్లుండెను. ఆనీటివచ్ఛికమ్మపై

తెమ్మెరల కతదానందించుచు నడచుచుండెను. ఆకృష్ణాస్రవంతి కావల యొడ్డుననే బెజవాడ పట్టణమున్నది. ఆపట్టణ మింద్రకీలాద్రి పర్వతము ప్రక్కను దానిపైన గూహను నిర్మింపఁబడియున్నది. వుండవల్లిపర్వతము దాపులో సీతానగరము కొండలు గలవు. ఆకొండలును, యింద్రకీలాద్రి పర్వతములు పూర్వమొక్కటిగనే యుండవచ్చుననియు, ననేకవర్షముల నుండి పారుచున్న యీజీవన నదీప్రవాహము పోరిపికికి తాళఁజాలక క్రమముగా రాపడి రెండుగా నయ్యెననియు నచ్చట దృశ్యమునుజూచి నవారు పల్యూహింప గలరు. పూర్వమీయింద్రకీలాద్రి పర్వతముపై నర్జునుఁడు తపస్సుగావించెనని ప్రతీతి. ఇప్పుడా రెండుకొండలపైనను దొరతనమువారు తంతితీగెలను నిరాధారముగా స్థాపించియున్నారు. ఈమారము రెండుమైళ్ళదూరమువరకు మధ్య నేస్తంభములులేక తీగెలు స్థాపించుట ససామాన్యకార్యముగాదు. కృష్ణాస్రవంతి కిచ్చటనే యొక యానకట్టు గలదు. దాని సాయముచే ననేకవేల యకరములు కృష్ణా, గుంటూరు మండలములలో సాగుచేయుబడుచున్నది. దీనికి కొలదిదూర ములోనే రైలుమార్గపు వంతెనగలదు. యయ్యది యినుపగరిడీలతో మిక్కిలి దృఢతమముగఁ నిర్మింపఁబడినది. ఇట్టివంతెనలు మనదేశమున మిక్కిలి కొలఁదిగనే యున్నవి. ఈమయోమార్గమునకు పైగా జనులు రాకపోకల నొనర్చుటకు వీలగును. రైలు అధికారులచ్చట సుంకము వసూలుజేసి జనులను పోనిత్తురు. వృద్ధులు, బాలురు, స్త్రీలు మున్నగు వారు సాధారణముగా దాపుననేయున్న కృష్ణాకెనాలు స్టేషననబడు ధూమశకట కార్యాలయమునకే బోయి బండినెక్కి సులభముగా బెజ వాడ పోవుదురు.

ప్రకాశమింక నొక ఫర్లాంగుదూరముండఁగనే గంటవినబడియెను. అది టిక్కెట్లు నిచ్చుటకై కొట్టఁబడినది. కాని ప్రకాశముకడ గడియా రము లేమిచే నది బండివచ్చునపుడు కొట్టెడుగంట యని తలంచెను.

అంతుచే నాతఁడు వడి వడిగా బరుగెత్తి టిక్కెట్లుగదివద్దకుఁ జేరుకొనెను. తరువాత నాతఁడు టిక్కెట్టును దీసుకొని బెజవాడ జేరెను. నాటకశాలవద్ద ప్రకాశమొక పెద్దమనుష్యునిజూచి "అందరు క్షేమమా? ఏమిపనిమీఁద దయచేసితిరి?" అని ప్రశ్నించెను. ఆతఁడు కొంచెము సిగ్గుపడి "అందరు క్షేమముగనే యున్నాము. ఏమిపనియున్నది నాయనా; ఏమియులేదు. ఈపిల్లవాఁ డొక్కఁడే యీనాటకము జూచివత్తునని పోరుపెట్టినాడు. వాని నొక్కనినే యీపట్టణమునకు బంపుట కిష్టము లేక నేను గూడ తోడు వచ్చితిని." అనెను. ప్రకాశ మంతట 'సరే! అట్లయినచో, నేను నందులకే వచ్చితిని. లోనికి పోవుదమురండి. టిక్కెట్టుకొన్నారుగదా' యనెను. "అవునని చెప్పుచు నాపెద్దమనుష్యుఁడు ప్రకాశముతో గూడ లోనికి జనెను.

నాటక మారంభింపఁబడెను. నటకులు మిక్కిలి చురుకుగా దమకార్యముల నిర్వహించుచుండిరి. ప్రేక్షకులు సావధాన మనస్కులై తమవీనుల నిగిడ్చి వినుచుండిరి. నాటకము రక్తిగనే యుండెను. కొంత సేపటి కంతలో లోహితాస్యుని పాత్రవచ్చెను. ఆతఁడు చిన్నబాలుఁడయ్యును మిక్కిలి యౌచిత్యముగా బ్రదర్శన మొనర్చెను. ముని ఋణమ్మునికై తన్నమ్ముమని చంద్రమతి హరిశ్చంద్రునితో బల్కుచున్నపుడాతఁడు తన్నమ్ముమని తండ్రితో గరుణరసంబుట్టిపడునట్లు చెప్పు పల్కులును, పిమ్మట నాతఁడు సర్పదష్టుఁడైన పిమ్మట బాలకులతో నాడిన పల్కులును నులిమి వారిహృదయముల భేదింప జాలియుండెను. ఆబాలుని దురవస్థకై చింతింపని వారచ్చటలేరు. చంద్రమతీ పాత్రయు నట్లే ప్రేక్షకుల హృదయముల నాకర్షించెను. ఇక హరిశ్చంద్రు[illegible] ధైర్య స్థైర్యములు, ఎంతటి కష్టసమయముననైన నాతఁడు సత[illegible] [illegible] పమపాట్లుకను గొన్నవారెట్టి కుటిల ప్రవర్తకులుగాని తో[illegible] [illegible]వర్తనమును దిద్దుకొన జాలినట్లుండెను. ఇట్టియుత్తమ దృశ్యము[illegible]

చూచుట వల్లనే యెంతటి కఠినహృదయుల మనస్సుగూడ నొకానొక వుడు కరగి నీరయి దయారసమును వెదజల్లుట కవకాశ మేర్పడును. నాటకము ముగియుచున్నది. హరిశ్చంద్రుడు మరల తొల్లిటియట్ల రాజ్యాభిషిక్తుడై పత్నీసుత సమేతుడై సింహాసన మలంకరించెను. అప్పటి వరకు ఖేదమానసులై నప్రేక్షకుల మనంబు లన్నియు నొక్కమారుగా బయాసొక్కపులోవలె యానంద దాయకము లయ్యెను. మంగళ హారతియై నంతనే ప్రకాశము లేచి యాపెద్దమనుష్యుని బాలు నొక్కసారి కన్నురెప్పవాల్పకఁ జూచి, లోహితాస్య వేషధారియగు బాలునిగూడ గనుగొనెను. ఆతఁడేమనుకొనెనో గాని యాతని హృదయము మాత్రమాలోచనా పూర్ణమయ్యెను. కొంతసేపటి కది యథాస్థితికి వచ్చిన పిమ్మట బయటికి వచ్చెను. ప్రకాశ మంతట నాపెద్ద మనుష్యుని జూచి 'నాటకమెట్లున్నదండి.' అని ప్రశ్నించెను. ఆప్రశ్న నాలకించి యాతఁడు తన సహజ నిష్కాపట్య హృదయముతో 'వీఁడు ఘోరుపెట్టిన నే నేమో యనుకొంటినిగాని, నిజముగా నియ్యది చూడఁదగినదియే సుమండి ఆ హరిశ్చంద్రునికుటుంబ మంతయు జూపిన ధైర్య స్థైర్యములు, వారి సత్ప్రవర్తనము మన కాదర్శ ప్రాయములై యాజన్మాంతము కన్నుల గట్టినట్లుండుటకు సందియమా? ఇట్టివి బాలు రపుడపుడు తిలకించుచున్నచో వారి చిత్తప్రవృత్తియు సన్మార్గముననే సంచరించుచుండెనని నాకుదోచుచున్నది.' అనిపల్కెను. ప్రకాశమీ మాటలకు దనసమ్మతి జెప్పెను. ప్రకాశమింక వారిని విడచిపోవు సమయము సమీపించెను. 'అన్నయ్యగారూ! ఒక్కసారి మాగ్రామము వచ్చి చూచి పోగూడదా? అచ్చట యనంత శయనుని సేవించి పోవచ్చును. మఱియు మాకొండ గుహలలో గల యనేక చిత్రము లన్నియు పరికింపవచ్చును. అని ప్రకాశము పలికెను.

'ప్రకాశముగారూ! క్షమింపుడు. దానికేమి? ఎప్పుడైనను రాగలను. ఇప్పుడవ్వవధిగా నింటికడ బయలుదేరి వచ్చితిని. గాన వెంటనే మరల పోవలెను. మీకొండ గుహలలో విచిత్రముల వృత్తాంతములు పూర్వులవలన వినుటయే గాని చూచియుండి లేదు. నిజమే మరొకసారి వచ్చినపుడు తప్పక వచ్చెదనులే'' అని యాపెద్ద మనుష్యుడు నుడివెను.

ప్రకాశ మంతట 'అబ్బాయిని గూడ వెంటబెట్టుకొని యొకసారి తప్పక దయచేయవలెను.' అని పల్కుచు వారివద్ద సెలవు దీసికొనెను. తరువాత వారల సమావేశము జరుగలేదు. ప్రకాశము గ్రామాభిముఖుడై రైలువద్దకేగి ఘూటకశకట మారోహించి యిల్లు జేరెను. ప్రకాశ మింటికివచ్చి తనభార్యా కుమారితల కచ్చట జరిగిన కథావిశేషము లన్నియు పూసగ్రుచ్చినట్లుగా వివరించెను. ఆకథ నంతయు నాలకించి సుశీల యెందువలననో యొకించుక యాలోచనా నిమగ్న యయ్యెను. ఆమె మొగము కొంచెము వెల వెల బారెను కాని యింతలో కుమారిత తన తల్లినిజేరి పల్కరించి నంతనే యాభావము మారిపోయి యొక్కసారిగా నామెను కౌగలించుకొని ముద్దాడ జొచ్చెను. ప్రకాశముగూడ తన పట్టిని దీసికొని కొంతసేపు ముద్దాడుచు నానంద పరవశుండై పోయెను. ఇట్లా దంపతులు నిజ ఛాయాలయగు కమలను మూర్ధాఘ్రాణ మొనరించుచు, బుజ్జగించుచు, దమ కాలమును హాయిగా గడపజొచ్చిరి.



## ద్వి తీ య ప్ర క ర ణ ము.

### (కమల వివాహము)

---

మనదేశములో సాధారణముగా స్త్రీలు వాంఛించునది సుందరముగు వస్త్రాభరణములు మాత్రమే యని నుడువ వచ్చును. వారికి సంసారమున నితర సంగతు లన్నియు పురుషులకు బట్టినట్లుగా పట్టవు. ఎక్కడైన వివేక శీలయగు యువతి సంసార చిక్కుల నన్నింటిని గ్రహించినను కూడ, వస్త్రాభరణములలో గన స్థితికి దృష్టి వహించియుండజాలదు. మానవ జీవితములోనే తృష్ణ యధికముగ నున్నది. గృహభారము నంతను పురుషులే మనదేశములో వహించుట సామాన్యాచారమైనందున గాబోలు, వారి తృష్ణ పలువిధముల బ్రాకియుండి యుంతగా వీరిపై మరలకుగాని బాహ్యప్రపంచము బొత్తుగా నెఱుంగక కూపస్థ మండూకములవలె నుంచఁబడిన మన నారీమణులు వీరియుందే దమ తృష్ణ నంతటిని నిల్పి చీనిచీనాంబరముల మోహను, రత్నమయ స్వర్ణాలంకారములతోనైన నొక విధముగా సంతృప్తి నొందఁగల్గుదురు. ఇట్టిదానికి మనము వారిని కొనియాడక తీరదు. ఏలనన, వ్యావహారికములలో తగిన స్థానము నిచ్చి యుందుఁగల సాధకబాధకము లన్నింటిని సమగ్రముగా గ్రహించుట కవకాశము గల్గఁజేసినగాని స్త్రీల కన్నివిషయములలోను పరిచయమును వానిపై నాసక్తియు గలుగఁగఁ జాలదు. అట్లు కలిగినపుడే వారి తృష్ణ యన్ని విషయములలోను రమారమి సమానముగా బ్రాకుచుండును. ఇట్లు యవకాశము మనమిచ్చునపుడు వారి తృప్తికి మనము సంతసింపక తీరదు. కమల దిన దిన ప్రవర్ధమానగా బెరుగుచుండెను. ఆబాలిక యల్లారు ముద్దుగా బెరుగుచు తల్లిదండ్రుల కమితానందముం గూర్చుచుండెను. సుశీలయు స్త్రీజన సహజా శక్తితో నప్పుడప్పుడు భర్తతో

నమ్మాయికి కడియాలు చేయింపుమనియు, ఉంగరములు మురుగులు జేయింపు మనియు, కాసులు కంటెలు జేయింపుమనియు, జెప్పి యేటేటనామె కాభరణములు దిగవేయు చుండెను. ఆబాలిక వస్త్రాలంకారములు తయారు చేయుంచుటతోనే సుశీల సంతృప్తురాలగుచుండెను. కాని యాపిల్లను విద్యావతిగా జేయుటకై మాత్రమట్టి పట్టుదల లేకుండెను. పేరునకొక పాఠశాలలో నాపిల్లను చదువ వేసిరి గాని దాని వలన ప్రయోజన మేమియు గల్గకుండెను. ఆపాఠశాల దొరతనము వారిది. అందున్న యుపాధ్యాయుడొక సామాన్యుడు ప్రతినెల కాయనకు రావలసిన జీతము సర్కారు వారినుండి యాతనికి వచ్చిన జాలును. పిల్లల చదువు సంబరములతో నాతనికి పనిలేదు. వచ్చిన వారికి వచ్చినంత వచ్చును. రానివారికి రాదు. బడికి రానివారిని పరిశీలించుటయే లేదు. వచ్చి కూర్చుండిన తర్వాత పాఠములు చెప్పుటయు నంతే. ఉపాధ్యాయుడిట్లు పట్టియు పట్టనట్లుగా నేదో యొకవేళకు వచ్చి బడిలో గూరుచుండి కాపీలు వ్రాయమనియో లెక్కలు వేయుమనియో యాజ్ఞాపించి పిమ్మట తానేదియో స్వంతపని జూచుకొనుచుండును. ఇట్టివారినదరించుటకు బెదరించుటకు గ్రామస్థులెవ్వరికి నధికారములేదు. ఈపాఠశాలలు తాల్లూకాబోర్డువారి పరిపాలనలోనున్నను, అందుల మెంబర్లుగాని, అధ్యక్షుడుగాని వానివిషయమై శ్రద్ధతీసుకొనరు. ఆడపిల్లలకు చదువువచ్చిననేమి, రాకున్ననేమి యను తర్కవితర్కములతో గాలక్షేపము సల్పుచు. నెందఱోయుండ మనకేల నీమాత్రము కార్యమైనదని పురజనులలో నెవ్వరికివారు పాఠశాలా స్థితిగతుల దెలిసికొనియు నేవిధమైనచర్యయు జరుపక మిన్నకుండిరి. విద్యాధికారు లప్పుడప్పుడా పాఠశాలను బరీక్షించుటకై వచ్చినను, అయ్యది నామమాత్రముగనే యుండెను. వారాయుపాధ్యాయుని యతిథి సత్కారములచే తృప్తులై

జదవెను. తరువాత బెజవాడవెళ్ళి మిడిల్‌స్కూలునందు జేరెను. కొన్నాళ్ళచ్చట చదువుచుండఁగనే యాతఁడు చదువుట కిష్టములేనివాఁడయ్యెను. దీనికిముఖ్యకారణ మతనికి విద్యయందు చురుకుదనములేక, పాఠములు చక్కఁగా రాకపోవుటయు, బడిలో తోడిబాలురమధ్య పాఠములు రానప్పుడెల్లను పంతులు దండించుటయు, నతఁ డదియందఱిలోను తనకు చిన్నతనముగా నుండుటయు ననునవి. ఇవిగాక యింకను కొన్నిగలవు. బెజవాడపట్టణమని పేరేగాని విద్యార్థులకు వసతులు చాల తక్కువ. వసతిగృహము లాతఁడు చదువుకాలములో లేవు. అందుచే నాతఁడు పూరిమూలలగల పూటకూళ్ళ యిండ్లకడ భుజింపవలసియుండెను. ఆభోజనశాలలు మిక్కిలి యనారోగ్య కరములుగా నుండెను.

వ్యాపారములోని మంచిచెబ్బరలు మన దేశస్థులకు బాగుగా తెలియవు. దినికి హేతువు మనము వ్యవసాయమే ముఖ్యవృత్తిగానుంచుకొనియుండి యితరకార్యములపట్ల విముఖత జూపుటయే యని పలుకనగును. దీనికితోడు దరిద్రనారాయణునికి వాసస్థానమైన మనదేశములో నేపట్టణమునందైనను వ్యాపారమున శతకోటిదరిద్రములకు, అనంతకోటియుపాయములు సాధింతురు. కాని యింవొక్కటియైన నమ్మకమైనట్టియు, స్వల్పలాభము గోరునదియు నాలోచించి యారంభింపరు. విశాలహృదయ మనునది లేనేలేదు. పల్లెటూరు గొల్లదిఅమ్మువాలు, నేయు, పెరుగు మొదలు వర్తకులమ్ము అన్నివస్తువుల సరకును ధరల మాట అటుండనిచ్చి సరుకు దగాచేయుదురు. ఏదేశమునుండియో వచ్చు పాలడబ్బాలు, బిస్కత్తులు, వెన్న మున్నగునవి యెంతనమ్మకము గనున్నవో చూచుచుగూడ మనదేశస్థులు వ్యాపారనమ్మకము, దాని లాభములు తెలుసుకొనజాలకున్నారు.

రాజశేఖరము భుజించు భోజనశాల యొకవైశ్యునికి జెందినది. వానిపూర్వస్థానమేదియో యొక పల్లెటూరు. అచట భుక్తి గడువకపో

యునందున నాతఁడీపట్టణమునకు కొలదికాలముక్రిందటనే వచ్చి యీ శాలను నిర్మించెను. కోర్టులకు వచ్చువారును, సరకులనిమిత్తమువచ్చు వారును కలసి చుట్టుప్రక్కల గ్రామములనుండి బెజవాడ కి శేషజనము నిత్యము జేరుదురు. వారందరిట్టిచోట్లనే బసజేయుదురు. వారి మొగము లజూచి వైశ్యుఁడు బజారునకేగి మఱబియ్యముదెచ్చి వెంటనే వంట జేయును. ఆబియ్యము నెప్పుడు బాగుచేయించుటయేలేదు. ఇఁక బజారులో నేకూరచౌకగానుండునో దానినాతఁ డాదినము దెచ్చును. సాధారణముగా మంచికూరలెప్పుడు విలువగలవిగానేయుండును. గనుక వాని జోలికీతఁడు పోనేపోడు. పప్పు నామమాత్రముగానుండి చారును మరపించుచుండును. కూరలలోవేయు తిరుగబోతలో కంపునూనె కొంచెము వేయును. మంచినేయి యీపట్టణముననే దొరకదు. దొరికినను, ధనవంతులకే యదిచాల జాలకయుండును. అందుచేతనే నూనెయో క్రొవ్వో మఱొక్కటో కలిసిననేయినే యాత డమృతమువలె వాడుచుండును. పల్లెలనుండి తెచ్చిన గొల్లచల్లనుకొని యాతఁడు మజ్జిగక్రింద నుపయోగించును. ఈతఁడు తక్కినవారందఱికన్న పూటకొక యర్ధణా తక్కువకు బెట్టుచుండుటచే దానికాశపడి పొరుగూరువారు చాలమంది యిచ్చటకే జేరుదురు. భోజనమైనతరువాత నాతనిదూషింపనివారరుదు. అట్టివారితో నాతఁడు "అయ్యా! ఈదినమేదియో పొరపాటున కూరలుబాగుండలేదుగాని రాత్రికి ఉండిచూడండి! మా 'హోట'లన్నిటికన్న బాగుగా నుండనిదే యింతజనమువత్తురా? నెలలు కొలదివిద్యార్థులు గూడ యిచ్చట భుజించుచున్నారు. "అని యేవో ప్రగల్భములు పల్కి వారిని మాటలతో దృప్తిపఱచిపంపును.

పల్లెటూరిలో చక్కగా కమ్మనినేయి, గడ్డపెరుగు, మంచిపాలు కావలసినవియెల్ల మత్తుగా భుజిరచుచుండిన రాజశేఖరమున శాలలోని భోజనమిష్టముగాకుండెను. అప్పుడప్పుడితనికిజబ్బు జేయుచుండెను. ప్రతిశని

ఆదివారములలో నీతఁడింటికి వెళ్ళుచుండెడువాఁడు. ఆరెండు దినముల మాత్రమే యాతఁడు తృప్తిగా నింటికడ భుజించుచుండెను. తరువాత బెజవాడలోనున్న దినములు పస్తుగనే గడుపవలసి వచ్చెను. ఆభోజన శాల మార్చి మరొకదానిలో బ్రవేశించి చూచెనుగాని యిదియు నట్లే యుండెను. ఈబాధలన్నియు బడలేక చదువున కొక దండమును పెట్టి రాజశేఖర నింటికి జేరెను. తండ్రికొక్కఁడే కుమారు డగుటచే నాతని కయిష్టముగా నేమనుటకు తండ్రిసాహసింపఁడయ్యెను. పనిలేని మాచకమ్మ పిల్లితలనొరిగినదను సామ్యముగా నాతఁడు క్రమముగా గ్రామములో తనవంటి నిష్ప్రయోజక నిరుద్యోగ సంఘములో జేరుకొనెను. నిత్యము వారితో కబుర్లు జెప్పుకొనుచు కాలముగడపువాఁడు. ఎప్పుడో యొకప్పుడు దప్ప రాజశేఖరము పొలము జోయి యెరుఁగడు. ఆతఁడిప్పటికి పదునారేండ్ల వాఁడైనాడు. ఆతని కిరువది యకరముల పల్లపుభూమిగలదు. అందుచే నాతని తల్లిదండ్రులా భూమితోనే తృప్తి వహించిరి. అందుచే వారికి కుమారుని విద్యవిషయమున శ్రద్ధవహింపఁ దలంపు లేకపోయెను.

కమలాకాంతుని పూర్వికులు వన్నెయు వాసియుగల్గినవారు బ్రిటిషుపరిపాలన మనకురాకపూర్వము వారు హైదరాబాదునవాబు కడను, వెంకటాద్రినాయుడు మున్నగు జమీందారీ ప్రభువులకడను దేశపాండ్యాలుగానుండి రైతులవద్ద కప్పములువసూలుజేయుచు నాయాగ్రామముల పాలకులుగానుండుచువచ్చిరి. ఆకాలము మారిపోగా క్రమముగా వారివద్ద నపుడప్పుడు బహుమతిగాబడసిన యీనాములతో వారివంశీకులు కాలక్షేపము జేయసాగిరి. వారందరు సహజముగా సౌదార్యసంపన్నులు. వారి దాతృత్వముక్రింద వారికి వచ్చెడి రాబడులు చాలకపోయెడిది. అప్పుడప్పుడు వీరందుచే భూము లమ్మివైచుచుండిరి. ఇట్లు రాను రాను కమలాకాంతుని తండ్రి కాలమువచ్చువరకు

వారిక్రింద నలుబది యకరముల లుండెను గాని యాతఁడుగూడ కుమా రుల విద్యకును, తన దాతృత్వమునకు వ్యయపరచుచు వచ్చుటచే యిటీవలెనే నగముభూమిని విక్రయించివేసెను.

కమలాకాంతుని కిర్వురు సోదరులు గలరు. వారింకను చిన్న వారుగనే యుండిరి. ఒకఁడు నాల్గవఫారమును ఇంకొకఁడు రెండవఫార ములోను చదువుచుండిరి. వారితండ్రి వారికిద్దరికి వంటజేసి పెట్టుట కొక దాసినేర్పాటుజేసి, బెజవాడయందొక గృహమును నెలకు నదునైదు రూప్యముల కద్దెకు దీసుకొని యందు వారిని ప్రవేశ పెట్టెను. వారి వ్యయములన్నియు సీరీతినే యున్నను, పిల్లలు మాత్రము విద్యా విషయ మున శ్రద్ధాళువులై, యితరాలోచనలు లేక విద్య నభ్యసించు చుండిరి. కమలాకాంతుడు మిక్కిలి రూపసి, బంగారుచాయవంటి మేనును, నీలములగు కుటిల కుంతలములను, సరోజ సన్నిభమగు ముఖ విలాస మును, విశాలమగు వక్షస్థలమును, ఆజాను బాహువులను గల్గి యాతఁడందగాడని పించు చుండెను. ఆతని సుగుణపుంజములే యాతని సహజ లావణ్య సౌందర్యమునకు మఱింత వన్నె దెచ్చుచుండెను. పిన్న పెద్దలయందెట్లా దరణముండవలయునో, తల్లిదండ్రుల, బంధు మిత్రా దుల నెల్లరి నెట్లుచితరీతి గౌరవింపవలయునో యాతని వలన నేర్వదగి యుండెను. అయినను ప్రహ్లాదుని వలె నాతఁడు పట్టిన పట్టునే సాధించు స్వభావముగల వాడుకాడు.

కమలాకాంతుఁడు చిన్నతనములో స్వగ్రామమున జదువుకొను చున్న దినములలో కమల యాతని నెఱుఁగును. ఆతఁ డప్పుడప్పుడు సెలవులలో ప్రకాశమింటికి వెళ్ళి అప్పగారితో ప్రొద్దుపుచ్చుటయు గూడ కలదు. అప్పుడు కమల యాతనివద్ద నాడుకొను చుండెడిది. వేడుకకై యాతఁడు కమలను జూచి 'అమ్మాయీ! నీవెవరిని పెండ్లి జేసుకొనెదవో చెప్పుము.' అని యడుగువాఁడు. పెండ్లియన నేమియో

దమయభిమతమును సరళముగనే వ్రాసిపోవుదురు. ఇట్టివ్రాతలా పాఠశాలా విజిటింగుబుక్కునందెన్నియోగలవు కాని వీనికిని బాలికలవిద్యాభివృద్ధికి నేమాత్రము సంబంధము లేకుండెను. ఇట్టిసందర్భములలో కమల కెంతవిద్య యబ్బునదియు, పాఠకమహాశయులు సులభముగా గ్రహింపగలరుగావున వివరింపఁబనిలేదు. అందును తల్లిదండ్రుల కొక్కటేబిడ్డయగు కమల యతిగారాబముచే చీమచిటుక్కుమన్నను బడికిపోక యింటివద్దనే సంచరించుచుండును. తమబాలిక యెప్పుడు తమ కండ్లయెదుటనే యుండఁగోరికఁగల యాదంపతులామె భావ్యభివృద్ధి నభిలషించువారయ్యును దానికిదోహద మొనరింపఁగల తెరువుల నన్వేషింపకనే చాలకాలము బుచ్చిరి. ఇంతలో కమల సంప్రాప్త యావ్వనియయ్యెను.

ప్రకాశముగారి కింతవరకు సంసారమునందమితమైన వ్యయము లేనందున యేటేట నయుదారువందల మూప్యములు వెనుకబడుచుండెను. అట్లేర్పడినమొత్తము నాలుగైదువే లయ్యెను. ఈధనముతో నాతఁడు పుత్రికావివాహము జరపిన బాగుండునని నిశ్చయించుకొని సుశీల యభిప్రాయముపైని యనుకూల వరాన్వేషణము సలుప నారంభించెను.

దగ్గఱబంధువులలో సుశీలకు పినతండ్రి కుమారుఁడొకఁడు కలడు. ఈతఁడు పాఠశాలాంతిమ పరీక్షలోనెగ్గి యొక యుద్యోగమున ప్రవేశించియుండెను. ఈతనికి పెద్దయాస్తిలేదుగాని గుణసంపదులలో నసమానుఁడు. ఈతఁడు తనయుద్యోగమున పెద్దయధికారుల యనురాగమును స్వల్పకాలముననే బడసి యున్నతపదవి నధిష్టింపఁగల శుభసూచనలు కన్పట్టుచుండెను. కమల నీతనికిచ్చి పరిణయముజేయుమని సుశీల భర్తతో తన యభిప్రాయ మొకనాఁడు తెలియపఱచెను.

ప్రకాశమందుకు సమ్మతింపఁలేదు. ఆయన యుద్దేశ్య మింకొకవిధముగా నుండెను. "ఈకాలములో నుద్యోగముపై నాధారముపడి

మెవ్వరును కన్యనీరాదు. ఆతని సుగుణసంపత్తి శ్లాఘ్యమైనదే. ఐనను తగినంత రాబడిలేనిదే యుద్యోగములు శాశ్వతములు కావు. ధనమూలం మిదంజగత్ వెలువిడచిన మేనమామకుమారుడని యొకవేళ రక్త సంబంధమున కిచ్చగించుటయుగూడ నీదినములలో ప్రమాదకరమే. ఇది శాస్త్రగర్హితమటుండనిచ్చి, యారోగ్యమునకుగూడ చేటని నవీనశాస్త్రజ్ఞుల సిద్ధాంతమగుటచే విసర్జనీయము. కమలాకాంతునికిచ్చినచో నన్నియు చిక్కులే యుండును." అని ప్రకాశముగా రామెకు బదులు చెప్పెను.

సుశీల కామాటలు నచ్చలేదు. "అట్టయినచో, మీ రెవ్వరికీయ నుద్దేశించుచున్నారు?" అని ప్రశ్నించెను. ప్రకాశమంతట "విమలానందముగారి రాజశేఖర మన్నిట దగినవాడనుకొందును. వారికి భూవసతి చాలకలదు. విద్యావిషయమున గొంచెము వెనుకంజయనుమాట వాస్తవమేగాని తక్కినవిషయము లన్నిటిలో నాతడు కమలాకాంతు నక్కుడీసిపోడు." అనెను. సుశీల యింతటితో నాప్రస్తావము ముగించి తనలో నాలోచింపసాగెను. ఆమె యాలోచించుకొనుకొలది కమలాకాంతుడే యన్నివిధముల మెరుగుగా గన్పట్టుచుండెను. కాని సాహసించి గట్టిగా జెప్పినచో ప్రకాశ మొప్పుకొనునట్లు కనుపడలేదు. మీదుమిక్కిలియాగ్రహపరవశుడగును. అందుచే నిదిగాదు మార్గమని సుశీల యాతనిజూచి మనవాండ్లందఱితో నాలోచించి యేదియో యొకటి నిశ్చయము పరచుదము. ఇంతకు మన కమలయుద్దేశ్య మెట్లున్నదో!" అనెను. ప్రకాశమంతట దానినందుకొని "కమలయుద్దేశ్యము నీయుద్దేశ్యమున కేమిలే! దానినెవరు గమనింపనున్నారు? ఏదియో నోటికివచ్చినట్లు ప్రేలుదురు. మీతల్లిదండ్రులతోగూడ నాలోచించి నిర్ణయించెదనులె" అని పలికెను. ఆనాటిసంభాషణ మంతటితో ముగిసెను. రాజశేఖరము చిన్నతనములో పాఠశాలలో బ్రవేశించెను ఉండవల్లిలో నాల్గవతరగతివరకు

మెఱుఁగకమున్నే యిట్టిలాటి మాటలనాలకించి తానుగూడ యట్లే మాట్లాడుట కలవరచుకొన్న బాలికయు నాతనిజూచి 'నిన్నే నిన్నే' అని యమాయికముగాబదులుచెప్పెడిది. సుశీలయు, కమలాకాంతుఁడు నా బాలిక మాటలకు నవ్వుచు నానందరస నిమగ్ను లయ్యెడివారు. కమలాకాంతుఁ డంతట 'కమలా! నేను నిన్ను చేసుకొనను. ఇఁక నెవ్వరు పెండ్లాడుదురు?' అని తిరిగి ప్రశ్నించువాఁడు.

కమల కేమియు దోచక 'నీవు చేసుకొనకపోయిననో మానాయనను చేసుకొనెదను.' అని యనెడిది. 'ఛీ! అట్లనరాదు. బావనే చేసుకొనెదనని చెప్పుము, అని సుశీల యుపదేశించెడిది. ఆప్రకారమె కమలయు మఱల పల్కెడిది. కమలాకాంతుఁ డిట్లు క్రమముగా నాబాలికతో చిన్నతనమునుండి సహవాసము చేయుచుండుటచే నాతనిజూచి నంతనే కమల పరుగెత్తిపోయి కౌగిటలో గూరుచుండును. ఆతఁడు గూడ దానికి తన్మయుఁడగుచుండెను.

కమలాకాంతుఁడు విద్యార్థనకై పట్టణమునకేగిన దాదిగా వారిరువురకును కొంచెమెడ బాటుగల్గెను. ఎప్పుడో సెలవులలో దప్ప సాధారణముగా నాతఁడు వచ్చుటలేదు. వచ్చినప్పుడుమాత్రము కమలను చూచియే వెళ్ళువాఁడు. పట్టణములలో నుండిన భోజన శాలలలో వసతి సరిగాలేనందున కమలాకాంతుఁడు క్రమముగా చిక్కిపోయెను. ఒకనాడాతఁడు ప్రకాశమింటికి వచ్చినప్పుడు కమల యాతనిజూచి నవ్వుచు 'బావా! నానాటికి సన్నపు నూలువడకుచున్నావేమి?' యని పరిహాస సూచకముగా కుశలప్రశ్నము గావించెను. కమలాకాంతుఁడు దరహాసిత వదనారవిందుఁడై 'కమలా! నిన్నుజూడని బెంగతో నట్లున్నాను. అని పలికి యామాటకు కమల కొంచెము సిగ్గుపడగా మఱల నామెనుజూచి' పట్టణములలో భోజన సౌకర్యము కుదరదు. మాబడికి విద్యార్థివసతి గృహములేదు. కలకత్తా బోఁ

బాయి మున్నగు పట్టణములలో నట్టివి గలవఁట. అవి యున్నచో నారోగ్యమునకు భంగముండదు. ఇదిగాక రాత్రింబవళ్ళు చదివినగాని యీపరీక్షలో నెగ్గుట కష్టము. అందుచే రాత్రిళ్ళు నిద్ర తక్కువ. దానికేమిగాని, నీవు చదువు మానివేసితివా? 'అని పల్కి మఱల కమల ను యథాసంభాషణములలోనికి గొనితెచ్చెను.

కమల కప్పటికి పన్నిండేండ్ల ప్రాయము వచ్చినది. అనురాగల త యప్పుడే యామె మనః ఫలకమున దృశ్యమానమగుచుండెను. యుక్తా యుక్త వివేక నాజ్ఞానముగూడ కమల కప్పుడు బొడసూపు చుండెను. కమలాకాంతుని ప్రశ్న కాబాలిక కొంచెము సిగ్గుపడి, 'ఈబడిలో చదువు బాగుగా చెప్పుదురుబావా? అయినను నాకిఁక చదువుకొనుటకు వీలుగాదు. అమ్మకు పాచపనులలోనైన సాయప డనిచో నామె యొక్కతియే గృహ కృత్యములన్నియు నిర్వహించు టకు వీలుకాదుగదా.' యని బదులు పల్కెను.

కమలాకాంతుఁ డంతట 'కమలా! నీవు బడికి పోవ నక్కర లేదుగాని యింటివద్దనే తీరికవేళలోచదువుకొనవచ్చును. మానినీశతకము, కుమారీశతకము, దాశరథీశతకము, సంగమేశ్వరశతకము, స్త్రీలపాటలు, పద్దెములు, అన్నియు నీవింటివద్దనే పఠింపవచ్చును. దానివలన నీవి ద్యాబుద్ధు లెన్నియో రీతుల వికసింపఁగలవు. ' అనెను. ' మరి రుక్మి ణీకళ్యాణమో' అని కమల ప్రశ్నించెను. కమలాకాంతుఁడు నవ్వుచు ' నీకళ్యాణ మప్పుడు రుక్మిణీ కళ్యాణము బఠింతువులే ఇప్పుడు నీకది యర్థముగాదు ముందుగా శతకములు, పాటలుచదువుకొనుము' అని పల్కెను. కమలపనిపాటల కొరకై లోనికేగెను. కమలాకాంతుఁడును స్వగృహమునకేగెను.

రాజశేఖరముగూడ యప్పుడప్పుడు కమలగృహమునకే వచ్చు వాఁడే గాని యాతనికి పిల్లలను కొట్టి యేడ్పించుటయన్న మిక్కిలి

యిష్టము. అందుచే నాతఁడు కమలను బిలిచి శ్లోకమైన పద్యమో పాటయో చదువుమని నిర్బంధించి, సిగ్గుచే నాబాలిక చదువకయుండఁగా మొట్టికాయల గొట్టువాఁడు. ఆబాలిక యేడ్చుచుబోయి తల్లినద్ద మొర బెట్టుకొనెడిది. "ఎగతాళికొరక దెబ్బవేసినాడేమో మాకబిడ్డ. అందుల కింతగ నరువవలయునా. మఱి, పద్దెము చదువుమన్న నేల చదువకపోయితివి? నీదేతప్పునుమీ" అని సుశీల సాంత్వనవచనములతో నామె దుఃఖమును, కోపమును చల్లార్చుచుండెడిది. ఇదియంతయు కమల చిన్న తరగతులలో విద్యనభ్యసించునప్పటిమాట అప్పటినుండియు రాజశేఖరమును గాంచినంతనే మొఖముదప్పించి పాఱిపోయెడిది. ఆమె సత్పురింద్రియములు కాతని వదనమండలము గన్పడినంతనే భయతాపము లామెను వేంబడించెడివి. అందుచే నాబాలిక కాతనియెడల నేవిధమైన యనురాగాంకురములుగాని యుద్భవిల్లవయ్యెను.

రాజశేఖరము చదువుమానివేసినతరువాత నంతగా కమలను జూడవచ్చుటలేదు. ఎప్పుడైన కదాచితుగా వచ్చినను, విద్యాప్రసంగ మాయింట లేదయ్యెను. ఏలన, నాతఁడు విద్యమానివేసినవిషయమంతయు నేకరువు బెట్టవలసివచ్చుననియు, నది తన కవమానకరమనియు దలంచియే యట్టి సంభాషణ మొనర్చుటలేదు. కమలను పరిశీలించుట కాతఁడుమునుందు విద్యయం దారితేరినఁగదా! ఒకవేళ కమల "బావా! నీవేమి చదువుచున్నావు? చెప్పుము. ఆడపిల్లకు నాకెందుకులే చదువు? నీకుకావలెనుగాని" అనినచో నేమగునుఇట్టి యాలోచనలే యాతని యంతరంగమున బ్రవరించుచుండెను.

కమలకు వివాహము చేయవలసిన సమయము వచ్చెను. ప్రకాశముగా రంభచే నేదియో యొక మనుము నిర్ధారణ చేయవలసియుండెను. ఒకనాడు ప్రకాశము తన యత్తగారింటికివెళ్ళి మామగారితోను అత్తగారితోను మనుము విషయముప బ్రస్తావించెను. లెస్సగా నాల్గో

చించినపిదప వారు మనుమరాలిని కమలాకాంతునికే యొసంగుట లెస్సయని తమ యభిప్రాయము నెఱింగించిరి. అంతటితో ప్రకాశ మాలోచనా నిమగ్నుఁడై స్వగృహమున కేతెంచి యావృత్తాంతమును భార్యకు రహస్యముగ దెల్పెను.

లోకులు కాకులవంటివారను సామ్యము గలదు. ఒక్క కాక మరచినచో తక్కినవన్నియు గూయమొదలిడును; లోకులునట్లే. ఒక్క విషయమేదైన రహస్యమనినచో నది వెంటనే పైకివచ్చును. అది యా బాలగోపాలము మహత్తరముగా జెప్పుకొందురు. చివరకది వడ్లగింజ లోనిదే బియ్యపుగింజవలె నుండును. ఉండవల్లిలో ప్రకాశముగారి కుమారిత వివాహము జరింపఁబోవుచున్నారనియు, కమలాకాంతుని కితను కూతునిస్తురనియు జనులలో బలముగు వదంతి బయలుదేరెను. కమలాకాంతుని తల్లిదండ్రులకిది యాశ్చర్యకరముగనే యుండెను. తమ కుమారుఁడొక చిన్నయుద్యోగమున నున్నను, ప్రకాశమువంటి ధనవంతుఁడు పిల్లనిచ్చునాయని సందేహింపసాగిరి. ఐనను జనవాక్యంతు కర్తవ్యం" అనిగదా పల్కుదురు. ఇది పొసగినచో మంచిదేయని వారు తలంపసాగిరి. వారిభావములు వారి ముఖవిలాసములందును సంభాషణములలోను గానవచ్చుటచే లోకులీ పరిణయము నిశ్చయమనియే తలంచుచుండిరి.

ప్రకాశమింకను యుక్తమిత్థమని నిర్ణయింపఁడయ్యెను. ఆతనికింకొక పట్టుదల కూడ కలదు. తాను మనసారయిచ్చిన కట్నములు కానుకలతో సంతసపడువారితో మాత్రమే యాతఁడు వియ్యమొందఁగోరును గాని యెంతటిధనాఢ్యుఁడైనను, కట్నమాసించినచో నాతని సంబంధము మాత్రము తృణప్రాయముగ నెంచుటమేలని యూహించుచుండు వాఁడు.

సుశీలయు, కమలయు, రాజశేఖరము తల్లియు, కమలాకాంతుని తల్లియు మఱికొందఱు సువాసినులు లోకనాథు పేరంటమునకై యొకరింటికి బోయిరి. పేరంటమునన-చో నాథువాండ్ర కమితోత్సాహము. ఆనాడు వారు కోరిన చీరెయు కోరిన రవికయు, కోరిననగలును ధరించుకొని తమవిలాసమెల్లను చూడవలయునని యెన్నియో విధముల శృంగారించుకొని యుప్పొంగుచుందురు. ఆపేరంటమున నెవ్వరిసంభాషణ మాలించినను ఈచీర నెక్కడకొంటివమ్మా! ముచ్చటగనున్నది. ఈగజ్జెలవడ్డాణమెబత్తుడు చేసినాడమ్మా! చాలయందముగ నున్నది. ఎన్నిసవరనులు పెట్టినారు? ఇట్టివాక్యములే వినవచ్చుచుండెను. అప్పుడొక స్త్రీ సుశీలను జూచి "మీకమలకు వివాహము జేయబోవుచున్నారట నిజమేనా?" అని ప్రశ్నించి కమలవంకజూచి "కమలం! నీకెంతకట్నము గావలెనే! మీ అయ్యగారి సొమ్మంతయు దోచుకొనిపోదువుగాబోలు" నని పరిహాసమాడెను. దానికి సుశీల "అమ్మా! లగ్నము వచ్చినపు డదియే జరగును. అందును మనప్రయత్నమేమున్నది? అంతయు నీశ్వరకటాకటాక్షముగదా! కట్నములకేమిలే! కట్నములు మేమియ్యగలమా? ఎవరో దానికి తగినవాడు వచ్చును." అనెను. రాజశేఖరుని తల్లి యామాటలందుకొని "కమలకు నాలుగువేల కట్నమిచ్చినగాని, ఈదినములలో మంచివరుడు రాడు. కట్నమునకు లోభించి యెవ్వరినైన చేయుట మంచిదిగాదు" అని పల్కెను. "మనము చేయవచ్చిననాటిమాటలుగదమ్మా! ఇంతకు కళ్యాణపు గడియలువచ్చిన-చో మనమాపలేముగదా అని సుశీల బదులు పల్కెను ఈమాటలన్నియు విన్నకొలదిని కమల సిగ్గుపడెను. అంతట తల్లితో "ఇంటికిపోదముపదవే! నాన్న వచ్చువేళ యైనది. ఆయనకు ఫలహారము సిద్ధముచేయువలయును" అని పల్కెను. పిమ్మట వారిద్దరు నిష్క్రమించిరి. వారిద్దరు నిష్క్రమించినంతనే కమలాకాంతుని తల్లికడ నెవ్వరో యాప్రసంగము

దెచ్చిరి. వారితో నామె "కట్నములకేమి? ఎవరిపిల్లకువారు పెట్టుకొన కుందురా? వారినడిగి పుచ్చుకొనుటొక ఘనతయా! అట్లుపుచ్చుకొనిన-చో విక్రయముతో సాటియేదా. ఇంతకు వధూవరు లన్యోన్యాను రాగ సంపదతో నుండుట జూడవలెనుగాని తల్లిదండ్రులు కట్నముల నుగాని, కేవల విద్యాధనవిషయముల నొక్కొక్కటి పరిశీలించిగాని దానితోనే తృప్తిపడవచ్చునా? అన్నియు పరిశీలించి చేసిన వివాహమే వివాహముగాని లేనిచో నెందుకమ్మా! చిన్నమ్మగారి తిలకమ్మను చూడుము. ఆమె కెంతధనముండినేమి. ఆమెభర్త యెంతవిద్యాధికుడైన నేమి! ఆమె యేమాత్రము సౌఖ్యపడుచున్నది. మనకందఱకు తెలియదా? అందుచే కులశీల వయోగుణ విద్యా ధన సంపదలన్నియు సమానముగా నుండవలెను గాని యొక్క ధనమేమిచేయును? మఱొక్కటి యేమిచేయును?" అని యుపన్యసించెను. అది విన్న పేరంటాం డ్రందఱు బాగుగానున్నదని తలకాయ లెగురవైచిరి. అంతటితో నెవ్వారి యిండ్లకు వారేగిరి.

తిలకమ్మ భర్త పట్టపరీక్షాభద్రుడై యొక యుద్యోగమున బ్రవేశించెను. కాని యాతనికి పాశ్చాత్య సాంప్రదాయముగా త్రాగు డలవాటయ్యెను. ఆతడెప్పుడు త్రాగిన మత్తతచే నొడలు దెలియక భార్యను కొట్టుచుండువాడు. ఆతడు క్రమముగా పదభ్రష్టుడయ్యెను. కాని త్రాగుడు మానలేకపోయెను.

పై సంభాషణమంతయు సుశీలకు మఱునాడే యిరుగింటి పొరుగింటి వారు చెప్పిరి. అది చివరకు ప్రకాశముగారి వరకుపోయెను. కన్యావరవిక్రయములన్న మండిపడు ప్రకాశ మీసంభాషణనే లోలోన చర్చించుకొనుచు నాలోచింప సాగెను. రాజశేఖరునితల్లికి కట్నముపై నాసయున్నట్లామె మాటలవల్లనే దెలియవచ్చెను. అదియు కొంచెము గాదు. దాదాపు నాలుగువేలు రూప్యములు ఇట్టి వరవిక్రయము

జేయుట మహాపాతకమని యాతఁడు భావింపసాగెను. అందుచే నాతని మనస్సెటులను పాఁపోక త్రొక్కులుపడుచుండెను. ఇంతలో నాతనికి తిలకమ్మ వృత్తాంతము జ్ఞప్తికి వచ్చి మనస్సును కలత పెట్టెను. విద్యాధనములు రెండును జేకూరిన తిలకమ్మ భర్తయేమి చక్కఁగా నున్నాఁడు ? ఎవరెవరికర్మాను సారముగా యోగతులు గల్గును గాని చదువులోను ధనములోను నేమిగలదు? ఇట్లని తలపోయసాగెను.

ప్రకాశము మేనకోడలనే వివాహము చేసుకొనెను. ఆకాలములో నిట్లు కన్యావరవిక్రయములులేవు. తగిన వరుఁడని తెలిసినగాని యెంతటి వానికైనను పిల్లనీయరు. వరుని తల్లిదండ్రులలో బంధువులలో యాతని ఋజు ప్రవర్తనమును గాంచి సంతృప్తి పడిన పిమ్మటనే యెచ్చటనైన పిల్లను మాటలాడుదురు. పిల్లకొరకు వెళ్ళిన వారిని పిల్లవాని యోగ్యతల నన్నఁటిని జెప్పుమని పిల్ల తల్లిదండ్రులు కోరుదురు. ఆయోగ్యతల కిష్టపడినచో పిల్లనిత్తుమందురు. లేకున్న లేదు అంతేగాని కట్నము లెవ్వరు నడుగగూడదు. అందుచే పెండ్లాడ నున్న యువకుఁడు విద్యావినయ సంపన్నతచే నుండవలసినవాఁడగు చున్నాఁడు. తనకు దానై ప్రేమతో కుమార్తెకు నలునికిని మామగారు యథోచితముగా నొసంగెడి ధనధాన్య వస్త్రాలంకారములు గాని భూవిశేషములుగాని యెక్కడనైన ధనవంతుల వివాహములలో నుండినను అయ్యవి గౌరవచిహ్నముగా నుండెడివి. ప్రతిభ కాసించి నలుగురిలో చదివించిన బాగుండునని చదివించెడువారు గూడ కలరని చెప్ప వచ్చును. ఐనను నిరాఘాటముగా నీకాలములోవలె గుండెనిబ్బరము జేసికొని కోడెదూడల వ్యాపారముఁవలె కట్నములను బేరము జేయువారుమాత్ర మాకాలములో నొకండునకైన లేదని ఘంటాపథముగ నుడువవచ్చును. పేరు ప్రతిష్ఠలకైన నల్వురిలో ప్రాకులాడుచుండిన కాలము గతించి మన దురదృష్టవశమున నిది సంభవించి యీనూతన

వాతావరణములో ఒక్కపోవు చుండుటకు మనదేశస్థుల కెట్టి భావి పరిణామము గల్గుటకో గదా!

అత్త మామలగారి యభిప్రాయమును భార్య యుద్దేశ్యము నొకే ప్రక్కను బాగులాడుచున్నను ప్రకాశ మిదివరకు రాజ శేఖ రమునకే కమల నిచ్చి వివాహము జేయవలెనని తలంచు చుండెను. గాని నేటితో యా యాసలన్నియు యడియాసలే. యని నిశ్చయిం చెను. ప్రకాశమంతట సుశీలను బిలిచి 'ఏమే! మనము విన్నదాని నిబట్టి రాజశేఖరుని తల్లికి కావలసినంత కట్నము మనమీయలేమనుట నిజమేగదా. కమల నెవ్వరి కిమ్మందువో చెప్పుము.' అని పలికెను. సుశీల నవ్వుచు 'నాడే నేను మీకుచెప్పలేదా? వారి సంగతులన్నియు నిప్పటికి మీమనసున కెక్కినవి గాబోలు! కమలాకాంతున కిమ్మని మొదటనే నేను మీతో చెప్పితిని. అది మఱచిపోయితిరి. వారు మనమేమైన యిచ్చిన దీసుకొందురు. లేనిచో లేదు. వారి సాంప్ర దాయమట్టిది. ఇది గాక కమలకు గూడ చిన్నప్పటినుండియు కమ లాకాంతునిపై ననురాగము మెండు. వారిద్ద రొక్కచో నాడుచు, నొక్కచో బాడుచు నుండువారు. ఇంతేగాక నాతఁడిప్పుడే సర్కా రుద్యోగమున బ్రవేశించినాఁడు. అదృష్టమున్నచో పైకి రాఁగలడు. మీకాతనిపై నేల మనస్సుపోవుట లేదోగాని, మాకందఱి కాతఁడే తగినవాఁడనియున్నది. పైన మీ యిష్టము' అని శాంతముగా సమా ధాన మిచ్చెను. ప్రకాశమెప్పుడును గాని భార్యమాటను జవదా టుట కిష్టములేనివాఁడు అయిన నాతనికి విరుద్ధముగా పైకి మాట్లాడ నీయఁడు. తనపైనే భారముబెట్టినను దానిని యామె చెప్పినట్లే చేయుచుండును. మేనరికములు తగ్గించవలెనని ప్రకాశమునకు మన స్సులో నొకకోరిక యుండెను. దానిని గలుపుకొనియే యాతఁ డిది వరకు తన యభిప్రాయము మట్లుంచుకొనెను. కాని యాతఁడిక నవి

యుంచుకొనినచో ప్రయోజనము వ్యర్థమని గ్రహించెను. అందుచే కమలాకాంతునకే పిల్లనిచ్చుటకై నిశ్చయించుకొని యొక యాప్తుని ద్వారా తమ యభిలాషను నాతని తల్లిదండ్రులకు యుక్తకాలములో నెఱుకపరచెను.

ప్రకాశముగారు పిల్లనిత్తుమన్నచో చేసుకొనుట కనేకు లువ్విళులూరుచుండిరి. కేవల మాయనపైగల ప్రేమచే గాదిది. ప్రకాశముగారికి నూరు యకరముల భూమి గలదనియు నాతని కొక్కతే కుమార్తెయగుటచే నాయాస్తినంతయు నాబాలికకే వచ్చుననియు నూహించి ప్రతివారును సమయము నిరీక్షించు చుండిరి. అప్పు డప్పుడు ప్రకాశమున కితరులవద్దనుండి మాపిల్లవానికిమ్మని మాపిల్లవానికిమ్మని కబుర్లువచ్చుచునే యుండెనుగాని యవి యన్నియు చేయునప్పుడు మాటలుగలదాయని సమాధానము చెప్పుచు నాతఁడు పేక్షచేయుచుండెను. కాని రాజశేఖరుని తండ్రివద్దనుండిగాని కమలాకాంతుని తండ్రివద్దనుండిగాని యట్టికబురు లెప్పుడును రాలేదు. వారిద్దరెకటి మనసు నారయకుండి నెట్టిమాటనుగాని ముందుగా బల్కెడి యభ్యాసము గలవారుకారు. మితభాషిత్వమును పరహృదయాకర్షత్వమును గల్గిన యాయిర్వురు నాగ్రామములో నెన్నదగిన పెద్దలలోనివారు

ప్రకాశ ముద్దేశ్యముగనిపెట్టి యొక శుభముహూర్తమున నిద్దరు బంధువులువారియింటికి వచ్చి కమలాకాంతునికి పిల్ల నిమ్మని బహిరంగముగా నడిగిరి. ఆవచ్చిన బంధువుల కావాడు ప్రకాశము విందొనర్చెను. తరువాత నాతఁడు తన సమ్మతిని దెల్పెను. అంతటితో కమల పరిణయము నిశ్చయమైనట్లు వెల్లడియై పోయెను. గ్రామములోనితక్కుంగల వారిలో కొందరట్టి మహాద్భాగ్యము కమలాకాంతునికి జిక్కినందుకై పరితపింపక పోలేదు. కాని చేయున దేమిగలదు?

ఈర్ష్యయను నది క్రూరమైన గుణ గణములలో నొకటి. ఒకఁడీ ర్ష్యతో దేనికైనను జూచెనా యది భస్మీపటలము గావలసినదే. దృష్టి దోషమనునది యీర్ష్యా జనకమే మంచివస్తువులో వస్త్రములో ధరించి యొకఁడు బయటకేగినపుడొక్కఁడట్టి నేఖయులేక శుష్కదరిద్రుఁడై యుండుటచేత నేమి ఉండియు జాడలేకపోవుటచేతనేమి యీర్ష్యాసూయలచేతఁజూచెనా వానికానాడు తప్పక యేదో రోగమోమతే వైక ల్యమో సంభవించుట గలదు. ఇది మన హిందూ దేశవాసుల ప్రత్యక్షాను భవసిద్ధప్రమాణమని పల్వురు తలంతురు దీనిని కాదని త్రోసివేయువారు గూడ కొందరు లేకపోలేదు. గ్రామమని యున్న తరువాత నన్నికులషులు తెగలు నుండునుగదా అట్లే యందులో సో మరులు మూర్ఖులు, పండితులు. పెద్దలు, పిన్నలు అసూయా పరులు పరధన పరదారా సక్తులు పరశ్రేయోభిలాషులు మున్నగువారు పల్వురుందురు.

ఉండవల్లిలోగూడ నట్టివారుందురని వేఱుగ చెప్పనక్కఱయే లేదు. అందుచే నెవ్వఁడో నసూయాపరుఁడొకఁడు ముందుగా కమలా కాంతునికి కంటిచూపులో జబ్బునియు, నెప్పుడు నాతనినేత్రములవెంట నీరు గారుచుండుననియు పుకారు వ్యాపింపజేసెను. ఆతఁ డుద్యోగము నకు వెళ్ళినతర్వాత తఱుచుగా నిచ్చటికి వచ్చుటకు వీలులేకుండెను. అందుచే దానియధార్థ మెఱుంగుట కితరులు చాలకుండిరి. ప్రకాశము మాత్ర మేమియెఱుగఁగలదు? ఈర్ష్యాసూయలక్కచెల్లెండ్రు. మొదటి దానికన్న రెండవదింకను రెండాకులెక్కుడు జదివినది. ఈర్ష్యయన్ననో మంచిని నిగ్రహించి క్రోధము వహించును. కాని యసూయ మంచిని మంచిగా గ్రహింపక దానికి జెడును కల్పించును. ఈరెంటిలో భేదమి దియే. అందుచే నీర్ష్యకన్న యసూయమిక్కిలి నీచము. ప్రకాశమునకా వార్త వినననాటనుండి కొంచెము మనస్సంకోచ మేర్పడెను. కా

యాతని మాటను మరల్పుకొనుటకు మిక్కిలితప్పుగా దోచెను. అందు చే నేదియెట్లయినను సరే తలచినది తలచినట్లే జరుగవలెనని యనుకొ నెను. అందుచే నాపుకాటుకను లక్ష్యపెట్టడయ్యెను. తరువాత కొన్నాళ్ళ కింకొకఁడు పిల్ల కుబ్బసవ్యాధి గలదని యొకవదంతిని వ్యాపింప జేసెను. దానిని విన్న కమలా కాంతుని తల్లిదండ్రులుగూడ నామాటను లక్ష్యపెట్టరైరి. వారు సాధారణముగా బరుల మాటల నాలించెడివారేకాదు. పిమ్మట కొన్ని నెలలు గడువఁగా బెండ్లి కనుకూల మగు శుభదినములు వచ్చెను. మాఖ శు॥ ౧౪॥ లు వివాహము నిశ్చయింపబడెను. వారి యాచారక్రమమున పండ్లు పస్పులును పెండ్లి కూతురున కంపఁబడి కళ్యాణమునాడు ప్రధానము ముందుగాబంపబడెను.

కమలాకాంతుఁడు తన వివాహ నిశ్చయ వృత్తాంతమును తండ్రి వలన నెఱింగి పై యధికారులకు వ్రాసికొని యొక నెల దినములు సెలవుపుచ్చుకొనెను. ఆతని స్నేహితుల కందరికిని పెండ్లికి రమ్మని యాహ్వాన పత్రికలంపెను. తాను వివాహమునకు మూడురోజుల ముందుగా నుండవల్లి గ్రామము జేరెను. వెంటనే యాతని పెదతండ్రి గారొకరు పెండ్లికుమారుని జేసిరి. అంతటి నుండియు ప్రతివారును కమలాకాంతుని విందునకు బిలిచి, నూతన వస్త్రముల ధరింపఁ జేయుచుండిరి. పాప మాతఁ డెన్ని విందులని కుడుచును? ఎన్ని వస్త్రముల ధరించును.? అవి యన్నియు వేడుకకొరకేగాని నిజముగా నాతని కందేవియు నిజమైన సౌఖ్యము గూర్పవు. అయిన నాపరిణయోత్సాహములో నవి యొక లెక్కయా?

సుముహూర్తము సమీపించెను. వధూవరులు పెండ్లిపీటల నలంకరించిరి. సుశీలా ప్రకాశములు కమలాకాంతునికి కన్యాదానము జేసిరి. ఆతని పాదముల గడిగి యాతోయముల శిరస్సున జల్లుకొనిరి. అనేకము

లగు మేళతాళము లన్నియు దిక్కులు పిక్కటిల్లునట్లుగా మ్రోగుచుం డెను. ఆరణాగుణ ధ్వనులలో నచ్చట. విప్రులు పఠించు మంత్రము లెవ్వరికిని వినవచ్చుటలేదు. మాంగళ్యము మాత్రమందరి సాక్షిభూ తమైనట్లుగా వారి వారి హస్తములం బెట్టబడి తుదకది యామేళముల మధ్యనే వరునిచే కమల కంఠసీమయందలంకరింపఁ బడెను. అట్లావివా హము జయప్రదముగనే ముగిసెను. వచ్చిన బంధుమిత్రాదు లెల్లరికి పంచభక్ష్య పరమాన్నములతో ప్రకాశము విందుజరపెను. కళ్యాణము మరునాడు పేదలకన్న దాన మొనర్పఁబడెను. అట్లే నిత్య కళ్యాణము పచ్చతోరణమును నటుల నాపదహారు దినములు పండుగవలెనే జరి గిపోయెను.

కమలాకాంతుని సెలవై పోయినందున నాతఁడుద్యోగాభిముఖు డయ్యెను. ఎక్కడను నాళ్ళత్త గారింటికడ నుండుటకు వీలుగా లేదని యత్తమామలు విచారించిరి. కమల విషయము చెప్పనక్కఱయేలేదు. వారికేదియో సమాధానముజెప్పి కమలాకాంతుఁ డుద్యోగమునకు బోయెను. పండుగ పబ్బములలో మాత్రమాతఁడు ప్రకాశము గారిం టికివచ్చుచుండెను. అప్పుడు వారు నూతన వస్త్రముల ధరింపఁజేసి, యేక్రొత్తవస్తువుల నేదియైన బహుమతిగా నిచ్చియో కమలాకాం తుని మఱల సాగనంపువారు. ఇట్లు కొంతకాలము జరిగెను.

కమల కింకను గర్భాదానము చేయలేదు. రజస్వలోత్సవము లన్నియు దీరిపోయినవి. వివాహమునకువలె గర్భాదానమునకును గృహప్రవేశమునకును మనజ్యోతిష శాస్త్ర సిద్ధాంతము ప్రకారమను కూల ముహూర్తములు దొరకుటదురు. అందుచే కమల పునస్సందా నమొక వత్సరము వరకాగిపోయెను. కమలాకాంతుని కింతలో మరల శలవుగోరు యవకాశము గూడవచ్చెను. ఈమారొక్కటేసారి యా తడు మూఁడునెలల సెలవుదీసుకొనెను.

కమలాకాంతుఁడింటికి వచ్చినంతనే పునస్సంధానము జరిగెను. ఆనూతనవధూవరుల సమాగమ సౌఖ్య మెట్టిదియో వివరింప బని లేదు. అత్తయు నొకయింటి కోడలే యను నట్లు గృహస్థాశ్రమము లోని ప్రతిపురుషుఁడు స్త్రీయును నట్టి సౌఖ్యము రుచి చూచియున్న వారలే. ఆవధూవరులకే మూఁడు మాసములు మూఁడు దినములు గా గడచి పోయెను. ఇక కమలా కాంతుఁడు మరల నుద్యోగము నకు వెళ్ళవలసి యుండెను. అత్యంత విషాదమనస్కులై యాదంపతు లు విడి వడిపోయిరి. కమలాకాంతుఁడు గుడివాడలోని తాలూకా యందు గుమాస్తాగ నుండెను. ఆతఁ డిప్పుడు క్రమముగా సముద్దా రుద్యోగము లోనికి వచ్చెను. కాని యిప్పుడొక చిక్కు వచ్చెను. ఆతఁడు నెల కిరువది దినములైనను చుట్టుపట్ల గ్రామములలో దిరిగి పనులు చూడవలసి యుండెను. కమలను దీసుకొని వచ్చి గుడివాడ లో నుంచెదమన్నచో నాతఁడు లేని దినములలో నొక్కతియే గడు పజాలదు. వయో వృద్ధులగు తలిదండ్రులను సాయముగా గొని తెచ్చు టకును వీలులేదు. ఇదిఁగాక వారు లేనిది ఉండవల్లిలో నాపొలము మక్తాలైనను రావు. తమ్ములు చిన్నవారు. వారి స్థితిగతులన్నియు బెజవాడకు దాపులో నుండి పరిశీలించు చుండవలయును. కమలయొక్క తే సంసారము నిర్వహింపఁగల సమర్థత యింకను రాలేదు. ఇట్టిచిక్కు లతో కమలాకాంతుఁడొంటరిగానే కాలక్షేపము చేయవలసి వచ్చెను. పాప మెన్నినాళ్ళనియట్లుండఁగలడు. ఒకనాటి పండుగవేళకమలాకాంతుఁ డత్తవారింటికి వచ్చినపుడు కమలను బంపుమని యత్తగారితో జెప్పెను. ఆమె యాసంగతి భర్తతో ననెను. ప్రకాశము కమలాకాంతునితో దరు వాత 'ఏమోయి! అప్పుడే దాని నెట్లు పంపమనెదవు? అభ శుభ మెరుఁగని దానిని దీసుకొనివెళ్లి యెచ్చట నుండగలవు? ఇంతకు నీయు ద్యోగమున వచ్చు నాదాయము మాత్రమెంత? ఈడు జోడుగా నుం

డదగిన కాలములో తలయొకచోట నుండుట బాగుగా లేదు. ఆయుద్యోగమువలననే పూర్వము నుండియు మనము బ్రదికితిమంటలే? దానిని వదలివేసి యైన నిచ్చట నుండుము.' అనిచెప్పెను. ఆమాటల కాతండేమియు మారు పల్కకుండెను. కమలాకాంతుండు మరలి పోయెను. కొన్నాళ్ళవరకట్లే యాతండుద్యోగములో నుండెను. తన గృహస్థితులను లెస్సగా బరశీలించిన యాతని కుద్యోగము వదలుకొనవలెనని లేకుండెను గాని యత్తమామల యొత్తిడి హెచ్చయ్యెను. అత్తగారది వరకేమియు ననకుండినను, భర్తగారొకసారికి రెండు సార్లు చెప్పునది జూచియు, కమల యొంటరిపాటును గాంచియు కమలాకాంతుని యుద్యోగమును వదలి వేయుమని చెప్ప మొదలిడెను. ఆతని కేమిచేయుటకును దోచినది కాదు. చివరకెట్లో తనలో సమాధాన పడుకొని యాతండు మరల మూడునెలల కాలము జీతము లేకుండగ సెలవు గోరెను. అది యొసంగం బడెను.

కమల యిప్పటికి పరిపూర్ణయౌవని యయ్యెను. ఆమె యవయవములన్నియు నన్నివిధముల వికసించినవి. ఆపె వదనారవిందము శరచ్చంద్రికాసమమై, యత్యంతాకర్షనీయమై యుండెను. సహజసౌందర్యలయగు కమల తనూవిలాసము శిరీష కుసుమకోమల సదృశమై పసిండిచాయతో నొప్పారుచుండెను. ఆమె యధరోష్టము లరుణమయములై, సాంధ్యవిరాక్మిరములతో బోటి నల్పుచుండెను. ఆకనకాంగి యంగవర్ణనముతో మాలేఖిని ప్రొద్దుపుచ్చంజాలదు. తరంగవేగంబున బోవుచున్న మాలేఖిని పూర్వాపరసందర్భముల నెన్నియోజూచుకొనవలెగదా. కమలాకాంతుం డట్టి జగన్మోహన దివ్యసుందర విగ్రహాయగు నా లావణ్యరాశిని మనసార ప్రేమించెను. ఆజవ్వనియు నిత్యమొక నూతనాలంకృతయై, నానావిధపరిమళ కుసుమరాజంబుల వేణులంబెట్టి

భర్తృసందర్శన మొనరించినంతనే యాతఁడు బిగ్గకవుంగలించి ముద్దిడి తన్మయుఁడగువాఁడు. ఇట్టిసమయములో నాతని కుద్యోగమొక విలువగా గన్పడునా?

ఇట్లాదంపతు లిర్వురు దినములు క్షణములుగా గడపుచుండిరి.

---

## తృతీయ ప్రకరణము.

### దత్తపుత్త్రుఁడు.

---

రాజమహేంద్రపురమున నిన్నీసుపేటలో యొక మండువా లోగిటిలో నలువురు పెద్దమనుష్యులు సంభాషించుచుండిరి. అదియొక కులీనునకుఁజెందిన గృహమయ్యును, శిథిలావస్థలోనున్న పోలిక గానుపించుచున్నది. ఆమాటలాడుచున్నవారిలో నొక్కఁడా గృహమేధియే. ఆతనిపేరు రామానందము. రామానందముగారికి నల్వురు పుత్త్రులు గలరు. గోదావరీతీరమున బదియకరముల పల్లపుభూమి గలదు. దానితో నాతఁడొక విధముగా గాలక్షేపము జేయుచు పిల్లలకు విద్యాబుద్ధులు జెప్పించుచుండెను.

రామానందముగారి పూర్వీకులు కొరుకొండ రాజధానిగానున్న పుడు స్వదేశరాజస్థానములలో ప్రముఖులుగా నుండిరి. ఆవంశగౌరవ మీనాటికి నింగువగట్టిన వస్త్రమువలె వెల్లడియగుచునే యుండెను. రామానందము సహజ శాంతస్వభావుఁడు, దయార్ద్రహృదయుఁడు. అందును పిల్లలనిన నాతని కమితప్రేమ. తనపిల్ల లేదికోరిన నది తప్పక యొసంగితీరును. ఒకానొకప్పుడు వారలపై కోపమువచ్చినను గూడ దాని నాపుకొని వినయముతో బుజ్జగించి చెప్పెడివాఁడు, కాని కొట్టి తిట్టి యెరుగఁడు. పిన్ననాటనుండియు నాయనురాగలతలచే బెంపఁబడిన యాబాలురు నల్వురు దినదిన ప్రవర్ధమానులై శ్రీరామలక్ష్మణ భరత

శత్రుఘ్నులను మరపించుచుండిరి. దశరథాత్మజులయందు గల నిర్వ్యాజ భక్తిచే నాతఁడు తనకుమాళ్ళకుగూడ నాపేళ్ళే పెట్టి యత్యాదరము తో బిలుచుచుండెడివాఁడు. రామలక్ష్మణుల వివాహములైపోయినవి. భరతుని వివాహము జేయవలసియున్నది. శత్రుఘ్నుఁ డింకను విద్యాశాలయందు విఘ్నేశ్వర పూజవద్దనే కాలము గడపుచుండెను. ఈస్థితిలో నానల్వురుపెద్దలు సమావేశమగుట తటస్థించినది.

నల్వురిలో నొక్కఁడు విశాలవక్షుఁడును, నూతనవస్త్రాలంకృతుఁడును, శిరోవేష్టనధారియునై యుండెను. తక్కినవారు సామాన్య దుస్తుల ధరించి తెల్లని తలపాగలుమాత్రము బెట్టి యుండిరి. మొదటి వేషధారి వారికి బంధువనియు దక్కినవార లచ్చటివారనియు పాఠక మహాశయు లీవరకే గ్రహించియుందురు. ఆనూతనాగంతకుడగు వేషధారి గృహస్థును జూచి "రామానందముగారూ! ఏదియో యొకటి సెలవిండు. నేను వెళ్ళిపోయెదను. ఇదమిత్థము నిర్ణయించి నన్ను పంపివేయుఁడు. ప్రకాశముగారు మీకు దూరస్థుడని తలంపఁవలదు. ఆతఁడు చాల మంచివాఁడు. ధనాఢ్యుఁడు. మీవంశీకుడేగద! మీరింతగా సంశయించుచున్నారేల? సిరిరా మోకాలొడ్డువారలుందురా? కావున పర్యాలోచించి సమ్మతింపుఁడు అని పలికెను.

రామానందముగారికామాట లర్థమయ్యెను కాని యాతని ముఖారవింద మెంతుననో పరిపూర్ణవికసితము గాకుండెను. ఆతని బిడ్డలపై గలప్రేమమునకు మేరలేకుండెను. ఒక్కక్షణమైన వారల జూడకుండ నుండజాలని రామానందము కుమారుని దత్తునిగా నొసంగుమని నచో నంతలో సంతసించునా? ఈకాలములోవలె నాతఁడు ధనదాసుడై దురాశావేశ పరవశుఁడుగాక యుండెను. పురుషార్థములన్నిఁటి నాతఁడు చక్కగా గ్రహించియుండెను. పూర్వకాలపు వారివలె నాతఁడు నిష్కాపట్యమనస్కుఁడై యుండెను. అంతట నాతఁడు "బావా!

చెప్పవేమి? మాటలాడక యున్నకున్నారు. విమలానందముగారికేదియో యొకటి చెప్పి పంపవలెగదా. మీయభిప్రాయము నేమాత్రము సంకో చింపక వెల్లడిపఱచుఁడు.'' అనుచు సంజీవరావుగారి వంక జూచెను.

సంజీవరావంతట రామానందమునుజూచి "చెప్పుటకేమున్నది. నామనస్సుగూడ నీపోకడనే పోవుచున్నది. ఏమందువా? పూర్వకాలము లో నెవ్వరోయొకరు దప్ప దత్తు సాధారణముగా దీసికొనెడివారుగాదు. మానుస్మృత్యాదులుగూడ క్షేత్రజ్ఞులందరి కన్నను దత్తుడు కనిష్ఠుడుగా నిర్ణయించినవి. పాండుభూపాలాదులుగూడ దత్తపుత్రస్వీకార మొనర్ప నిచ్ఛగించకయే క్షేత్రజుల బుట్టింపఁజేసికొనినారు. దత్తతాస్వీకార మీ మధ్యమధ్యనే పెచ్చుపెరిగినదని తలంపవచ్చును. స్మార్తకర్మానుష్ఠాను శీలురగు వారిచే నివి ప్రసిద్ధిలోనికి దీసికొని రాబడినవి. ఏమన, వారు "అపుత్రస్య గతిర్నాస్తి" యను వచనమును బ్రమాణముగా గైకొ నిరి. కాని వారింకను మిగత త్రోవలు విచారించలేదు. భీష్మ మారుతీ సుకమహర్షానులెందఱో బ్రహ్మచారులై, సంతానశూన్యులయియే సిద్ధిబొందిన తార్కాణములుండలేదా? ఆమహాపురుషులఃరి జగద్వి ఖ్యాతమై, చిరస్థాయిగానుండలేదా? అందుచే నాస్మార్తులత్రోవ నంతగా పాటింపవలసినట్లు కనబడదు. పై ప్రమాణవాక్యమును పురస్కరించు కొని యీమధ్యవారెవ్వరైన నొక్కని దత్తుగా గైకొని కాలము గడ పుకొనిరి గాని, చూడగా నాకాలముగూడ మారిపోయినది. మీకుమా రులపై మీకుగల ప్రేమ వారికి మీయందున్నదానితో బోల్చినచో నాస్తిమశకాంతముగ నున్నది. అట్టిచో నిక్కడబుట్టి, యిక్కడ బెరిగి పెద్దవాడైన యీభరతుఁడుబోయి యేమియు పూర్వపరిచయములులేని ప్రకాశముగారివద్ద నిలఁబడి 'అయ్యా, అయ్యా! నాయనా!' యని పిలు వగలఁడా? అథవాఅతడట్లు పిలుచుట కలవాటు జేసుకొన్నను, అయ్యది సహజానురాగమును, సహజధోరణినిగల్గి యుండునా? అట్లే నాతఁడాక

నూతనపరిచితయగు యిల్లాలినొక్కతెను 'అమ్మా! అమ్మా!' యని పిలుచుటకు సిగ్గిలకుండునా? అది యట్లుండనిండు. ఈపిల్లవానికింత సరకు సంపదల విలువయెట్టిదో తెలియదుగదా. విలువదెలియక నిర్లక్ష్యదశ లోనుండి, తల్లిదండ్రుల నదివరకే గుర్తెఱిగి ద్రవ్యాభిలాషచే మఱొకరిని తండ్రీయని మఱొకమ్మను తల్లీయని సంబోధించి మనగలడా! ఇది గాక నింకొకటిచూతము. ఇచ్చినందుకు మనకు పుచ్చికొనినందు లకు వానికి నింతవరుపు ప్రతిష్టలు సంపాదించిన సరిగాని లేనిచో 'ఆమనమ్మపెళ్ళి, అణఁగెనమ్మరంది' యన్నట్లయినచో పరిహాసపాత్ర మగునుగదా. ఇంకొకమాట దాచక జెప్పెదను. దానివలన విమలానంద ముగారికి కష్టమగునేమో?" అని పలికి కొంచెము నిదానించెను.

విమలానందముగారంతట "బావగారూ' ఎంతమాట నాకుకష్ట మెందులకు? మీకష్టసుఖములన్నియు మీరు చక్కగా నాలోచించి చర్చించుచుండు. మీవంశీయుల గొప్పయాస్థి, వృధాగా నన్యాక్రాంత ముగానేల యని తలంచి, సమయము గనిపెట్టి నేనే దీనిని దారిలోనికి దెచ్చినాను. ఈతరుణము బోగొట్టుకొన్నచో మరల నెప్పటికి రానేరదు.' అనిపల్కి యూరకుండెను.

సంజీవరావుపిమ్మట తనయభిప్రాయము నింకను వివరింపసాగెను. 'బావా! ఇక నేను పర్యవసానముగా జెప్పదలఁచుకొనునది వినుము. వంశాభివృద్ధికై ప్రకాశముగారికి గల్గిన కోర్కె న్యాయమైనదియే, దాని నొప్పుకొనక తీరదు. ఐనను ప్రకాశము వంటి కోపదారిక్రింద మీభరతుఁడు నిర్వహింపలేడనుట నిర్వివాదాంశము. ఒక వేళ మన మింపు దంత యాస్థిని జూచుచు నూరక వదలుట కిష్టములేక, భ రతుని దత్తుగా నిచ్చితిమా, యాతఁడు వివాహమైన కొన్నినాళ్ళకై వను ప్రకాశముగారితో వేఱుబడక తప్పదు. ప్రకాశముగారి యొక్క యు మన భరతుని యొక్కయు చిత్తప్రవృత్తులను లెస్సగా బరి

శీలించి యీమాట బననలసి వచ్చెనుగాని లేకున్నచో దత్తునకేమి ? నిరాక్షేపణగా స్వీయవంశకుడు పుత్రభిక్ష గోరునపుడిచ్చినచో దప్పు లేదు. ఇదిగాక యొక్కటి నామనస్సున వేధించుచునే యున్నది. అదిమాత్రము చెప్పక తీరదు. ప్రకాశముగారు ముందువంశాభివృద్ధి మాటనటుండనిచ్చి, పితృకర్మాశక్తితో నీదత్తత గోరుచున్నాడుగదా! ఇకముందా పితృకర్మలుగూడ జరుగునట్లు తోచదు. మనకును, పూర్వీకులకు నెంతయో వ్యత్యాసమీకర్మలయందు గానవచ్చుచున్నది. మన మెన్నిటినో యిప్పటికే వదలివైచి యున్నాము. ఈకర్మలయందు భక్తినానాటికి దగ్గుచున్నది. కేవల కర్మాశక్తిచేతనే నాటబడు నీదత్తతాఫలవృక్షము భావిపురుషులచేతిలోని నిష్కర్మ పవిత్రములచే గొట్టబడి నశింపబడును. అప్పుడు ప్రకాశమువంటి వంశీకుల విశాలోద్దేశ్యములు సఫలీకృతములుగావు. అప్పుడు నిష్కారణాపరాధము మనము దత్తునియందు బెట్టవలసిన వారమగుచున్నాము. భావియుద్దేశ్యముల కాధారభూతములగు భరతాదులువంశక్రమముగా వారిమనోభీష్టప్రకారమున సంచరించుటకుగాని, పూర్వాచారమునబడి ప్రమగ్గి ప్రుక్కుటకుగాని మనమే గట్టిచిక్కుల దెచ్చిపెట్టుచున్నాము. ప్రకాశముగారికంత పేరుప్రతిష్టలు శాశ్వతముగ నుండవలెనన్నచో శాశ్వతమ్మైన ధర్మకార్యములు జేయరాదు గాబోలు. ఆబుద్ధి లేశమైన నున్నట్లు కానరాదు. పుత్రునివలన కలుగు సుఖానుభవములే, కీర్తిప్రతిష్టలే, యాతని కన్నులకు గోచరించుచున్నవి గాని యాతనివలన గలుగు కష్టపరంపరలేమియో దెలియజాలకున్నాడు. ఇంతకు నాయన కొక కుమారితగూడ కలదుగదా. సావిత్రివలన తండ్రివంశ ముద్ధరింపబడలేదా. అట్లే యీయన మాత్రము కుమారిత వంశముతో నేల తృప్తిపడడు. “యథార్థవాదీ లోకవిరోధి” అన్నారు. కనుక నామాటలు పాటిగా గనుపడక పోవచ్చును. ఇంతకు ముక్త్యేశ్వరరావుగారి యభిప్రాయ మెట్లున్నదియో గను

గొందము. వారి యభిప్రాయము మన కన్నివిధముల శ్రేయస్కరము. ఏమండీ! పంతులుగారూ! మీయుద్దేశ్యమేమిటో వెలిబుచ్చుడి" అని తన యుపన్యాసమును ముగించెను.

ముక్తేశ్వరరావుగారంతట లేచి మేఘగంభీరభాషణముల నిట్లని వాక్రుచ్చదొడంగెను. "రామానందముగారూ! మీరును సంజీవరావుగారును సావధానముగా విని కర్తవ్యము నిర్ణయించుకొనుడు. నన్నడిగిన ప్రశ్న మిక్కిలి దూరమాలోచించవలసి యున్నదై యున్నదనుట నిజము. మీవంటిసాధుపుంగవు లుత్తమ మధ్యమాధమ నిర్ణయముజేయుట లెస్సయే, కాని మీరిద్దరు నొక్కప్రక్కను జేరినారు. నామార్గము వేరైపోయినది. నాశక్తికొలది మీయభిప్రాయమును విమర్శించి నా యుద్దేశ్యమెంతవరకు స్థిరీకరింపబడగలదో చూచెదను. సంజీవరావుగారు నుడివిన వాక్యములన్నియు మీరంగీకరించినట్లు మీమనభావలోకనమునసే విశదమయ్యెడిని. కనుక వారు నుడివిన విషయములన్నియు నొక్కొక్కటిగా పరిశీలింతము. మనుస్మృత్యాదులు దత్తుని ప్రధానునిజేయుమాటసత్యమే. కాని యీకాలములో స్మృతిశాస్త్రాచారాదులననుసరించువారే కానరాకున్నారు. అట్టిచో నొకరిద్దఱు వాని నవలంబించియు ప్రయోజనము గాంచరు. వానిలోని గుణాగుణములన్నియు నన్నిజాతి మతములవార లాచరించినపుడే ప్రకటితమగునుగాని యిప్పుడు నిర్ణయింపజాలము ఒక్కటి చూడుము. దత్తునికన్న నియోగము వలన క్షేత్రమునబుట్టింపబడినవాడు కూడ నుత్తముడుగా నంగీకరింపబడినది. ఆనియోగమీకాలములో నదృశ్యమైపోయినది. అది యిప్పుడున్నను గర్హితముగా నెంచబడుచున్నది. దేశకాలపాత్రములన్నిటి ననుసరించి మీరు చెప్పినట్లు ముందు స్మార్తకర్మలు నశించెడిమాట వాస్తవమే. అవిపోయినను పుత్రుడు పుత్రుడే యగునుగాని శత్రువగునా? ఒకవేళ శత్రువే యగునను కొందము, దానికి పితృడుమాత్రమే

ముచేయును? 'అవశ్యమను భోక్తవ్యమ్, కృతమ్ కర్మశుభా శుభమ్' అను నార్యోక్తి ప్రకారము ప్రారబ్ధమనుభవించును. స్మార్తకర్తలులేని పాశ్చాత్య దేశములలో మాత్రము దత్తులు లేకున్నవా? అయిన నొకటి మాత్రము గలదు. పాత్రమెఱిఁగి దానమును, క్షేత్రమెఱిగి విత్తనమును జాతుమని పెద్దలు వక్కాణుదురు. అదియే ప్రాశ్చాత్య సాంప్రదాయము. వారును, కులమునకును, బంధుత్వమునకును, కుమార వ్యామోహమున కింతగా దోసిలొగ్గక, పాత్రతయే ముఖ్యముగ గమనింతురు. ఇంక ముక్తిమార్గమన్ననో, దత్తతవలననే రానేరదని నాకును తెలియును. మీరు పల్కిన మహర్షులు భక్తులు తరించినదియు సంప్రమాణమేకాని యిదికూడ యొకమార్గమని మీరంగీకరింపక తప్పదు. ఒకనికి కీర్తిప్రతిష్టలు వాని పూర్వీకుల వలనగాని, స్వీయశక్తిచేతగాని, కుటుంబములో నెవ్వరివలనగాని, సత్సంతానమువలనగాని కలుగును. అట్లే యపకీర్తియు గల్గును. అది పురాకృత కర్మపరిపాకమునుబట్టి యుండును. అందుచే భావివిషయములు మీరెంతమాత్రము నిర్ణయింపరాదు. అనుమాన ప్రమాణముచే ప్రత్యక్షలాభకార్యముల నిరసింపరాదు. అయ్యది యభ్రపదమునగల నీరదంబుల నమ్మి తటాకంబులని నీరుదెగగొట్టినట్లుండును. ఇక మన భరతుని విషయముం జర్చించెదను. ఆతని గుణాగుణములిప్పుడే నిర్ణయించుటకు వలనుపడదు. ఆతని కదృష్టరేఖ యుండియే యీకారణార్థమంతయు వచ్చినదని తలంచుచున్నాను. లేనిచో నెక్కడనో బెజవాడప్రక్కను గల పల్లెలోనుండిన ప్రకాశముగారేమి, మీరేమి, పదిసంవత్సరముల క్రిందట నీపిల్లవానిని జూచుటయేమి, తదాది యాతనియందు మనసుంచి నేటికీ కబురంపుటయేమి, ఇదియంతయు దైవచిత్రముగా నుండ లేదా? ఇందు మానుషప్రయత్నముకన్న దైవచిత్రమే హెచ్చుగా గన్పడుటలేదా? మంచికిగాని, చెడ్డకుగాని, దేనికో యొకదానికి సుము

హూర్తము భగవంతుఁ డీవరకే నిశ్చయించియున్నాఁడు. ఇదిగాక సిరిరా మోకాలొడ్డ దగునా? నూరుయకరముల భూస్థితిగల ప్రకాశముగారికి నల్వురు కుమాళ్ళుగల నీవే దత్తునిగా పిల్లవాని నొసంగకపోయిన-చో, నిఁక నిచ్చునదెవ్వరు? నల్వురు కుమాళ్ళున్నను, వారిపై వ్యామోహ ముదీరని నిన్నొకప్రక్కను, పుత్రసూన్యుఁడై తద్విచారమగ్నుఁడై తపించెడి ప్రకాశముగారి నొకప్రక్కను తూచుకొనుము. స్వకులస్థునకా పాటిసాయము జేయనిదే మన జీవితములు సార్ధకము లగునా? పరమార్ధ మన నిట్టికార్యము లొనర్చుటకన్న వేరెయున్నదా? కాబట్టి భావిఫల మును నిర్ణయించుట కశక్తులరను మీయుద్దేశ్యముల నొక ప్రక్కను వోచి, దైవముపై భారమువైచి వచ్చినవారిని తృప్తివఱచి పంపుట మే కర్తవ్యము. ఇదియనాకుపోలిన తెలుంగు" అని పలికి మిన్నకుండెను.

విమలానందమంతట లేచి "రామానందముగారూ! ముక్త్యేశ్వర రావుగారు చెప్పినవాక్యములు వేదవాక్యములే. వానిని సంశయింప రాదు. 'శుభస్యశీఘ్రమ్మని' పెద్దలు వల్కుదురు. కావున వచ్చేత్రయో దశి సోమవారము మంచిముహూర్తమున్నది. ఆనాఁడు దత్తతస్వీకారము గావించుకొనుట కనుజ్ఞయిందు." అని పలికెను.

రామానందముగారు ముక్తేశ్వర్రావుగారు పల్కిన మాటలతో బూర్వాభిప్రాయమును మార్చుకొనెను. ముక్తేశ్వరరావుగారికి బదులు సంజీవరావేమియు జెప్పలేదు. అందుచే ముక్తేశ్వర రావుగారి యభిప్రాయమే యాలోచన లోనికి మరల దెచ్చుకొనెను. ఇంతకు కొలదిగనో గొప్పగనో ధనాశలేనివాఁడులేడు గదా "ధనమూలమిదఁ జగత్" అందుచే నాతఁడు తనకేమియు దోచనందున తుదకు భ రతుని బిలుతమని, తలంచి యాతని బిలిపించి 'భరతా! నీకు పెద్ద యాస్తి రాబోవుచున్నది. పెంపుబోవుట కిచ్చగింతువా?' అని ప్రశ్నిం

చెను. భరతుఁడంతట సిగ్గుచే 'నాకేమి తెలియును? మీరు పొమ్మనినచో నట్లే బోయెదను.' అని ధైర్యముతో సమాధానము పలికెను. అది యంగీకారముఁగా గైకొని రామానంద మింటిలోనికేగి భార్యతో నాలోచింపఁగా నామె తప్పక యంగీకరించవలసినదని జెప్పెను. జ్యేష్ఠు లిరువ్వరుగూడ స్వలాభమును గుర్తించుకొని పెంపొసగుటకే సమ్మతి దెల్పిరి. ఇట్లధిక సంఖ్యాకులు దత్తతాను కూలుర గా గన్పడుటచే రామానంద మంతట ధైర్యము దెచ్చుకొని విమలానందముగారితో తన యంగీకార సూచకము గావించి యాయన నంపివేసెను. ఈవార్త వాయు వేగమున బ్రకాశముగారి కందజేయబడెను. ఆనాడు ప్రకాశముగారు బెజవాడలో కుఱ్ఱవాని తేజో విలాసము గాంచినదాదిగా నాతనిపై యెందువలననో నొక విధమగు మమకారము గలిగెను. దానికితోడు హరిశ్చంద్రనాటనమున జూచిన లోహితాస్యుని వేష భాషణము లన్నియు నాతని హృదయా కర్షము గావించెను. నాట నుండియు నాతఁడు పుత్రోత్పత్తికై పడరాని పాట్లు పడెను. ఆతని హృదయ ఫలకమున నాప్రతిమలు చిత్రితములై పోయినదాది నాతనికి పుత్రకాంక్ష విస్తార మయ్యెను. అయిదా రేండ్ల వరకు తనకు మరల సంతానము గల్గునని యాసతో నుండెను గాని యవి యన్నియు యడియాస లయ్యెను. ఇంతలో కుమార్తె పరిణయ ప్రయత్నము గావింపవలసి వచ్చెను. ఈసందడిలో నీయూహాలన్నియు గ్రీష్మ కాలమున శుష్కించి భూమిలో నడఁగియుండిన భీజంబులవలె నుండి వర్షర్తువున వెల్లివిరియు భీజంబులవలె నిప్పు డభివృద్ధి నొందుచుండెను.

సుశీలగూడ యానాడు హరిశ్చంద్ర నాటకము జదువుచు బాలవైచెనని పల్కియుంటిమి. ఆమెకుగూడ నాడట్టి యూహాలే కలిగెను, గాని పిమ్మట స్వీయగర్భ జనితయగు కుమార్తెను జూచుకొన్న కొలఁ

ది నాయుద్దేశ్యములు మఱు మాయములై పోయెను. కాని యాబీజ ములంకురించకను, నశింపకను సౌజన్య శీలయగు సుశీల గర్భకుహర ములోనే దాగియుండెను. అందుచే నీదత్తత ప్రయత్నమున కామెయు డ్డుగూడ లేకుండెను. కమల వివాహమైపోయిన పిమ్మట కమలాకాం తునిపై నిర్వ్యాజానురాగ మా సుశీల కుదయించెను. ఆతఁడే తమ సుఖదుఃఖముల కన్నిటికి నాధార భూతుఁడని నమ్మసాగెను. ఆతని యభివృద్ధినే సదాకాంక్షించుచు నాదంపతుల కెప్పుడేవి వలయు నో యావస్త్రాభరణాదులు, వస్తుజాలములు భర్తవలన దెప్పించి యిచ్చుచుండెను. గాని ప్రకాశమున కిది నానాటికి బొత్తుగా యిష్టము లేకుండెను. దానికితోడు కమలాకాంతుఁ డుద్యోగమును విసర్జించి యిల్లుచేరినదాదిగా నాతనిపై గల విలువ మఱింత తగ్గజొచ్చెను. పెరటి చెట్టు ముందునకు కాదుగదా. ఇదిగాక దూరపుకొండలు నునుపు. కమలాకాంతుఁడిప్పుడు పనిపాటలు లేనందున నెంత మక్కువగా నత్త మామల వద్దకు జేరుచుండెనో యాతనికంత నిరసనమే ప్రతిఫలమగు చు వచ్చెను. తుదకాతని కుభయ భ్రష్టత్వసిద్ధి యనునట్లుగా నుద్యోగ విసర్జనమును మామగారి నిరసనమును గల్గెను. జరుగుచున్న కొన్నినాళ్ళ కాతఁడు భార్యా సమేతుఁడై మఱల యుద్యోగప్రవేశము జేయనెం చెను, గాని యాతని దురదృష్ట వశముచే నయ్యదిలభింప దయ్యెను.

ఒకనాడు ప్రకాశము సుశీలతో తన యుద్దేశ్యము వెలుక పరచెను, గాని సుశీల కది సమ్మతి గాకుండెను. కొంతసే పామె కమ లను గురించి పల్కెను గాని ప్రకాశము ముందరామాటలు పాటిగల వి గాకుండెను. స్వబలమును, యెదుటి బలమును గ్రహించిన సుశీ లయు తానిక నిష్కారణముగా గృహకల్లోలము గావించుటేల యని మనస్సున ననుకొని 'మీయిష్టమువచ్చినట్లు చేయుఁడు కాని కమల నన్యాయము చేయకుఁడు ఇదె నాయభీష్టము,' అని పల్కి యూరకొనెను.

అల్లునిపై ప్రకాశ మదివరకున్న మక్కువఁ జూపక నిరాదరణ జూపుదినములలో నయ్యది పురవాసుల కెల్లరికి గోచరమగుచు వచ్చెను. కావుఁ నంటి లోకులు తన యాస్తికి భవిష్యదధికారియగు వానిపై నిట్టి విసర్జన మేలనో యని లోలోన తర్కించుకొన సాగిరి. ఈసంగతు లన్నియు లెస్సగా గ్రహించిన విమలానందమను పెద్ద మనుష్యుఁడు తనకుమారునికీ యాస్థి దక్కక పోయెనను విచారమును మనములో నుంచుకొని తనకష్టుదగిలిన కమలాకాంతునికి గూడ నీయాస్థి రాకుండ జేయుటెట్లనా యని యదివరలోనే యాలోచించుచున్న వాఁడగుటచే నిప్పుడాతనికి ప్రకాశము సలుపగలసని యెంచుకొనెను. ఈతఁడెవ్వఁడో కాదు. మన రాజశేఖరము తండ్రియే. ఇతఁడు పైకి పెద్దమనుష్యునివలెనుండి, పరుల నాకర్షింపగల శక్తి సామర్థ్యములును మితభాషిత్వమును గల్గియుండెను. కాని తనకన్న నెక్కువ గొప్పగా నన్యులాగౌరవమున నుండుట కిచ్చగింపనివాఁడు. అట్లభివృద్ధిగా నున్న వారి నెట్లయినను క్రిందికి బోవు మార్గముల నన్వేషించి పడద్రోయువాఁడై యుండెను. కాని యివి సాధారణముగా నొరులకు దెలియని విధమున నతిజాగరూకతతో జేయబడుచుండెడివి.

ఒకనాఁడీతఁడు ప్రకాశముగారితో నిష్టాగోష్టి సల్పుచుండఁగా నాతఁడు మెల్లగా దన ప్రసంగమును గొనివచ్చి ' నిర్భాగ్యులగు నీయల్లుండ్లను నమ్మి యీకాలములో వంశాభివృద్ధికి భంగము గావించుకొను వారెవరుందురు? ప్రకాశముగారూ! మీమాట యేమిజేసితిరి ? మీరు తప్పక దత్తుజేసుకొనుటయే శ్రేయస్కరము. మీజ్ఞాతులు రాజమహేంద్రవరమున నున్నారు గదా. వారికి సంతాన మభివృద్ధిగానున్నదని గూడ వినియున్నాము. మీకు సమ్మతియైనచో నేనాకార్యభారమునంతను వహించి నెరవేర్చెదను. నీవంటివాఁడు పేరునూరుచు లేకపోవుట భావ్యముగా నుండదని నా తలంపు ' అనెను

ఈమాటలకు ప్రకాశ మాలోచించి చెప్పెదనని పల్కెను. విమలానందుని హితోపదేశము లిదివరకే చక్కఁగా దున్నియుంచిన క్షేత్రమునంబడిన మొలకలవలె దినదినాభివృద్ధినంది వృక్షము లయ్యెను. అవి ఫలితమున కెప్పుడువచ్చునో మున్ముందు పాఠకులే యెరుంగఁగలరు.

సుశీలను సమ్మతింపఁజేసిన యనంతర మొకనాడు ప్రకాశము ముదుసలులగు తన యత్తమామలకడ తనకోర్కెని నివేదించెను. ధర్మబుద్ధిపరాయణులగు నావృద్ధ దంపతులంతట 'నాయనా! నీవు వంశాభివృద్ధికై దత్తు జేసుకొనినచో మాకును సమ్మతమే అందులకెట్టి యాక్షేపణయును లేదు. కాని ప్రకాశం! నీకింకను సంతానోత్పత్తి గలుగుట కవకాశమున్నది. చూడు! అమ్మాయి కింకను ముప్పదియైదేండ్లయినను నిండలేదు. నీవిప్పుడే త్వరపడ వలసిన పనిలేదు. తరువాత నీయిచ్చవచ్చినట్లు చేయుము.' అనిపల్కిరి. ప్రకాశమంతట రాజమండ్రిలో మన రామానందము గారి దగ్గర మంచి పిల్లకాయలు గలరు. ఈసమయము దాటినచో వారికి వివాహము లైపోవును. ఇతరచోట్ల మనకనుకూలురులేరు.' అని మరల పల్కెను.

“మేము చెప్పవలసినమాటలు చెప్పితిమి. పైనయన్నిటికిని నీ చిత్తమువచ్చినట్లే యొనర్పుమని పల్కితిమిగదా.” యని మఱల మామతుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ప్రకాశమల్లునితో నెప్పుడు నీప్రస్తావన చేయనేలేదు. చేసినచో నాతనిమనస్సునకు కష్టమనియో, లేక నాతనిపైనిగల నిరాదరణచేతనోగాని యట్టి సంభాషణమాత్రము జరుగదయ్యెను. కమల మాత్రము తనతల్లిమూలమున నావర్తమానమామూలాగ్రముగ గ్రహించి లోలోన సంకటపడుచునే. చేయునదిలేక

యమునే కుపహించెను. కమలాకాంతుఁడు ప్రకాశముగారి మూర్తి తనకు రాక పోయెనని చింతకన్న, నాట సేఁటియు మాయుగా చెప్పకపోయెనను సంతాపముతో దగ్ధుఁడగుచుండెను. "అత్తకొట్టినందులకేడ్వక తోడికోడలునవ్వినదానికే" నగుచుండెడిదానివలె నాఁడా యవమానభాగమునకే చింతిలుచుండెను. కాని దీనిని దీర్చువారెవ్వరు?

ప్రకాశము పిమ్మట విమలానందముగారికడ కేగి "మీరుపదేశించినట్లే చేయుటకు నిశ్చయించుకొంటిని. ఇఁక మీరు రాజమహేంద్రవరము పోయి రామానందముగారి మూఁడవకుమారుఁ నిమ్మని యడిగి వారి సమ్మతిఁ బొందవలెను. నాల్గుదినములలో మంచిలగ్నము కలదు. ఆముహూర్తమున జరిగి తీరవలెను. లేనిచో నేచిక్కులుకల్గునో యెవ్వరు చెప్పగలరు?" అనెను. అమాటలకు విమలానందముగారి కెక్కడలేని యానందము వచ్చెను. తనయుద్దేశ్యము నెరవేరుచున్నందుల కతఁడ సంపూరితలోచనుఁడై యామహదానందమును పట్టజాలక "ప్రకాశముగారూ! నిజముగా మీరుధన్యులు. మీయుద్దేశ్యములు పవిత్రములు. మీమామగారేమైన నడ్డుపెట్టెదరేమో! వారడ్డు జేసినచో మీరు దీనిని చేయలేరని తలంచియుంటిని? వారేమని చెప్పిరో కొంచెము తెలిపెదరా." అని యడిగెను. ప్రకాశమంతట "మాతులుఁడు కొంచెము ధ్వని ప్రధానముగా దన యసమ్మతిని గనుబఱచెను గాని పై కనుకూలముగనే ప్రవర్తించెను. వారొకవేళ యొప్పుకొన్నను, లేకపోయినను, నేను తలంచినతరువాత నది మానుకొనుటయా ముమ్మాటికట్లు జరుగదని భావింపుఁడు." అనెను. "ఆ! అవును. మనోనిశ్చయము మన నట్లే యుండవలెను. కాని యెవ్వరేది జెప్పిన నట్లు జేయమొదలిడుదువో, నాపని కంతముండదు. మంచిదికాని మీభార్యాబిడ్డలేమనిరి.?" అని తిరిగి ప్రశ్నించెను. "అందఱిని యొప్పించియేగదా నేనీ కార్యమున దిగినది." అని ప్రకాశము బదులు వల్కెను. తరువాత

ప్రకాశముగారి కొంత కృషిచేత విమలానందము రాజమహేంద్రవరము పోయి యున్నప్పటి రామానందముగారి కొల్లూరుకాలువలో జరిగిన సంభాషణమంతయు మన మెఱుంగుదుము.

విమలానందముగారి రాకకై ప్రకాశము నాడు కృష్ణాకెనాలు స్టేషనువద్ద నిరీక్షించియుండెను. ధూమశకటమానాఁ డనివార్యముగా నాలస్యముగా వచ్చెను. అందుచే చాలసేపటివఱకు ప్రకాశ మచ్చట నిలువనలసి వచ్చెను. బండివచ్చిన వెంటనే విమలానందము దిగి బయటికివచ్చి తనకై యెదురుచూచుచున్న ప్రకాశముగారి కరస్పర్శనమొనరించుచు సంతోషముతో "మన కార్యము సఫలమైనది. వివాహ ప్రయత్నములన్నియు జేయుండు" అని పలికెను. ప్రకాశముగూడ సంతసమొందెను. రాజబంధువులందఱికి ప్రకాశము శుభలేఖల బంపించెను, వివాహమునకై పలుతు వస్తువాహనములన్నియు బెజవాడనుండి తెప్పించెను. రామానందముగారికిని వారికుమార్తెకును, కోదండ్రపును రామానందముగారి సతీమణికిని ఇచ్చుటకై నూత్నచీనిచీనాంబరములనాతఁడు కొని తెచ్చెను. మూఁడవనాఁడే విమలానందముగారిని మరల ప్రయాణసన్నాహము జేసి వారినందఱిని తోడ్తెచ్చుటకై పంపెను. త్రయోదశినాటి యుదయమున ధూమశకటములో వారందఱు బయలుదేరి యుండవల్లి జేరుకొనిరి.

భరతుని దీసికొని రాజబంధువులందఱు నుండవల్లి గుహాలయములోనికి బోయి యచ్చటి యనంతశయనుని దర్శించిరి. ఆదర్శించిన వారిలో రామానందముగారి కుటుంబమంతయు గలదు. వారందఱా దేవతామూర్తికి పూజాదు లొనర్చి, భక్తిచే ప్రణమిల్లిరి. అచ్చటి దృశ్యములన్నియుగాంచి వారత్యంతానందాబ్ధిలో మునింగిపోయిరి. భక్తజనశ్రేష్ఠుఁడగు రామానందముగారవి గాంచి తన్మయత్వము జెందిరనుటలో నాశ్చర్యములేదు.

దత్తతా సుముహూర్తము సమీపించెను. భరతుఁడు పీఠమున నుండుచుండి విశ్వేశ్వర, లక్ష్మీనారాయణస్వాముల పూజగావించెను. తరువాత దత్తతా సంస్కారము యథావిధిగా నెరవేర్పఁబడెను. రామానాయకముగారును, తక్కినబంధువులు కొన్నాళ్ళచ్చటనుండి వారివారి యిండ్లకేగిరి. ప్రకాశముగారు వారందఱి నుచితరీతిని గౌరవమొనర్చి పంపిరని వేరుగ బలుకనక్కఱలేదు. భరతుఁడు ప్రకాశముగారియింటిలో కాలిడుచుండగనే దొడ్డిలో నొకయావుదూడ మరణించెను. దానియకాలమరణమునకై యెవ్వరు పశ్చాత్తాపమునొందలేదు. కాని కమలాకాంతుని తల్లిదండ్రులుమాత్ర మిదియొక దుశ్శకునముగనే భావింపజొచ్చిరి. తండ్రియెదుట గన్నడు నా దృశ్యమునుగుఱించి వారెవ్వరితోను పల్కకయుండిరేని.

భరతుఁడు రెండు మూడు నెలలవఱకు ప్రకాశముగారియందమితభక్తితో మెలంగుచునే వచ్చెను. వానిభక్తికా పురవాసులందఱు శ్లాఘింపసాగిరి. ఒకనాఁడు భరతునికి రాజమండ్రినుండి యొకజాబు వచ్చెను. ఇతని తల్లిదండ్రులవద్దనుండి యని ప్రకాశముగారు తలంచిరి. భరతుఁడు పొలమున కేగియుండుటచే నాఁడాయుత్తరము ప్రకాశముగారే తపాలవానికడ యందుకొనిరి. దానినూడదీసి చదువఁగా నీక్రింది విధముగా నుండెను.

శరణాలయము, రాజమండ్రి.

ప్రియా! నిన్నెడబాసి యేగినది మొదలు నిన్ను జూడనివిచారముచే నేను నిరంతర దుఃఖపరవశనై యున్నాను. అదేమియో గాని, నిన్ను గాంచినదాది, నీపైననే నాయంతరాత్మ ప్రాలినది. నీవింక నిచ్చటికి వచ్చుభాగ్యము తఱచుగా గల్గదు. ఒకవేళ కల్గినను, మనసమావేశము దుర్లభమగును. నీవు నన్నెప్పుడు పరిణయనిశ్చయమునకై రమ్మనెదవో తెలుపుము. నీపాణిగ్రహణ మెప్పుడుకల్గునాయని నేను నిరీక్షించుచు

...న్నాను. నీయనురాగమునకై రాగలతిక యెప్పుడు స్మరించుచున్నదను మాట మరువకుండు. ప్రత్యుత్తరమునకై వేచియున్న మిాప్రేయసి.

"రాగలతిక"

ప్రకాశమిా యుత్తరము జదివినంతనే యాతని గుండెలు ఝల్లుమనెను. "అయ్యో! మోసమైనది. ఈకులట వీనికెక్కడ దాపరించినది. చూడఁగా నీతఁడు దానిని వివాహము జేసుకొనదల్చి సమ్మతించినటులున్నాఁడు. వీనివలన నేను కులభ్రష్టుఁడను గావలయునా? వెంటనే వీనికొకపిల్లను దెచ్చి వివాహము జేయవలయును. లేనిచో గార్యము మించిపోవును. అని తలంపసాగెను.

భరతుఁ డింటికి వచ్చెను. కాని తండ్రియగు ప్రకాశమాతనితో మాటాడలేదు. ఆయుత్తరమునుమాత్ర మాతఁడు బల్లపై బారవైచెను. తన విలాసముగల జాబును భరతుఁడుజూచి మెల్లగా దాని నందుకొనెను. పిమ్మట నాతఁడు తన గదిలోనికిబోయి యాలేఖ నాద్యంతము జదువుకొనెను. అందలి విషయములకును, అయ్యది దత్తజనకుని కంట బడుటకు నెంతయో చింతపడెను. నిత్యము సేగనే పొలము పనుల వివరమంతయు నడిగెడి జనకుఁడానాడు దగ్గఱకువచ్చినను పల్కరించకుండుట కిదియే కారణమని భరతుఁడు నిశ్చయించుకొనెను. లోలోన భయపడుచు నాతఁడటునిటు తారాడజొచ్చెను గాని ప్రకాశమునకుగల కోపమంతయు లోలోపలనే మండుచుండెను. ఇట్లు రెండుమూడు దినాలు జరిగెను. ఇంతలో భరతుఁడేదేమో నొకవంకజూచుకొని రాజమండ్రి వెళ్ళి రావలయునని సంకల్పించుకొని యుండెను గాని కారణము దొరకలేదు. తానై పోయెద నన్నచో నీయుత్తరమే కారణమని జనకుఁడు మన్నింపఁడని తలపోయసాగెను. రాగలతిక వ్రాసినయుత్తర మొకవంకను, జనకుని మాన మొకవంకను నాతని బాధించుచుండెను. అందుచే నాతనికి రాత్రులునిద్ర పట్టకు...

డెను. ఎప్పుడు తరుణము జూచుకొని రాగలతిక పాదములపై వ్రాల గల్గుదునాయని యాతనిమన మాందోళన పడసాగెను.

ఆందోళన దండమునుజేరి తొందర పెట్టునప్పుడే సందియము లన్నియు నట్టి యూహా పరంపరలు బయటికి వచ్చుచుండును. పని చేయు మన్నప్పుడు గాని యనుభవజ్ఞానము గలుగదు. మానవుని సక లేంద్రియములు నట్లే. అందు ముఖ్యమగు మనస్సుతో యోచించు కొలందిని దానికి తగిన స్థితిగతులన్నియు గరతలామలకము అగుచుం డును. భరతుడట్లే తన స్థితిని గూర్చి యొకింతక సేపాలోచనా నిమగ్నుడయ్యెను. ఒకనాటి రేయి నిద్ర బట్టక నావిషయమునే యాలోచించుచుండగా నాతని కొక యూహతోచెను. తానుపోయి జనకుని చూచివచ్చుటకై యీపన్నాగము సమంజసమని తోచెను. ప్రకాశముగారికి తెలియకుండ తన జనక తండ్రికొక యుత్తరమును వ్రాసినచో నాతడు తననే రమ్మని వర్తమాన మంపుననియు, నపుడు ప్రకాశము తప్పక తన్నంపుననియు నాతడు నిశ్చయించుకొనెను. ఆయూహతో నాతని మనస్సు కుదుట బడెను. ఆనాడాతడు సుఖ నిద్రజెందెను.

మరునాడుదయముననే భరతుడులేచి యొక యుత్తరమును రామానందముగారికిని మరొకటి రాగలతికకును వ్రాసి తపాలులో వైచెను. ఈసంగతి ప్రకాశముగారికిగాని మరెవ్వరికి గాని తెలియదు.



## చతుర్థ ప్రకరణము.

### (రాగలతిక.)

---

రామానందముగారు యింటిముందర వసారలో కూర్చుండి భగవద్గీతా పారాయణము గావించుచుండిరి. ఆతఁడు నిత్యము ప్రత్యూషమునఁనే లేచి గోదావరీ పుణ్యతీరంబున గ్రుంకి, విభూతిని దాల్చి శుభ్రవస్త్రధారియై, యింటికి వచ్చి యొక గంట పారాయణము జేయుచుండును. ఆపారాయణ సమయమున నెవ్వరు వచ్చినను సాధారణముగా నాతని పల్కరింపఁబోవరు. ఒకవేళ పల్కరించినను సంజ్ఞలతో నాతఁడు కూర్చుండుమనుట గాని యన్యవిషయాసక్తుఁడై యుండఁడు. ఇదిగీతాపారాయణము వలన కలిగిన నిగ్రహత్వమే. ఆనాడు తపాలువాఁడొక యుత్తరమును దెచ్చి యతఁడు పారాయణము జేయుచున్నది గనిపెట్టి యాతనికడనే దాని నుంచి పోయెను. రామానందమా పారాయణమును ముగించినతరువాత దానిని విప్పి చూచెను. అది భరతునివద్ద నుండి వచ్చినదని యాతఁడు గ్రహించెను. చిరకాలమునకు భరతునివద్ద నుండి లేఖవచ్చినదిగదా నిందేమైన విశేషము లుండకతీరవని యాతఁడు మిక్కిలి శ్రద్ధతో జదువసాగెను. అది యిట్లుండెను.

‘ జనకా! నమస్కారములు నన్నిచటికంపిన దాదిగా మీకడ నుండి నాకుత్తర ప్రత్యుత్తరములు లేవు. మీరును నాయనుంగు దల్లియు, నన్నలును, దమ్ముఁడును, సుఖముగా గాలక్షేము సేయుచున్నారనియే భావించెదను. మిమ్ముల నందరిని జూడవలయునని నేనత్యంతాతురతతోనున్నాఁడను. కాని నాదత్త జనకునికడ నీప్రసంగము దెచ్చుటకై వెఱచెదను. ఆతఁడేమనునోయని నాసందియము. ఒకసారి

మీదుగాని సొగసులో నెవ్వరైనగాని వచ్చినాక దర్శనమిచ్చి నన్ను వెంటబెట్టుకొని పోయెదరని నమ్మెదను. ఇంటనెల్లరు కుశలురే నాయుండవలెకి సమరక్తమొందుగనే యున్నది. చిత్తగింపవలయును.

భరతుఁడు'

భరతుని యుత్తరము జదువఁగనే యాతనికి పరమానంద మయ్యెను. సంతోష స్వాంతుఁడగు రామానందములేచి లోనికేగి భార్యను జూచి 'ఏమే? భరతునివద్దనుండి నేడు జాబువచ్చినది. ఆతఁడు క్షేమముగనే యున్నాఁడఁట. మనల నందఱిని చూడవలెనని వ్రాయుచున్నాఁడు. ఎవరైన వచ్చి తన్ను దోడ్కొని పొమ్మనుమనియు, తనకుదానై వచ్చుట కంశను ప్రకాశముగారి నడుగుట భయపడుచున్నట్లును వ్రాసినాఁడు" అనెను.

అంతట నామె 'నిజమేనండీ! పాపము పసికూన నెక్కడనో యెఱుఁగనిచోట నిచ్చివచ్చితిమి. వాని కప్పుడే యేమి స్వతంత్రముండును? వాఁడు బెంగపడి యీయుత్తరము వ్రాసియుండును. మన రాముని బోయి తోడ్కొని రమ్మని పంపండి. ఎన్నాళ్ళయినది వానిని చూచి? అప్పుడే వ్రాసిన ప్రకాశముగా రేమందురో యని నేనింతవరకును మీకు వ్రాయుమని చెప్పలేదు. అయ్యో! మగబిడ్డ పట్టలేక వాఁడే యుత్తరము వ్రాసినాఁడు. వానికున్న శ్రద్ధ మనకేదీ?' అని పలికెను. ఆర్ద్ర హృదయుఁడగు రామానందముగారి కామాటలే సరి పోయెను. అతని మనస్సు ద్రవీభూతమై భరతునిపై మరలి పోయెను. రాముఁడింటికివచ్చినవెంటనే ప్రయాణముజేసి యుండవల్లిబోయి ప్రకాశముగారితో చెప్పి భరతుని తోడితెమ్మనియు, మఱల నాలుగు దినములలో వచ్చునని చెప్పుమనియు జెప్పి పంపించెను.

రాముఁడు బయలుదేరి తిన్నగా బెజవాడమీదుగా నుండవల్లి జేరెను. అంతవరకు ప్రకాశము భరతుని పల్కరించనేలేదు. పల్క

రించినచో తనకు కోపముగా గలదని ప్రకాశమునకు దెలియును. అందు వల్ల నది రసాభాసముగ నుండునేమోయనియు. మానసముగ నున్నచో బెట్టుగ తనను భయపడి భరతుండు నడచుకొనవచ్చుననియు నాతం డూహించుకొనెను. రాముం డింటికివచ్చినంతనే ప్రకాశ మానాడమిత మర్యాదల జేసెను. వారి బంధుమిత్రాదులందరి క్షేమసమాచారము లను వివరముగా నడిగెను. రాముండు వాని కన్నింటికి సదుత్తరము లిచ్చెను.

భరతుండాందోళనాపూరితుండై యుండుటచే నాతని ముఖవిలా సముచెన్నుదొరగియుండెను. మనః ఫలకమున జిత్రింపంబడెడు దృశ్య ములన్నియు. ముఖ దర్పణముననే మనముకనుంగొనుట స్వాభావిక చిత్రము అట్లే భరతుండు వికాసహీనుండై యున్నట్లుండ లేదని రాము డు కనిపెట్టెను. ఇదిగాక నాతనియెదుట ప్రకాశము భరతునితో చనవుగా సంభాషించుట లేదు. ఇదంతయుజూచినకొలందిని రాముని మన స్సులో నొక విధమగు సంకోచ మేర్పడెను. కాని కారణ మూహించు టకు వీలుగాకుండెను.

రాముడచ్చట నెక్కువనాళ్లుండ లేదు. ఒకటిరెండు దినములుండి సమయోచితముగ బ్రకాశముగారితో తాను వచ్చినకారణ మెఱింగిం చెను. భరతుని రాజమహేంద్రవర ప్రయాణము ప్రకాశమున కెంతయు నిష్టము గాకుండెను. కాని దాని నాటంకపరచుట కేమియు వీలుదొర కలేదు. ఇప్పుడు భరతుని పంపనన్నచో రామానందముగారు మిక్కిలి సంశయింతురు. భరతుం డచ్చటికేగినచో రాగలతికయు భరతుడును కలిసి పోవుదురేమో! ఇట్టి భయముచే నాతం డిదమిత్థము వెంటనే నిర్ణ యింపంజాలక పోయెను. ఈయన సందిగ్ధావస్థను గనుపెట్టి రాముండు 'ఏమిటిబాబూ అంతగా సంశయించుచున్నారు! భరతుండు మాయిం టికివచ్చినచో, మరల వెంటనే రాడనియా? పదిదినములలో తిరిగి

పంపెదము లెండి! నూనాయనయు, తల్లియు వానినిజూడవలెనని యొకే రీతిగ కలవరించుచున్నారు. వారి కండ్లయెదుట నొక్కసారిబడినచో, నిఁక వానికేమి పనియుండును?'' అని సమాధానవాక్యములు పలికెను.

రాముఁడు తనను సంశయించుచున్నాఁడని ప్రకాశము గ్రహించిన వెంటనే 'ఆఁ నాకు శంసయమా? అబ్బేసంశయమేల? లేదుఁ కాని భరతుఁడు యుక్త వయస్కుఁడైనాడు. ఆతనికిఁక పరిణయ ప్రయత్నముజేయవలెను. పట్టణవ్యామోహములలో నితఁడు జిక్కినచో సంసార కష్టసుఖము లన్నియు దెలియజాలవు. అంతకుదప్ప వేరుసందియములేదు. నాయనా! తప్పక పదిరోజులలో పంపించుము.' అని పల్కుచు భరతుని బిలిచి 'భరతా! మీతల్లిదండ్రులు నిన్ను చూడఁగోరుచున్నారట. వెళ్ళి చూచివత్తువా!' యని పలికెను. భరతుఁడామాటలు విని సంతోషస్వాంతుఁడై 'ఆఁ పోయివచ్చెదను. అని బదులు పల్కెను. భరతుని మఱల పల్కరించుటకు ప్రకాశమునకిదియే మొదటిసారి. ప్రకాశ మంతట భరతుని జూచి మనసులోని విషయము పట్టఁజాలక 'వెళ్ళివచ్చెదవుగాని యచ్చటనేమియు కొంటె పనులు జేసిరాకుము. నీవు యుక్తవయస్కుఁడవైతివి. నీవిపుడెట్లొద్దికతో పిన్నపెద్దల తారతమ్యము గుర్తెరింగి నడువవలయునో, దెలుసుకొనగల స్థితియందున్నవాఁడవు. లేనిపోని పట్టణ వ్యామోహములలోఁ జిక్కి యొడలు మఱచి యుండకుము. ఇదె నీకు చెప్పుచున్నాఁడను. తెలిసినదా?' యనెను.

'తెలిసినది.' అని భరతుఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

ఈమాటలలో రాముని సంశయము మరింత దృఢపడెను. పిమ్మట రామభరతులిద్దరు ప్రయాణోన్ముఖులై వచ్చి ధూమశకట మారోహించి యారాత్రికి రాజమండ్రి జేరిరి. వారిని గాంచినంతనే

రామానందము నాతని సతీమణియు పరమాహ్లాద సంభరితాంతః కరణులైరి. పిమ్మట భరతుని కుశల ప్రశ్నము లనేక విధములుగా చేయసాగిరి. ఆహార విహార విశేషములు, సుశీలా ప్రకాశముల యనురక్తి విషయము, కమలయు, కమలాకాంతుడు చూపెడి యభిమాన విశేషములు విమలానందము కమలాకాంతుని తల్లిదండ్రులు గనబరచు నాదరములు మున్నగు నవి యెల్లను గ్రుచ్చి గ్రుచ్చి యడుగసాగిరి. భరతుఁడు వానికి తోచినట్లెల్ల నన్నిటికి సమాధానము లిచ్చుచుండెను. ఆతని తల్లి యాతనిజూచి 'ఏమిరా? నాయనా! చిక్కినట్లున్నావు. నీ మ్ములను చూడని బెంగవేసికొనినట్లున్నావు? నీకచ్చట తినుబండారములలో లోటులేదుగదా' యని మరల మరల నడుగసాగెను.

పుత్రోత్సాహమను నది స్త్రీ పురుషు లిద్దరకును సహజ సిద్ధమైనను అభ్యుదయ కాలక్షేపమును బట్టి పరిణామ దశలయందు మార్పుగానుండును. ఏమన, పురుషార్థపరులగు నరులకు, పుత్రోత్సాహము గల్గు సమయము ' భాసమహాకవి సుమతి శతకమున వర్ణించియున్నాఁడు.

కం॥ పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుఁడు జన్మించినపుడె పుట్టదుజనులా!
పుత్రుని గనుగొని పొగడఁగ పుత్రోత్సాహంబు
నాడు పొందుర సుమతీ॥

కాని స్త్రీల విషయ మట్లుండదు. నవమాసములు మోసి కని పెంచిన విశేషములవలననో లేక తమకన్న నుత్తమజాతియనియో గాని స్త్రీలకు మగపిల్లలని నంతనే ప్రాణములు లేచివచ్చును. వారు పుట్టినదాది నపరిమితోత్సాహ వంతురగుదురు. చివరకా పుత్రుఁడెట్టి

వాఁడైనను వానిపై మమకార మాతల్లికి తీరదు. కాని దుష్టవర్తను డైనవాఁడు పుత్రుఁడయ్యేనా పురుషున కంతతీపి యుండదు. అట్లని బొత్తుగా ప్రేమలేదని గాదు. ధృతరాష్ట్రునివలె పుత్రవ్యామోహము చే కర్తవ్యసిద్ధిగాంచనివారు కూడ లోకమున లేకపోలేదుగాని వారుపురు షార్థ పరులలో జేరరు. రామానందముగారి భార్య భరతు నట్లు గ్రుచ్చి గ్రుచ్చి యెన్నియో విధముల బరిశీలించుట జూచి రామానందము తుదకు ఏమిటా పిచ్చి పిచ్చి ప్రశ్నలు? ప్రకాశముగారు వానికి తిండిలోటుగూడ జేయుదురనియా? అట్లయినచో నాతఁడెందుల కీతని దీసికొనిపోవును? ' అనెను. భరతుఁ డామాటలకు లజ్జించి తల్లిని జూచి ' చిక్కులులేవు. ఏమియులేదు. అన్నియు బాగుగనే యున్నవిలే. ' అని పల్కెను. నాటి సంభాషణ మంతటితో ముగిసెను.

మరునాఁడు భరతుఁడు మెల్లగా వీరేశలింగముగారి యుద్యాన వనమునకు విహారాభిలాషచే వెడలెను. ఆవన విహారోద్దేశ్యము రాగలతి కా సందర్శనాభిలాష మేయని చదువరు లెరుంగుదురు. రాగలతిక కాయుదయముననే యొక పరిచారిక మూలమున దనరాక నెరింగిం చెను. ఆతఁ డుద్యానమునకు బోయి యొకటి రెండు నిముసము లయ్యె నో లేదోగాని విద్యుల్లతా విగ్రహయగు నారాగలతిక శరవేగమున బరుగెత్తుచు వచ్చెను. అది జూచి భరతుఁడు ' లతికా! ఇక్కడ నేమి యు మించిపోలేదు. కొంచెము నిదానించియే రావచ్చును. అంతత్వరగా నడుచుటేల? లేని పోని యాయాసమేల దెచ్చుకొనెదవు? అని పరి హాస సూచకముగా బలికెను. ' దీని కంతటికి నీవే కారణము. ఇంకను తొందర యేలని యూపల్కుచున్నావు ? నీకట్లేయుండును. గడచిపోయి తినిగదాయని తలఁచుచున్నావు గాబోలు. ఆడవారిపాట్లు మగవారెట్లు తెలుసుకొనగలరు ? ' అని యాయావని యొక్కసక్కెముగా తిరిగి బదులు పలికెను.

రాగలతికకు పదునారేండ్లు నిండినవి. వన్నెలుచిన్నెలు నిప్పు డిప్పుడే యేర్పడుట కారంభమైనవి. సరసీరుహ సదృశమగు నానారీమ ణిసోయగమంటిన కందిపోవునట్లుండెను. ఆముఖారవిందముపై చిఱు నవ్వులమధ్య మఱింత ప్రకాశించుచు శరశ్చంద్రికాదీప్తిని బోటిసేయు చుండెను. ఆతన్వీ మణి తనూవిలాసము మేల్మిబంగరును ధిక్కరించుచుం డెను, ఆలావణ్యవతి శృంగారమునంతను వర్ణింపఁజాలము. కరపాద పల్లవ పంకేరుహయనియు. గురుకుచ బింబాధరియనియు, రాజీవనేత్రి యనియు, జగన్మోహిని యనియు, జెప్పి మేమా రాగలతిక తనూవిలాస వర్ణనమును గట్టిపెట్టెదను. నిజముగ రాగలతిక యనురాగలతికయే యని చెప్పవచ్చును. ఆమె కొక్కకొఱంతమాత్రము గలదు, సౌందర్య మునకుతోడా మందగమన కొక్కటియున్నచో నామె డెందమున కమి తానందముగ నుండెడిదిగాని యదియందని ప్రమానుపండై పోయెను. ఆ రుచ్యఫలమునకై యాసించి రాగలతిక యంతటితో విరక్తినొందక భరతానురాగ వృక్షమునువేసి, నిత్యదోహదమొనర్చుచు ఫలించి తత్ఫ లసిద్ధికై నిశ్చలప్రేమ సమాధిలోనుండి నిరీక్షించుచుండెను.

పాపము రాగలతిక బాలవితంతువు. అందువలననే శరణాలయ ములో జేరుట సంభవించినది. ఆమె తల్లిదండ్రులు మిక్కిలి ధనవంతు లు హేలాపురంబున వారు వ్యాపారముజేయుచు నష్టైశ్వర్యములతోఁ దులదూగుచుండిరి. రాగలతిక కెనిమిదవయేట మహావైభవముతో వివాహము జేసిరి. మచిలీపుర వాస్తవ్యుడును, పాడవ్యాపారియునగు రామేశంగారిపుత్రుఁడు మోహనరావుగారికి బాలను సమర్పిం చిరి.

రాగలతిక యొక్కసారి మాత్రమే తన యత్తవారింటి కేగెను. గాని యెప్పుడైనను తన మనోహరుఁడగు మోహనరావుగారితో

ముఖాముఖి నెప్పుడు సంభాషించియెఱుగదు. అట్టియవకాశ మామె కెన్నడు కలుగనేలేదు. ఆమె యత్తమామలచాటుననే భయభక్తులతో నుండవలసివచ్చెను. అందుచే నాతని నాపాదమస్తక పర్యంతమైనను గన్నులారజూచి యుండెనో లేదో దృఢముగా చెప్పజాలను. అప్పటికింకను రాగలతికకు యౌవనప్రాదుర్భావము కాలేదు. అందుచే మోహనరావుపై ననురాగాంకురము లుద్భవిల్లుట కవకాశమే లేకపోయెను. అత్తవారింటికిపోయిన కొలదినాళ్ళకే తల్లిదండ్రులు తిరిగి యామె నింటికి దీసుకొనివచ్చిరి గాని మఱల నామెను పంపుభాగ్యము లభింపఁదయ్యెను. కొలది మాసములలోనే మోహనరావు పరలోకవాసుఁడగుట తటస్థించెను.

మోహనరావు రాగలతికను పరిణయమాడుటకుముందే యుక్తవయస్కుఁడై యుండెను. గొప్ప వ్యాపారకుటుంబమునకు జెందినవాఁడగుటచే నాతనిచేతికి వచ్చునదెల్ల వ్యయము సేయగాగెను. పేరునకు కొన్నాళ్ళు బడికేగెను గాని యచ్చటవానికి విద్యోపార్జనయందు ధ్యానమేమియు లేకుండెను. తదుపరి వానితల్లిదండ్రు లాతనిని వ్యాపారములో బ్రవేశపెట్టిరి. అప్పటినుండియు నాతనిచేతికి ధారాళముగా డబ్బుదొరకుచుండెను. వ్యాపారవిషయమున నాతఁడనేకపట్టణములకు బోవలసియే యుండెను. అందుచే నాతఁడిఁక దురాలోచనలకును, దుష్టవర్తనముల కలవాటుపడఁ జొచ్చెను. సౌందర్యశీలలగు వేశ్యలకాతఁడు వశ్యుఁడైపోయెను. ఏపట్టణమునకుబోయిన నచ్చటి రిఫ్రెష్మెంటు గదులలో నాతఁడే కనుబడుచుండెను. ఆహారవిహారపానీయములలో నాతఁడిష్టమువచ్చినట్లుగా దిరుగుచు, గవ్వలు, గచ్చకాయలవలె ద్రవ్యమును వెచ్చించుచు, నేదియో తప్పులెక్కలుజెప్పియు, కొన్నిలెక్కలు జెప్పకయు తలిదండ్రులను మఱపించుచు, కొన్నాళ్ళకు వారిని ధైర్యముగా బూకరించి

ప్రత్యుత్తరము లిచ్చుచు కాలము గడుపఁజొచ్చెను. ఇఁక నాతనికి తక్కువేమి? తనవంటి విద్యావ్యాపారుల సంఘములో జేరుకొని వ్యాపార విషయములుకూడ వదలివైచెను. దురలవాటులన్నియు క్రమముగా బట్టువడెను. సుందరియైన మందగమనను జూచెనా దానితో పొందుగా వలసినదే. ఇట్లలవాటైనవాటిలో త్రాగుడొకటి. ఆతడు చేయుపనుల న్నియు జూచి తల్లిదండ్రులేమియు జేయజాలఁక యాతనికర్మ మెట్లయి నగానిమ్మనివదలిపెట్టిరి. ఇట్లు రెండుమూడువత్సరములయ్యెనో లేదోగాని యాతని యారోగ్యము జెడిపోయెను. క్రమముగా నాతఁడు మంచమె క్కెను. స్వయంకృతాపరాధముగా జేసిన దుష్కర్మలకన్నిటికి నాతఁడు బ్రతికియుండగనే ఫలములనుభవింపవలసిన వాఁడయ్యెను. ఎన్ని విషతు ల్యములగు మందులు ద్రావినను, వ్యాధి నివారణము గాకుండెను. ఆతనికి కడుపులో పెద్దపోటు గల్గుచుండెను. అది భరింపశక్యము గాకుం డెను. లోనికేదయైన తినవలెనను యాసయుండెనుగాని యాతనికా కడు పునొప్పి వలన భక్షించుటకు శక్యము గాకుండెను. తల్లిదండ్రులు ధన వంతులగుటచే మోహనరావుకొఱకెందఱో వైద్యులను బిలిపించిరిగాని వారి వైద్యములన్నియు నిష్ప్రయోజనము లయ్యెను చివరకేత్రోవబో వునా డిచ్చినను, ఏపుట్టలో నేపామున్నదో యని తలంచుచు నట్టికూర గాయ వైద్యములుగూడ చేయించిరి. గాని కర్మ పరిపక్వము గా దయ్యెను.

అనేకులగుహకీములు, ప్రాశ్చాత్యవైద్యులు, ఆయుర్వేద పారఁ గతులు మున్నగువారెందరో తఱచి విడచినదానిలో వ్యామోహమున గాక కూరగాయవైద్యములు కుదుర్చుననియా?

ఇవి యిట్లుండఁగనే వీరి లక్ష్మీసంపన్నతను గాంచి ద్రవ్యము హరించుటకై యెందరో భూతవైద్యులు, మంత్రగాండ్రు తంత్రగాండ్రు బయలుదేరిరి. దృష్టిదోష నివృత్తిపరులు మున్నగువారనేకులు జేరి వారి

ద్రవ్యమును పలువిధముల కొల్లవెట్టిరిగాని యావంతయు ప్రయోజనము లేకయ్యెను. తుట్టతుద కాతఁడు మంచమే మరణముగా గొన్నాళ్ళు తీసుకొని యావేదనలబడి పడి, శరీరము కృషించగా హతాశుఁడై పోయెను.

ఇంతలో కాలయముని దూతలాతని యాజ్ఞానువర్తులై మోహన రావు కడ జేరి కాలపాశములచే నాతనిజీవము బంధించి కొంపోయిరి. అప్పుడు రాగలతికకొరకై తంతివార్త యొసఁగబడెను. రాగలతిక తలి దండ్రులు మిక్కిలి విచారమనస్కులై యామెను దీసుకొని యచ్చటి కేగిరిగాని వారు మృతదేహమును మాత్రమే గనుగొన గల్గిరి. పసికూన యగు రాగలతికయు నందఱేడ్చుచుండుటజూచి, తన మగడు చనిపో యె ని చెప్పగా నాతని మృతకళేబరముకడకేగి కొంతసేపు దుఃఖించె నుగాని యాకన్య నిజముగా దనబాధ్యత నెఱింగి విలపించినదిమాత్రము కాదు. కర్మకాండ యంతయు జరిగిపోయిన పిమ్మట రాగలతికను తల్లి దండ్రులు తమ గృహమునకుం గొని వచ్చిరి. అప్పటినుండియు రాగల తిక మగనిగృహమున కేగనేలేదు.

తమ కండ్లయెదుట వైధవ్యదశలోనున్న బిడ్డను జూడజాలక రాగలతిక తలిదండ్రులు లాపెను చదువువచ్చిన దానితోనైన గాలక్షేప ము జేసుకొనుచుండునుగదా యని శరణాలయమునకుం బంపిరి. వారు వేరు పాఠశాలకంపవలెనని మున్ముం దాలోచించిరిగాని యప్పుడప్పుడే విజృంభించుచున్న వీరేశలింగ వితంతుశరణాలయ విద్యాభివృద్ధిని గాంచి మెచ్చటనైననేమి యని మనసు పిల్లదానికి చదువుబాగుగావచ్చిన కుదుర్చుకొని స్నేహితుల యాలోచనముపై నచ్చటికి బంపిరి. కాని వారి కంతవరకును రాగలతికకు పునర్వివాహ ప్రయత్నము గావించు దలంపు లేకపోయెను.

రాగలతిక క్రమముగా నీనాల్గువత్సరములలో గొంతవర కర్ణజ్ఞానము సంపాదించే, చదువరి యయ్యెను. ఇంక నిప్పుడామెకు నవలలు విస్తారముగా జదువుటయందభిరుచి యేర్పడెను. శరణాలయములోని విద్యాశాలలోనవి పఠనీయములు గాకపోయినను, తీరిక వేళలలో నట్టివి జదువుట కెట్టి యభ్యంతరములు లేకుండెను. ఆనవాలా గ్రంధరచనము నందు గన్పడు దాంపత్య విశేషములు, వయోశృంగార విలాసములు హావ, భావ, విలాస విభ్రమ చైతన్యాదులా యాపాత్రలచే బ్రదర్శింపఁబడుటలు చదివిన కొలఁది నామెకు దాంపత్య రహస్యము ప్రేమ తత్వము, కాముకృత్యము లన్నియు గరతలామలకములుగా బోధపడుచుండెను. అనుభవజ్ఞాన మొక్కటిని నానానవ యావని యెరుంగని దొక్క శృంగార కళయును లేదన వచ్చును. మనోహర సురసీర భాదులపైనను సుందరతమ వస్త్రాలంకారములపైనను సుగంధ ద్రవ్య సంచయములపైనను ఆ పూర్వ సువాసినికి తలఁపులు మెల్ల మెల్లగా నుద్భవించి వృద్ధి నొందుచుండెను. క్రమముగా నాతలఁపులు వలపుల క్రిందకిమారి చెలికత్తెల ప్రోత్సాహ వాక్యములచే ననుభవ వేద్యమగుచుండెను. ద్రవ్యలోప మెరుఁగని రాగలతిక తండ్రి పిల్ల యేమడిగిన పంపుచుండువాఁడు. ఇక చీని చీనాంబరములకు జపానుపట్టు పీతవస్త్రమ్ములకునుజాళువాపసిడి చొక్కంపు రవికలకును, జాకెట్లకును శిరోజములకు సుగంధతైలాదులకును, ముఖదర్శికులకును లోటు లేనే లేదుగదా. అందుచే రాగలతిక చెలికత్తె లేదిచెప్పిన నది వెంటనే తండ్రికి వ్రాసి తెప్పించుకొనుచుండెను. లేదా ఆతఁడు పైకము పంపినచో రాజమహేంద్రపురమున దొరకునదైనచో నచ్చట నే గొనిపై చుచుండెను. ఇట్లానవయావని యాశరణాలయమున దన గదినొక మహారాజ సౌంధంతర కేళీగృహ రాజమువలె సత్యాకర్షనీయ వస్తుజాలములతో నింపివైచెను. భరతుఁడా జగన్మోహనదివ్య

సుందర విగ్రహమును జూచి మోహించునట్టి పాప్రేమ మయస్వరూప మును మనసారఁ గ్రోలుచు మానము గ్రహించి యుండెను. పిమ్మట వారికిద్దరి క్రింది సంభాషణము జరిగెను.

భర—లతికా! నీవానాఁడెట్టి యుత్తరము వ్రాసితివోగాని, దానిని జూచినప్పటినుండియు నాకన్నియు కష్టములే తోఁచుచున్నవి. అప్పటినుండి యిప్పటివరకును నామనసు కుదుటబడనేలేదు. నీవా జాబెంత స్పష్టముగా వ్రాసితివి! నాగుట్టంతయు రట్టుజేసితివి. దానిని నాదత్తజనకుఁడు చూచినాఁడు.

రాగ—మేలేమైనది. చల్లకువచ్చి ముంత దాచనేల? ఎన్నాళ్ళని గూఢభావములతో నుండఁగలయును. పదుగురిలో నన్ను పెండ్లాడఁదలచిన వకా భయమెందులకు? అంతపిరికివాఁడవైనచో ముందే నాకాసంగతేల దెల్పవైతివి? ఇంతకు మీజనకుఁ డేమనెను?

భర—నాతో నేమని యనలేదుగాని యాలేఖజూచినదాదిగా నాయందాగ్రహావేశుఁడై యున్నాఁడు. రాణ్మహేంద్రవరమున నట్టి చ్చిపనులుగాని చేసిరాకుమని యన్యాపదేశముగా మందలించినాఁడు.

రాగ—ఇంతేగదా. ఇంతమాత్రమునకై మీరు భయపడవ క్కఱ యుండదు. ఈసారి మీయింటికి వెళ్ళి నేను రాగలతికను ప్రేమిం చియుంటిననియు, దానిని దక్క నొరులను వివాహమాడననియు, రాగ లతికను చేయనిచో నేనాజన్మాంతము బ్రహ్మచర్యవ్రతమైన నవలంబిం పుదు ననియు, మీ జనకునితో బల్కుము. పిమ్మట కార్యము చూచుకొననచ్చును.

భర—ఇంకను నేనట్టిసాహసము జేయలేకున్నాఁడను.

రాగ—అట్లయినచో నన్నేలవలచి, వలపించితివి?

భర—దానికేమి? నేనిప్పటికిని కాదనుచున్నానా?

రాగ — కాదనరు, చేసెదననరు. ఇంకనేమి సామె జూపనివ్వరు, బడితెను పిరుగసియ్యరు. మీమాటలు నాకర్థమగుటలేదు.

భర — అంత దుర్వ్యాహ్యముగా, సంతసంస్కృత పదభూయిష్టమైన భాషను నేను మాటలాడుటలేదే?

రాగ — మీరు బల్కెడి దచ్చతెలుంగు గాబోలు.

భర — అదియునుగాదు. సర్వజన సౌలభ్యమగు గ్రాంథికమే.

రాగ — ఆగ్రంథమున కేమిగాని, నేను చెప్పునట్లు చేయుదురా? లేదా?

భర — (ఆలోచించి) చేసెదనుగాని యిప్పుడుగాదు.

రాగ — మరెప్పుడు?

భర — ఏమంత తొందరయా?

రాగ — అవును. తొందరగాక మరేమున్నది? చచ్చినదాకనుండి నన్నా పెండ్లిజేసుకొనుట? ఈ కాలహరణము నాకు బాగుగలేదు.

భర — [illegible]

రాగ — అదికాదు. బహిరంగస్వీకారము వెంటనే జరుగవలెను.

భర — లేనిచో?

రాగ — అనిశ్చయమును దేల్చుటకయినచో యీసమావేశము.

భర — లతికా! ఇన్నిమాటలేల? నాజీవితములో నింకొకకన్యను వరింపనని బాసచేయుచున్నాను. దీనికి దప్పినచో నేనన్ని సద్గతులకు దప్పినవాడ నయ్యెదను. తెలసినదా? ఇదిచాలునా?

రాగ — చాలదు. ఇన్నాళ్ళని గడువొసంగవలెను.

భర — గడువా? గడువెట్లియ్యగలను?

రాగ — ఏమో? ఎట్లిచ్చెదరో! ఆపాటి ధైర్యము లేకున్ననెట్లు?

భర — ప్రియా! ధైర్యములేక కాదు. కార్యభారమంత త్వరితముగా నెత్తిపై వేసుకొనుటేలయని సుమీ! నాతల్లిదండ్రులు తలంచి

నప్పుడే స్పష్టముగా జెప్పివైచి, యప్పటినుండి యనసన్నాగారములోనుండ వని. యిప్పుడంతయు దెలిసినదా?

రాగ—అప్పుడు నీజననీ జనకులు నీమాటలు పాటిగొనరేమో?

భర—దాని కేమియు భయమొందను. అప్పటి నా ధైర్యసాహస ములు నీవే చూడఁగలవు.

రాగ— ఏమిచెప్పెదరండి? ఇప్పుడు లేదుగాని, అప్పుడెప్పుడో చూచెదనట.

భర—సరి. అట్లయినచో నీకొక వత్సరము గడువు నిర్ణయిం చెదను.

రాగ—మంచిది. దానిని తప్పరాదు సుమీ. తప్పినచో నేను దప్పక మృతినొందెదను. అందుచే నీ స్త్రీహత్యా పాతకమంటుకో నును. ఇది యెఱిఁగి ప్రవర్తింపవలెను.

భర—సరియే. నేను దానికి బాధ్యుడను. యిప్పుడు నీవు తృప్తి వైనదా? ఏదీ నొక ముద్దిమ్ము.

భరతుడట్లు పల్కఁగనే రాగలతి మోమున మందహాసము తాండవించుచుండెను. ఆపె కొంచెము వెనుకకు జరగి "ముద్దులకేమి? ఇఁక మీయొద్దకు జేరినపిదప ప్రొద్దులన్నియు ముద్దులకే గదా." యని పరిహాస మాడెను. భరతు డావాక్యముల సందుజూచు కొని యామె చెక్కిళుల బదేపదె ముద్దువెట్టుకొని యధరామృత పాన మొనర్చెను. లతికయు మోహాపరవశయై యాతని బిగ్గ కవుంగలించు కొనెను. ఆనవయావను లట్లు ప్రేమపూరిత హృదయులై యుండఁగా నింతలో తోటమాలిరాక వారి చక్షురింద్రియములకు గోచరమయ్యెను.

ఆప్రేమారాధనకలుర యెదుటనుండుటకు సిగ్గితెనోయన, జగ చ్చక్షుపర్థ భూభాగమునం దిరిగి ప్రకాశించు వ్యాజమున నస్త్రాద్రిదాటి పోవుచుండెను. నానావిధ విహంగకుల సంకుల కలకలారావములన్నియు

నాబాన గోపాలమునకు శ్రోత్రపర్వము లగుచుండెను. ఆపక్షిసంతాన ములు దినమెల్లను గష్టించి యాహారసంపాదన మొనర్చుకొని కులాయ ములం జేరుట జూచువారల 'కష్టే ఫలమేలచేయరాదు? సోమరులమై మనమేల కాలము వెళ్ళబుచ్చవలె'నను నీతిని వారివారి హృదయ పుటంబులం దంతరాత్మ ప్రవేశింపఁజేయుచుండెను. సాంధ్యకిమ్మీరకాం తిచ్ఛటలు నల్దెశలప్రాకి ప్రకృతినంతను బంగరుమయము గావించు చుండెను.

గండుగోయిల లప్పుడు మధురస్వనము లీనుచుండెను. శ్రావ్యమైన యా యాలాపంబులు కర్ణపుటంబులంబడి యొకప్రక్క హాయినిం పుచుండఁగా నేత్రపర్వంబగు నాప్రకృతి వైచిత్ర్యమును గాంచుచు, నప్పుడప్పుడే మెల్ల మెల్లగా జల్లనై వచ్చుచున్న పిల్లవాయువుల నానం దించుచు సరససల్లాపములతో బ్రొద్దుపుచ్చుచుండిన యాదంపతులకు. కాను కాదు ప్రేమోపాసకులకా తోటమాలిరాక హృదయతాపమునకు కారణమయ్యెను.

తోటమాలి యంతట వారలఁజూచి "ఏమండీ! నేనింటికేగుచు న్నాను. ఇప్పుడు మీరు బయలు వెడలరాని చో నీరాత్రి కిచ్చట నేయుండ వలెను." అనెను. వానిగంభీరసంభాషణమాలకించి రాగలతికా భరతులు మారుమాటాడక వెలుపలికి వచ్చిరి. రాగలతిక భరతునివద్ద సెలవుదీసి కొని పునర్దర్శనమునకై యెన్నియో వాగ్దత్తములందికొని శరణాలయ మున కేగెను. భరతుఁ డామెవంక నేజూచుచు గొంతసేపునిలఁబడి, యామె యదృశ్యమైనంతనే తనయింటిదారిబట్టి పోయెను.

భరతుఁ డచ్చటనున్న పదిదినము లవలీలగా గడచిపోయెను. పాతస్నేహితు లందఱితోడ నాతఁడాదినములు బుచ్చివైచెను. వేళకన్న ముగూడ సరిగాదినక వారితో విహారము లొనర్చివైచెను. కాని యొకః ప్రక్కను రాగలతికకిచ్చిన వాగ్దత్తమెట్లు సఫలీకృతమగునాయని విచా

రింపసాగెను. అది దలంచుకొనినపుడెల్ల నాతని కన్నులు సహింపకుం డెను. సాహసించి యెరికి జెప్పుటకును తోచదయ్యెను. ఆసంతాపభార ముచే నాదినము లోకవిధముగా గడచిపోగా జననీజనకులవద్దను, సోద రులందఱియొద్దను సెలవుదీసికొని యాతఁడు మెల్లగా పయోమార్గసాయ మున నొకటిరెండు యామములలో నుండవల్లిని జేరుకొనెను. సుశీలా ప్రకాశముగార్లచ్చటి బంధువులందఱి యోగక్షేమములు విశదీకరింప బడెనని వేరుగ నుడువనక్కఱలేదు.

---

# పంచమ ప్రకరణము.

## దురాలోచన.

---

అరుణుఁడప్పుడే యస్తాచలము దాటి పోవుచుండెను. దోషా కరుఁ డల్లనల్లన వియత్పథమునకు వచ్చి తారాపరివేష్టితుఁడై వసింప నారంభించెను. నాఁడే నెలపొడుపుదినము. అందుచే నాతని కాంతులు ప్రకాశమానముగలేవు. లేవెన్నెల లోకమంతయు బర్విననుదేవాలయ గర్భాలయములలోని మినుకు మినుకు దీపములవలెనే యుండెను. కృష్ణా స్రవంతియొడ్డున నొక యున్నతసైకతస్థలంబున నాకీనీడలో నిర్వురు యువకులు కూర్చుండియుండిరి. అందొక్కఁడు తనదృష్టిని నింగిపై బరపి దోషాకరుని సాయముగోరి దీర్ఘాలోచన తత్పరుఁడై యున్నట్లు గన్పడును. ద్వితీయుఁ డంబరవీధిని బఱుపక దనచూడ్కుల నేలపైఁ బ్రసరింపఁజేయుచుండెను. ఈతఁడుగూడ నేదియోయొక టాలోచించు చున్నట్లు తోచుచున్నది గాని యాతనిడెంద మాందోళనాపూరితమై యున్నట్లు స్పష్టము. అందువలననే యాతనిదృక్కు లెక్కడికిని బ్రాకక మందమై వసుంధరపై వ్రాలుచుండెను. కొంతసేపటికి వారిద్దఱి క్రిందిసంభాషణము జరిగెను.

రెండవవాడు—మిత్రమా! కథనంతయు వింటివిగదా. దీనిపై నీయభిప్రాయ మామూలాగ్రము దెలియపఱుపుము.

ప్రథముడు—సఖా! ఇంతవరకు నీవు చేసినదంతయు సమంజసముగనే యున్నది. కాని యిప్పుడు పెద్దలకు భయపడి నీయాత్మస్వాతంత్ర్యమున కరికట్టితివా? రెంటికిం జెడ్డ రేవణివలె నయ్యెదవు. నీ వివాహపరిములకు దూరుడవౌదువు. లతిక జెప్పినట్లు నీకు స్త్రీహత్యాపాతకమంటుకొనుట కీషన్మాత్రము సందియముఁలేదు.

రెం—అందువలననే నింతగా విచారింపవలసి వచ్చినది. నా మనమున త్రికరణశుద్ధిగా తిలకను చేపట్టవలెనని నిశ్చయించియే యున్నాను. మిన్ను విరిగి మీఁదపడ్డను నేను లెక్కచేయువాఁడనుగాను. కాని యిప్పుడు ముందుకు బోయిన నూయి వెనుక కేగిన గోయ్యివలె నాస్థితి యున్నది. నేను ధర్మద్వేషియు పితృద్వేషియు గావలసి వచ్చుచున్నది.

ప్ర—నీవీకార్యము జేసినచో జననీ జనకులకు సంపూర్ణ ద్వేషివగుదువను మాట వాస్తవమేగాని దాన నీకేమియు ప్రమాదము లేదు. ధర్మముమాట కట్టిపెట్టుము.

రెం—ద్వేషినైన చాలదా ? కానలెనని కోరి పెంచుకొన్న జనకుఁడే ద్వేషించుచో నింకేముండును? ఐనను ప్రమాదము లేదందువేల?

ప్ర—ఇంతమాత్రమెరుంగవా? ఇది సర్వసాధారణమైన విషయమే.

రెం—నాచిత్తమునకింక నది తోచనేలేదు.

ప్ర—ఈమధ్య ప్రకాశముగారికి జబ్బుజేసినపు డాతఁడు తన యాస్తినంతయు నీపేర దఖలుపరచియుండలేదా?

రెం—నిజమే. ఐననేమి?

ప్ర—ఓయీ! నీవింకను వెరటిత్రోవనే యున్నావు. దఖలు పర చిన పిమ్మట నిన్నాతఁడేక నేమి సేయఁగలఁడు? నీయిష్టమువచ్చినట్లాతఁడా జన్మాంతము నడచుకొని తీరవలెను. లేనిచో నాతని పోషణ కొరకై యింతయని భరణమమాత్రము గ్రహించును.

రెం—అదియాం? ఆత్రోవలేదనికాదు. ధర్మాచరణమునకై యాతఁడు నన్ను దత్తుగొనెనుగదా. నేను కులవిచక్షణ లేకనే వర్ణాంతర వితంతూ ద్వాహము జేసుకొన్నచో నాతని పాట్లెట్లగునని? అనఁగా నైహిక చింతతో గాక పారమార్థిక దృష్టితోనే నాలోచించు చున్నాను.

ప్ర—అవి యన్నియు శాస్త్రప్రకారమే విచారించినచో, నీవా క్కయిడుగిడఁ జాలవు. నీకు వచ్చునది స్త్రీ హత్యా పాతకమే.

రెం —అయ్యో! నేనెరుఁగక నీదత్తత కిష్టపడ్డొంటిని. లేనిచో నిన్ని కడగండ్లు రావుగదా. ఆనాఁడు నాకన్న తండ్రితో నీమాటల జెప్పినచో యిన్నిదాకపోవు కు. ఇప్పుడేదియో యొకటి తెంచివేయవలసి వచ్చినది.

ప్ర—నోటిలో తలఁదూర్చి రోకటి పోటునకు వెరువరాదు. నీవు నేజెప్పినట్లుజేసినచో నన్నియు చక్కఁబడును. చేసెద నన్నచో జెప్పెదను.

రెం —ఇదియొక ప్రమాణమా ? చేసినవి చాలునులే. చెప్పుము. చేయవగియున్నపుడు చేయక దానిని చేయ జూర విడుతునా ? కానిమ్ము.

ప్ర—ఏమందువా? రాగలతిక వివాహమాడక తప్పదని ప్రకాశముగారితోనీవు స్పష్టముగా నీరాత్రియే చెప్పుము. ఆయననీమీద యాగ్రహపడెనా దానికి లక్ష్యము జేయకుము. ఒకవేళ నాయింటినుండి వెడలిపొమ్మని యనెనా, నీకిచట నిల్వెచ్చటిది? నీవే వెడలిపొమ్ము.

అని ధైర్యముతో బదులు పలుకుము. తరువాత సంగతి జూచు కొందము.

రెం.—నాకన్నతల్లిదండ్రులుగూడ నన్ను బహిష్కరించినచో?

ప్ర.—బహిష్కరింపనిమ్ము. నీ యంతట నీవే సుఖముగా రాగల తికను వివాహము జేసుకొని స్వేచ్ఛగా కాపురము జేయవచ్చును.

రెం.—అయ్యో! రాగలతికా. ఎన్ని చిక్కులు దెచ్చితివే?

ప్ర.—అదిగో మరల నధైర్యపు పలుకులు బలుకకుము. దాని కిచ్చిన ప్రతిజ్ఞయు, దానిపైనాపె శపథమును నీమనః పలకమున జిత్రించుకొని సర్వదా దానిని జూచుకొని ధైర్యము వహింపుము.

రెం.—ఇఁక నీవు చెప్పినట్లే జరుగవలెనని తోచుచున్నది.

పిమ్మట నాయిర్వు రచ్చటనుండి లేచి గృహాభిముఖులై నడచిరి. త్రోవలో నెవ్వరుగాని యెట్టి ప్రస్తావనము జేయక వారి వారి యిండ్లకు జనిరి. వారిద్దరు మనకు చిరపరిచయులే. ప్రథముఁడు విమలానందముగారి ముద్దుకుమారుఁడు రాజశేఖర మనియు, ద్వితీయుఁడు మనభరతుఁడేననియు పాఠకు లూహించియే యుందురు.

భరతుఁ డింటికి జేరగనే మిత్రస్సైరితుఁడైన యాతని కమిత ధైర్యము చేకూరెను. ప్రకాశముగారి యాస్తియంతటికి నతఁడే కర్తను గదా యని తలంచుకొను కొలఁదిని వాని పిరికితన మదృశ్య మయ్యెను.

ప్రకాశ మింతలో దన యాస్తికి దఖలు వ్రాయక పోవువాఁడే గాని భరతుఁడు వచ్చిన రెండు నెలలకే యాతని కొక పెద్దజబ్బు జేసెను. అప్పుడాతఁడు నిజముగా మరణించు ననియే యెల్లవారును దలంచిరిగాని భగవంతు డాతనికిచ్చిన యాయుశ్శేష మింకను మిగిలి యుండెను. ఆరుగ్మతలో బంధువులు నల్వురు జేరి ఆస్తిని దాఖలు వ్రాయించిరి. దత్తున కట్టి చిక్కులు రావని ప్రకాశము తలంచెనుగాని

హాత్రములేక వచ్చి మీదబడుదురోయని వారందఱు భయపెట్టిరి. కమలకప్పటి కిద్దఱు పుత్రులు గల్గిరి. వారికేమాత్రమాస్తి జెందుటకు నిచ్చగింపని ప్రకాశమాభయములోనే యాపత్రమును వ్రాయించెను. ఆకాలములో సుశీలపేర నాలుగు యకరములభూమి వ్రాయఁబడెను. గాని దానిని గూడ సుశీలానంతరము దత్తపుత్రుఁడే యనుభవించునట్లు లిఖించబడెను. తాను బ్రతికినచో దన్ను పోషించుభారముమాత్రము భరతునిదని స్పష్టపఱుపఁబడెను. కమలవిషయమై సుశీల యెంతయో చెప్పిచూచెనుగాని ప్రకాశమా వ్యాధిబాధ నొకప్రక్కను, కమల ప్రస్తావ మొకప్రక్కను తనకు సూలములైనట్లుగా బొబ్బలిడుచు మూర్ఛించి, వినక యిదివఱకిచ్చినది చాలదా? రెండువేలరూప్యములు కట్నముగా నిచ్చియుంటిని. వస్త్రాభరణములెన్నియో దిగవేసితిని. నీకెప్పుడు దానికి దోచిపెట్టవలెననియే. ఆశకు మితిలేదు. అక్కడగతిలేదను నామ్యముగ నున్నది.'' అని సమాధానము చెప్పెను. సుశీల నల్వురిలో నామాటల వినలేకను పడలేకను, తానుజేసిన పొరబాటునకు తానే కర్మమనుభవింపవలయునుగదా యని లోలోన దుఃఖించుచు నాదుఃఖమునడంచుకొని మిన్నకుండెను. ఈసంభాషణమప్పుడు కమలయు, కమలాకాంతుఁడు నచ్చటలేరు. దఖలుపత్రమంతయు విమలానందముగారి యాలోచనముపైననే వ్రాయఁబడెను. కమలాకాంతుని తల్లిదండ్రులా పత్రము జదువునప్పుడుండిరిగాని వారెట్టియాక్షేపణమును జెప్పఁదలచుకొనరైరి.

ఇదిజరిగిన కొలఁదిదినములకే ప్రకాశమారోగ్యము బొందజొచ్చెను. ఆతఁడు పునర్జన్మబొందెనని యెల్లవారును తలంచి నిత్యమువచ్చి చూచి పోవుచుండిరి. వచ్చిన బంధుమిత్రాదులరిద్దఱికి నాతఁడుచిత మర్యాదలజేసి పంపుచుండెను కొన్నిమాసములలోనే యాతఁడు సంపూర్ణారోగ్యవంతుఁ డయ్యెను.

విమలానందముగారి సోదరుఁడగు బ్రహ్మానందముగారి కొక కుమారిత గలదు. ఆబిడ మన కమలవంటిదే. వయస్సునగాకున్నను విద్యారూపవిభవములనాకన్యపుట్టినదేనని పలుకవచ్చును. కానియాకన్య కకుగూడవిమలానందముబుద్ధులు కొన్ని లేకపోలేదు, పైకి నిరాడంబరము గను, నిగర్విగను, ఆమె యుండునుగాని లోలోనదాను పెద్దయింటపుట్టిన దాననను నహంకారమును. దనతో సమానులులేరను గర్వమును గల్గి యుండును. అందుచే నితరుల నంతగా నామె లక్ష్యపెట్టుడిది మాత్రము కాదు. ఆకన్యారత్నమును భరతునకిచ్చి పెండ్లిచేయుటకై ప్రకాశము తలంచియుండెను. దీనికంతటికిని విమలానందమే మూలకందమని పాఠ కులూహింపఁగలరు. కట్నములపై యాసలేని ప్రకాశమా వధు నిశ్చ యమునకై ప్రయత్నమేమియు జేయనక్కఱలేకుండఁగనే యాపె తలి దండ్రుల నామోదమును బడసెను గాని భరతుని సమ్మతియే గావలసి యుండెను

ప్రకాశమునాడు భరతుని బిలిచి “భరతా! నీకీసంవత్సరము పెండ్లిజేయనెంచినాను. బ్రహ్మానందముగారి విమలను నీకు చేయుటకై మాటలాడుచున్నాను. ఇది చాల మంచిసంబంధము. మనలో కలసిన వారు. ఊరిలోగల చుట్టరికము. నీవు దీనికి సమ్మతించినచో, రాగల మాఘమాసములో వివాహప్రయత్నము గావింతును.” అనెను.

భరతుఁడు మాటలాడలేదు. నిస్తబ్ధుఁ డయ్యెను.

“ఏమి? నీయభిప్రాయమును స్పష్టపఱపుము. బ్రహ్మానందము గారు త్వరపడుచున్నారు.” అని ప్రకాశము మఱల ప్రశ్నించెను.

ఆడబోయినతీర్థ మెదురైనట్లుగా భరతుఁ డిదివఱకే ప్రస్తావింపఁ దలంచియుండుటచే నాతనికిది మంచివీలుగ నుండెను.

భరతుఁ డేదియో చెప్పఁబోయి కొంచెము వణఁకెనుగాని మఱల ధైర్యము దెచ్చుకొని యిట్లనెను. “నాకేసంబంధ మక్కఱలేదు.”

ప్రకా—మఱేది కావలెను?

భర—దానిని ముందు నిశ్చయించి చెప్పెదను.

ప్రకా—నీనిశ్చయమే నెఱుఁగనిదికాదు. రాగలతిక నేనా?

భర—అవును.

ప్రకా—అది వితంతువు. అన్యకులసంజాత. కావున కూడదని చెప్పుచున్నాను.

భర—నాకదియే యిష్టము. నేను చిన్నతనముననే దానిని ప్రేమించితిని. ఏమైనగాని, దానిని పరిణయమాడవలెనని నాసంకల్పము.

ప్రకా—భరతా! ఇట్టి పిచ్చియూహలు కట్టిపెట్టుము. నేను నిన్ను కోరి తెచ్చుకొనినందులకెట్లో నన్ను తరింపఁజేయుము. నన్ను వర్ణసంకరునిగా జేయఁజూడకుము. నేనా దుర్వార్త భరింపఁజాలను.

భర— రాగలతికదప్ప నాకితరకన్య యక్కఱలేదు.

ప్రకా— (కోపించుకొనుచు) రాగలతిక గావలసినచో, నాయింటనుండి వెడలిపొమ్ము.

భర— (వేళాకోళముగా) నీయిల్లయినచో నక్లొపోఁజాలదనులే.

ఇట్లనుచు భరతుఁడు తనగదిలోని జరచూరనేగెను. ప్రకాశమున కెక్కడలేని యాశ్చర్య భయావిషాదము లొక్కమాఱుగా గల్గెను. ఆలోచించుకొని ప్రకాశము "అయ్యో! ఎంత బుద్ధిహీనుడనైతిని." అని పలుమారనుకొనసాగెను. ఈసంభాషణము సాంతమగునప్పుడే సుశీల లోనికివచ్చెను. అదివరకామె యభ్యంతరమందిరమున వంట గావించుచుండెను. భర్త విచారముతోఁబల్కు నాతుదివాక్యములామె కర్ణపుటంబులం బడెను. ఆర్ద్రభావయై సుశీల భర్తసన్నిధి కేగి, "ఏమిటి విచారించుచున్నారు? భరతుఁడేమనెనేమి?" అని ప్రస్తావించెను.

"భరతుఁడా! భరతునివలన నేను పతితుఁడను కావలసివచ్చి ది. అట్టి యపాత్రుని దెచ్చుకొన్నందులకు నానేత్రములన్నియు కట్టి

టలపాలు గావలెనఁట. అయ్యో! వీడు నాకు శాత్రవుఁడై పుట్టియుం డెను గాబోలు గాని పుత్రుడుగా గనుబడడు. ఆనాఁడు మాతులుఁడు బల్కిన మాటలఁ ద్రోసివేసిన పాతకమునకీ ప్రతిఫలమనుభవింపవల యును. మిత్రునివలెనుండిన విమలానందముగారు చెప్పినవాక్యములనే నమ్మి, మాతులుని శాత్రవునివలె నిరాదరించిన నాకెట్టిహితము గల్గును". ఇంతకుఁ నొరుల ననవలసినదేమి? నేనే బుద్ధిహీనుఁడనై యీ యపాత్రుని కిల్లును, భూమిని వ్రాసియిచ్చితిని" అని ప్రకాశము విల పింపసాగెను.

భరతుఁడు క్రోధమూర్తియై తనగదిలోనుండి యాతని విలాపము లాలకించుచుండెను. తనను దూషించుపల్కులు విన్నకొలఁది నాతని దేహము పులకరించుచుండెను. ఆతఁడు తన శరీరమునే మరచిపోయెను. ఇఁక దండ్రిని మఱచుటలో సంశయమేమి? క్రోధఘూర్ణితాత్ముఁడై యాతఁడు మఱల గదినుండి బయటికివచ్చి "నేనపాత్రుఁడను, నీవుపా త్రుఁడవునా? నేను నీకు శాత్రవుఁడనా? మంచిది. అట్లే యనుకొమ్ము. ఇఁక నీవు పడుపాట్లు చూచుకొనుము." అని పల్కెను.

"ఛీ! గాడిదా! నోరుమూయుము. నిన్నెవ్వరు బిలిచిరి? నాపా లిటి యమదూతవు. లోకైకనింద్యుఁడను దుర్యోధనరూపముం గొ వచ్చితివి. నీవు రాక్షసుడవు ఇంకను సిగ్గులేక నెదిర్చి మాటలాడు చున్నావా?"యని ప్రకాశమనెను. "ఇఁక నీమాటల బడెడువాఁడను గాను. నేనిపుడు యుక్తవయస్కుఁడను. సర్వాధికారిని. ఇష్టమున్నచో నీవిక్కడనోరు మెదల్పక యుండుము. లేనిచో చూడుమేమిచేసెదనో?" భరతుఁ డనెను.

ఇట్లా తండ్రి కుమారుల మాటలంతకంతకు హెచ్చి ముదిరి పోయెను. అవి కొట్లాటపర్యంతమగునట్లు కనుబడఁగనే యిరుగుపొరుగు

వారాలకించి వచ్చి వారిద్దఱను వేరుపఱచిరి. భరతుఁ డచ్చటినుండి వెంటనే యదృశ్యుఁడయ్యెను.

ప్రకాశముగారి విచారమున కప్పటినుండియు మేర లేకుండెను. ఆనాఁడు మొదలుకొని యాతఁడు సరిగా భోజనముసేయుటయే లేదు. సుశీలకు రెండుమాసముల క్రిందనే గర్భోత్పత్తి యయ్యెను. సుశీల గర్భఫలమునకై పరితపించిన ప్రకాశమున కావిషయము స్పష్టమైనకొలఁదిని సంతోషమునకు మాఱు పరితాపమే గల్గుచుండెను. ఆతనిపని జుట్టుచేతికిచ్చి ముడ్డితో గంతులువైచినట్లుండెను. మరణవేదనతో తుల్యమగు పరితాపవేదన మాతఁడనుభవించుచు వచ్చెను. విమలానందము మున్నగు వారెల్లరు ప్రకాశమును జూడవచ్చిరి. గాని వారిని చూచుటకే ప్రకాశమునకు సిగ్గగుచుండెను. మహాపరాధ మొనర్చిన యపరాధివలెనే ప్రకాశము బయటివారల కదృశ్యుఁడై పోయెను. ఒకనాఁడు విమలానందము ప్రకాశముకడఁజేరి "ఏమిటిప్రకాశం! నీవిట్లొంటరివై దీర్ఘచింతతోడే కాలము గడుపరాదు. నీదినము లెట్లో వెళ్ళిపోఁగలవు. వాఁడు మనమాటలు విని బాగుపడెనా మంచిదే లేనిచో వానికర్మమునబడి వాఁడే పోవును. మూవాఁడు స్వేచ్ఛగా దిరుగుటజూచి నేనేమిచేయఁ గల్గితిని. నీకేమి? నీవే యిట్లున్నచో సుశీల యెట్లుండును? పాపమది గర్భిణి నీవలన దాని యారోగ్యభంగము గలుఁగనీకుము. ధైర్యము వహించి యుండుము. నేనువానితో మెల్లగా ముచ్చటించి చూచెదను.' అని మధురముగా భాషించెను.

ప్రకాశము యోదార్పువాక్యముల కొంచెము తేరి "ఆమూర్ఖుఁడు మీరుగాని మరెవ్వరుగాని చెప్పినచో వినువాఁడుగాఁడు. మీవాడెంత మూర్ఖుఁడుకాఁడు. ఇదిగాక నీవానాఁడు పత్రమువ్రాయించనిచో, నెట్లుండెడిదోగాని యిప్పుడాతనిస్థితి మీరిపోయినది." అని పల్కెను.

“ ఇట్లువచ్చునని మనమూహించితిమా ? కానిమ్ము చూచె దను. ” అని విమలానందము ప్రత్యుత్తరమిచ్చి వెడలిపోయెను.

భరతుఁ డానాడట్లు ప్రకాశముతో నెదిరించి సంభాషించిన తరువాత యచ్చటికి వచ్చిన రాజశేఖరముతో గలసిపోయి వారిద్దరు నాలోచించుకొని బెజవాడ జేరిరి. అక్కడనున్న మారువాడీవర్తకులకు కొంతభూమిని తనకాబెట్టి వారికి గావలసిన ద్రవ్యమును దీసుకొనిరి అయ్యది సాధారణపు వడ్డీపై గాక మూడువంతు లధికముగ నుండెను. ఆ ద్రవ్యముతో భరతుఁ డచ్చట నొక యింటి నద్దెకు దీసుకొని రాజశేఖరమును తానును స్వేచ్ఛగా నివసించుచుండెను. భరతుఁడీ విధముగా ప్రకాశముగారి బాధను దప్పించుకొనగల్గినను జనక తల్లి దండ్రుల భయమొక ప్రక్కను వేధించుచుండెను. గాని రాజశేఖరము మాటలతో నాతఁ డుత్సాహ పడఁజొచ్చెను. భరతుఁడు ప్రకాశము గారితో పోట్లాడి బెజవాడలో కాపుర మున్నట్లుగా నచ్చటికిబోయి చూచినవారెవ్వరో రాజమండ్రిలో రామానందముగారి చెవిలో నూదిరి. ఆతఁడత్యాశ్చర్య పరవశుఁడై యపరిమితాందోళనాయత్త చిత్తుఁడై భార్యాపిల్లల కెరింగించెను. ఆతనికిప్పుడు దూర ప్రయాణము జేయుశక్తి లేకుండెను. వాస్తవ మెరుఁగుటకై యాతఁడు రామలక్ష్మ ణులను తోడుజేసి బెజవాడకు బంపించెను. రామానందముగారు వారిని బంపివేసి పిమ్మట నీరీతిగా విచారింపసాగెను.

“ అయ్యో! ఆనాడే నేను వీనిని దత్తుగా నిచ్చుట కియ్యకొన కుంటినిగాని విమలానందము ముక్తేశ్వరరావుగారలు నామనసును త్రిప్పి వైచిరి. దానికి వీండ్రందరు తోడ్పడిరి. కొండంతయాస్థి నిచ్చిన ప్రకా శముగారిక కూలిపోవుటకు సందియములేదు. ఆయననే నేరీతిగా నోదా ర్చగలాఁడను ? పట్టణమునందు చిన్నతనమునుండి బెరిగి మితిమీరిన స్వాతంత్ర్యవాతావరణము ననుభవించుచున్న యీపిల్లలు కట్టుబా

టున కెంతవరకు సహజముగ లొంగగల్గినది నేనాడే గ్రహించితిని గా
దైవబలముచే నాయుద్దేశ్యము మారిపోయినది. అకటా నీవునా యశ
కీర్తి దెచ్చుటకుగా జనించితివిగాబోలు! లేకున్న నీవెక్కడ! వర్ణసం
బంధమైనలేని వితంతు వెక్కడ! ఈయలినా భావసంబంధ మెచ్చట
బుట్టి పెరిగినదిరా? అంతగట్టిపట్టుపట్టుటకు నీకా కాంత నూరిపోసిన
మందేమి చెప్పుమా? ఓరీద్రోహీ! నీవు నిజముగా నాపట్టివిగాదు.
కట్టడి రక్కసివిగా నున్నావు. ఈచెడ్డకార్య మాచరింపుమని నీకెవ్వరు
బోధించిరిరా! ఆ వితంతువును చేపట్టినగాని నీయట్టివానికి కాదా?
కట్టా! నీకెవ్వరో నీయల్పబుద్ధులు నేర్పియుండవచ్చును. లేనిచో
నిక్కడ నున్నవరకు మనయెడల జాగ్రతగ సంచరింపలేదా? భరతా!
నీవు సత్యనిరతుండవై యుభయ వంశముల తరింతువని తలంచితిగాని
యిట్టి దురితకార్యా చరణుండవై పరదవ్యాపహారివై ద్రోహము
నర్తువని యెఱుంగక పోయితిని. ఆహా! ప్రకాశం! నీకెట్టిచిక్కులు గల్గిం
చితిని! నన్నెట్లు దూరుచుందువోగదా! తండ్రీ నేనేమి చేయఁగలను?
ఐనను ప్రయత్నించి చూచెదను." రామానందమిట్లు విచారించుచునే
మంచమెక్కెను. వయోవృద్ధుండగు నాతని పరితాపమున కెంతని హ
ద్దుండును? ఇఁక రామలక్ష్మణుల సంగతి కనుగొనెదము. రామానంద
ముగారి యాజ్ఞానువర్తులై రామలక్ష్మణులు బయలువెడలి బెజవాడకు
వచ్చిరి. త్రోవలో లక్ష్మణుఁడు తానొకమారు రాగలతికా వృత్తాం
తమును భరతునివలన జూాజాయిగా గ్రహించితిననియు, నాపె శరణా
లయవితంతువనియు జెప్పెను. రామునకు సంగతి యంతవరకు తెలియనే
లేదు. ఆతఁడు కుటుంబ వ్యవహారములును జక్కపెట్టుటతోను మక్తా
లు మున్నగునవి వసూలుచేయుటతోను సరిపోవుచుండెను.

బెజవాడలో దిగి రామలక్ష్మణులు క్రమముగా నూరంతయు
వెదకఁజొచ్చిరి. గాని భరతుఁడు కానరాడయ్యెను. నూతనాగంతు

కుఁడగు భరతుని యునికి యీపట్టణములో నవలీలగా గనుగొనుటకు సాధ్యముకాదయ్యెను. ప్రసిద్ధిగల వారెవ్వరైన వచ్చినచో నెవ్వరైన చెప్పవచ్చును గాని భరతుని వంటివాండ్రెందరో విహరించెడి బెజవాడలో నాతనిగురించి విచారించుటకై కొంతకాలము పట్టెను. ప్రాత వీధులన్నియు రామలక్ష్మణులు తిరిగి చూచిరి గాని యవి యన్నియు వ్యాపారకుటుంబములతో నిండియుండెను. ఐన నిట్టి జనసమ్మర్దమగు స్థానములలో నాతఁ డుండుననుట పొరబాటనుకొని వా రిరువురు గవర్నరుపేటలోనికిబోయి విచారింపసాగిరి.

గవర్నరుపేట క్రొత్తగా నిర్మింపఁబడినది. ఇది బందరు కాలువ యొడ్డుననే గలదు. ఒకప్రక్కను ఏలూరుకాల్వె హద్దుగా నున్నది. ఇందు విశాలమైన ప్రాసాదములున్నవి. పెద్దయుద్యోగులు వకీళ్ళు భూస్వాములు మున్నగు ప్రముఖులీపేటయందు వసించుచున్నారు. కొంతదూరమేగువరకు స్ఫుట వాణీముద్రాలయ కార్యస్థానముండెను. అది దాటినపిమ్మట రాజవీధిలో నడుగఁగా నెవ్వరో యిద్దరు యువకులు మొన్న మొన్ననే యొకమేడ నద్దెకు దీసుకొనియున్నారు అల్లదె. దానిలో నుండవచ్చును. చూడుఁడు" అని చెప్పిరి. రామలక్ష్మణులాగుర్తుల ప్రకారమే యాహర్మ్యముకడ కేగిరి. దాని వాకిలి తెఱచియే యుండెను. సరాసరి వారిద్దరు సౌధమునం బ్రవేశించి పైకి జనిరి. 'ఎవరువారు! ఎవరువారు! అని లోపలినుండి యొక కేకవినంబడియెను. "మాది రాజమండ్రి" అనుచు వారిర్వురు నిలబడిరి. 'మీరెవ్వరు? ఎవ్వరినడుగకనే పైకి వెళ్ళుచున్నారు?' అని మరల నాసేవకుఁడు ప్రశ్నించెను. 'మేమెవ్వరిమైననేమి ? ఇది భరతుని యిల్లేగదా!' యని రామలక్ష్మణులు పృచ్ఛించిరి. 'ఇక్కడ భరతుఁడులేడు గిరతుఁడు లేడు. దిగిపొండు.' అని యాసేవకుఁడు గర్జించుచు పలికెను. పాప మా రామలక్ష్మణు లిర్వురు భయముతో క్రిందకు దిగిపోయిరి.

అప్రాసాదమొక యున్నతోద్యోగి. ద్వారపాలకుఁ డప్పడే కార్యాంతరముపై లోపలికేగెను లేనిచో మొదటనే లోనికి రానిచ్చెడి వాఁడుగాదు. వారిర్వురు బయటికివచ్చి "ప్రమాదము తప్పినదిసుమీ! బాగుగా దెలియక పూర్వము స్వతంత్రించి వెళ్ళుటవలనగలుగు ఫల మిపు డనుభవము లోనికి వచ్చినది." అనుకొనుచువారు వీధిలోనడచు చుండిరి. దాని పక్కనున్న సౌధమునందే భరతుఁడు నివసించుచుండెను. ఆతఁ డటునిటు పచారుజేయుచు కిటికీనుండి చూచుచుండెను. రామల క్ష్మణు లిర్వురుగూడ నాతని నిదానించి చూచి గుర్తుపట్టిరిగాని యితరు లెవచో గుర్తింపఁజాలరు. అప్పుడే భరతుని వేషభాష లన్నియు మారిపోయెను. ప్రకాశముగా రింటికడ సాధారణ రైతువలెనున్న భరతుఁ డిప్పుడొక రాజకుమారునివలె నుండెను. శిరస్సునందున్న గిరజాలకు మారుగా క్రాపింగొకటి యేర్పడెను. అప్పటప్పుడే వచ్చుచున్న నూనూగు మీసాలు కత్తిరింపఁబడి యొకమూల కొంచెము౦చఁబడి యుండెను. అవి పూర్వము రామలింగకవి చంకలోనిజుట్టు సామ్యముగా నుండెను. వస్త్రధారణమునకుమారుగా నతఁడు లాగులను దొడుగుకొనెను. చేత నొక ల్పెన్సిరుచుట్ట యుండెను. కాలికి మేజోళ్ళుు బూడ్సులునునుం డెను. ఇట్లా భరతుడొక నవీనోద్యోగివలెను, లండనునుండి యప్పుడే దిగిన దొరవలెను కనుబడుచుండెను. ఈవేషధారణపై యాతఁడెంత సొమ్ము వ్యయపఱచెనో చెప్పఁజాలముగాని యదియొక కలెక్టరుహోదా గలవాని కుండవలసినట్లుగా నుండెను రాజశేఖరమీతనితో బాటచ్చ టనే సంచరించుచుండెను. రమారమి యట్టిదుస్తులనే రాజశేఖరము గూడ ధరించెను. ఆదుస్తులన్నియు భరతుని సొమ్ముచే వలననే కొనఁ బడినవి.

రామలక్ష్మణు లాతని జూచినంతనే యత్యాశ్చర్యపరులైరి. వారు వెంటనే యాసౌధోపరిభాగమునకేగి యచ్చట భరతుని జూచిరి.

భరతుఁడు వారిని జూచేనంతనే యుచిత మర్యాదలజేసెను. తల్లిదండ్రుల క్షేమసమాచారములన్నియు నడిగెను. సేవకు నొకనిబిలిచి వారందఱ కుపాహారముల్కు దెమ్మని యొకరూప్యము వానిపై విసరివైచెను. కొల దినిముసములలోనే యాపరిచారకుఁడు ప్రక్కనున్న యొక కాఫీదుకా ముకేగి కొన్ని లడ్డు పకోడీలను, నాలుగు గ్లాసుల కాఫీయును గొని వచ్చెను వారు నల్వురు నాయుపాహారము గావించి నేదదేరిరి అనంతర మీక్రిందివిధముగా సంభాషణ జరిగెను.

భర — అన్నయ్యా! నేనిచ్చట నుంటినని మీకెవ్వరు దెల్పిరి?

రాము — భరతా! పిల్లి పాలుత్రాగుచు నెవ్వరు చూడలేదను కొనునుగాని యింటివాడు దానిని చూచి గెంటివేయడా? అట్లే నీవా వేళ చెప్పకున్ననూ, మా ంతమాత్ర మెవ్వరో మాకు చెప్పరా? నీకా మాత్రము శ్రేష్ఠతగాని మాకు లేకుండునా? నీసరకులు విని మన తల్లి దండ్రులు కంటికి కడివెడుగా నేడ్చుచున్నారు.

భర — అన్నా! ఇందు నాయపరాధమేమున్నది? నాకును ప్రకా శముగారికిని సరిపడలేదు! అందుచే నన్యవధిగా బయలుదేరి యిచ్చటకు వచ్చినాను. ఈ తొందరలో మీకు వ్రాయకపోయినది వాస్తవమే అంతమాత్రమునకే నాకు మీపై భక్తిశ్రద్ధలు లేవని భావింపఁకుడు.

లక్ష్మి — మంచిదేగదా! అవి మాటలలోగాక చేతలలో నుండ వలెను.

రాము — భరతా! సరి దానిని పోనిమ్ము. మాందు నీసంగ తెల్పుము.

భర — తెల్పుటకేమున్నది? ఇంక నేను ప్రకాశముగారితో కలసి యుండను. ఇచ్చటనే యుండెదను. నా కాపురమంతయు నిక్కడనే పెట్టెదను.

రాము — ప్రకాశముగారితో నేల కలసియుండవు? నిజము చెప్పుము.

భర — నాకాయన విమలానందముగారి తమ్ముని కుమారితను వివాహము జేసెదమని జెప్పిరి. నాకది యిష్టములేకపోయెను. నేనుదానిని కాదంటిని. అందుచే నాకును వారికిని పోట్లాటగల్గెను.

రాము — భరతా! బ్రహ్మానందముగారి పిల్లకాబోలు! మంచిసంబంధమే! నీవేల కాదంటివి? అంతమాత్రమునకే యేల పోట్లాడితివి?

భరతుఁడా ప్రశ్నకు సమాధానము నాలోచింపసాగెను. ఇంతలో రాజశేఖరమందుకొని యిట్లనెను. "అయ్యా! రామయ్యగారూ! నేను చెప్పునది వినుఁడు. ఇఁక నాయన చెప్పుటకు సిగ్గిలుచున్నాఁడు. ఏమందురా? బ్రహ్మానందముగారి సంబంధము మంచిది కాదనకాదు. ఆయన మాపినతండ్రియే. భరతుని కిష్టములేనిదేలనందురా? ఆతఁడిదివరకే యొక పిల్లను వరించియుండెను. మీరాజమండ్రిలో శరణాలయమునన్నుండు రాగలతికయను వితంతువు నాతఁడు పెక్కునాళ్ళనుండి మోహించెను. ఆపెను వివాహమాడవలయునని భరతుని సంకల్పము. వారిద్దరి కట్లది వరకే మాటలు జరిగెనఁట. అందువలననే బ్రహ్మానందముగారిపిల్లను వద్దనినది. ఇంతకుదప్ప వేరులేదు."

లక్ష్మి — ఆకన్య మన కులస్త్రీ గాదు గాబోలునే?

రాజ — నిజమే! ఐనను దానినిదప్ప పెండ్లియాడఁడఁట.

రాము — భరతా! నీమూలమున నెందఱో దుఃఖించుచున్నారు; ఇటు కన్నవారును, అటు పెంచినవారును, మధ్యను మేమందఱమును చింతించుచున్నాము. నీవీవ్యాపారమును కట్టిపెట్టి యుండవల్లి జేరుట లెస్సయని నాయభిప్రాయము. లేదా రాజమండ్రి వచ్చి మాతో కలసియుండుము.

భర—అది కలలోనివార్త, ఏదియెట్లుండిన నట్లు జరుగును. సర్వ మీశ్వరేచ్ఛ ప్రకారముండును. ఇందుకు మనప్రయత్న మేమున్నది? అన్నిటికిన మనము నిమిత్తమాత్రమేగదా.

రాము—ఆవేదాంతమున కేమిలే! ఇట్టి శుష్కవేదాంతముల వలననే మన దేశస్థులిట్టి యధోలోకమునకు వచ్చిరి. చేయునవన్నియు శివపూజలు. దూరినవన్నియు దొమ్మరి గుడిసెలన్నట్లుగా మనముచేయున దంతయు దేవునిపై బెట్టుటేల?

భర—సరి. నాపైననే బెట్టుకొనెదను.

రాము—పెట్టుకొన్న నేమి? పెట్టుకొనకున్న నేమి? మేము చెప్పి నట్లు వినుటయే నాకు కావలసినది. ఇవి మాపల్కులుగాదు. మన తల్లిదండ్రులవని గూడ గ్రహించుము.

భర—అన్నా! నేనిదివఱకే దృఢనిశ్చయుడనై యున్నాడను. ఇఁక నామాట తిరుగదు.

రాము—సోదరా! నీవు చెడిపోయెదవు. యౌవనోత్సాహమున నీకిపుడేమియు గానరాదు. బంధువులు, మిత్రులు మున్నగువారెల్లరు నిన్ను బహిష్కరింతురు. ముందుకు నీపిల్లలకు వివాహములుకావు. నీయింటికి వచ్చిపోవువా రుండరు. ఆస్థిరిచ్చిన ప్రకాశముగా రొక వంకను, మనపితరులొకవంకను వృద్ధత్వమున చీకు చింతలతో మరణించుటదప్ప నీకు గల్గెడి లాభమేమియు నుండదు. లెస్సగా నాలోచించుము. ఆనాటి కైకకుమారున కెంతపేరువచ్చెనో యీనాడు నీకు నంతియే వచ్చునుసుమీ. కనుక నీరామాయణమును ముగింపుము.

భర—అన్నా! ఏమీ! నారామాయణము ముగింపవలెనా? ఇది యింతటితో ముగియునదికాదుసుమీ. నన్ను కైకపుత్రునితో బోల్చుచుంటివా? మంచిది అట్లే కానిమ్ము. ఆనాడు రామలక్ష్మణు లిద్దరు భరతవాక్యములువిన్నారు కనుకనా యీనాడు భరతుడు వినుటకు? ఎప్పుడు తేదు.

రాము—భరతుని వాక్యముల ప్రకారమే రామలక్ష్మణులు మరల రాలేదా?

భర—ఎప్పుడు మరలిరి? వారివనవాసము వారు ముగించు కొని మరలిరి. ఇప్పుడు భరతుని యరణ్యావాస మింకను పూర్తిగా లేదుగదా. గడచిన రామలక్ష్మణులేమిజెప్పిననేమి? అదిపూర్తియైన పిమ్మట భరతుఁడుగూడ రాముఁడుజెప్పినట్లు నడచును. అంతవరకును పీలుండదు.

రాము—అయిన నిది భరతుని నందిగామువాసమా?

భర—కాదు. కాదు. ఈజన్మములో నాతని కరణ్యవాసము రావలదా?

రాము—ఐన నిది యరణ్యముగాదే?

భర—రామునికి భరతునికి నదియే భేదము. భరతునికి పట్టణ వాసమే యరణ్యావాసతుల్యము. రాముని కరణ్యవాసమే పట్టణవాస తుల్యము ఇది వారి వారి ప్రకృతులబట్టి వచ్చినది.

రాము—భరతా! నీవ్యంగ్యార్థములతో వ్యర్థసంభాషణ మొన ర్చి మమ్ములను వేధింపకుము. శ్రీరామాదులకును మనకును పోటి యా? వారికి మనకు వాస్తిమశకాంతర తారతమ్యము గలదు. గాన నామాటలను పాటించి దారికి రమ్ము.

భర—నవ్వి నేను పోటియని చెప్పుకొంటినా? నీవు సూటి మాటలచే వారితో బోల్చితివి గనుక నేను దాని ననుసరించియే ప్రత్యుత్తరమిచ్చితిని గాని వేరుగాదు.

లక్ష్మ—అవును. అందఱు మారామానందుని పుత్రులమేగదా ఇందెవ్వరు తీసిపోవుదురు? ఐన నందర మొక్కదారినే పోవుట మం చిది. భరతా! మామాటలు వినుము.

భర—చిన్నన్నా! నీవెప్పుడును రామపక్షపాతివేనుమిగా! మీారు నామాట లాలకింపగూడదా? అంత యెందులకు? "లోకోభిన్నరుచిః" నియ

నీతిశాస్త్ర వచనముగదా. అందఱ మొక్కకట్టగా నుండు టెట్లు సాధ్య మో పలుకుము.

లక్ష్మ—మనకు నీతిశాస్త్రమొక్కటియే యిక తరుగు. రామపక్షముగాని నీపక్షముగాని యక్షయమైన దేదియో యదియే రక్షణముగదా. భరతా! నాటి శ్రీరామునికై తపించిన దశరథమహా రాజువలె మా జనకుఁడు కడుంగడు కుందుచున్నవాఁడు. నీవు వచ్చిన గాని యాతని డెందమానంద వశముగా నుండదు. కావున మాతో నొక్కసారిరమ్ము.

భర—రాముఁ డెంతవచ్చెనో నేను నంతియే. రామానుజా! నీయాహ్వానమున కెంతయు నలరితిగాని దానినీ యజ్ఞాతమును బూర్తి గావించిన పిమ్మట ననుసరింతును.

రాము—ఇంతకు మేమెవ్వరమును లేనిదే నీవు పెండ్లిగావించు కొనఁదలచితివా? లేక మేమందరమును నీకుకావలయునా?

భర—అగ్రజా! మీరందరిని వలదని చెప్పువాఁడెవ్వఁడు? నాచే నాహూతులై నపుడు మీరువచ్చినమంచిదే కాని మీరు రారని మాత్రము నాప్రయత్నమాపఁబడదని ముమ్మాటికి నమ్ముఁడు.

రామ, లక్ష్మ—ఇది త్రికరణశుద్ధిగా బల్కినదేనా?

భరతు 'డవున'ని సమాధానమిచ్చెను. రామలక్ష్మణు లంతట చే యునది లేక సాయంకాలపుబండికి రాజమండ్రికి ప్రయాణము సాగించిరి. పట్టణము జేరినవెంటనే రామానందముగారి కాయిర్వురు నిచ్చటి సమాచారము లాద్యంతము విన్నవించిరని వేరుగ నుడువనక్క ఱలేదు.

భరతునికిప్పటికి లోపలనున్న జంకంతయు దీరిపోయినది. తల్లి దండ్రుల భయముగూడ దొలఁగినది. ఇఁక నాతని చేతి కడ్డులేకుం డెను. వెంటనే యాతఁడు వివాహ ప్రయత్నములను గావింపసాగెను.

రాగలతికకు వెంటనే తంతివార్త యొసంగఁబడెను. ఆతంతి వార్తతో వైవాహిక సంచారములకై మరికొంత ద్రవ్యము పంపఁబడెను. శరణాలయ సంరక్షక సంఘమువారే యీకార్య భారమును నిర్వహింప వలసినదిగా కోరఁబడిరి. వితంతూద్వాహాభిమానుల కెల్లరికి నాహ్వానము లంపిరి. మరియు రామానందము గారికిని ప్రకాశము గారికిని, రాగలతిక తల్లిదండ్రులకును, రామేశంగారికిని ఆహ్వానములు పంపఁబడెను.

రాగలతిక వివాహ మన్నంతనే దాని తల్లిదండ్రులు దిగ్భ్రమ జెందిరి. 'ఏమి? మనకు దెలియకనే రాగలతిక వరనిశ్చయము గావించుకొన్నదా? అయినను వితంతు బాలికయగు దీని కాధైర్య సాహసములె క్కడివి ? దీని కంతటికి నేదియో యొక గొప్ప కారణముండి యుండును శరణాలయము వారి ప్రోత్సాహమైన నుండవలెను, లేదా పలుకుబడిగల ధనాఢ్యుఁడెవ్వఁడో మోసగించియైన యుండవలయును. దాని యత్తమామలీ వార్త విని యేమనుకొందురో! మనమే చేయుచున్నామని తలంతురుకాబోలు ! ఇదిఁగాక వరుఁడన్యకుల సంజాతుఁడని తెలియుచున్నది. ఔరా! దీనివలన మన కెంత యప్రతిష్ఠ వచ్చుచున్నది. ? దీనిని చదివించుచున్న దిందులకేనా ? నల్వురిలో మనకు నగుబాట్లగును గాబోలు!" ఈరీతిగా నావృద్ధదంపతు లాందోళన మనస్కులై యుండిరి. రామేశంగా రాహ్వానము చూచినంతనే యాతనికి మొదట నేమియు నర్థముగాలేదు. వధూవరు లెవ్వరై నదియు, వితంతు శరణాలయము సంఘమువారు తన్నేల పెండ్లికి రమ్మని పిలిచిరదియు దెలియజాలకపోయెను. తర్వాత యాతనికి తనకోడలపేరు స్ఫురణకు వచ్చెను. దగ్గరలేని వస్తువు జ్ఞప్తిలో నుండకపోవుట సహజముగదా. తనకోడలే యీపునర్వివాహము గావించుకొనుచున్నదని తెలుసుకొని దానిని తలంచినప్పుడాతఁ

డొక విధమగు విచారమునకే లోనయ్యెను. గడచిపోయిన కుమారుఁడప్పుడు జ్ఞప్తికి వచ్చెను. దానితో నాతని విచారము దుఃఖముగా మారిపోయెను. కొంతసేపట్లు దుఃఖించి పిమ్మట నావార్తను తనసతీతిలకమునకెఱింగించెను. ఆబిడకూడ మిక్కిలి పశ్చాత్తాపము జెందెను. కాని వారెట్టి యంతరాయమును గాని చేయఁదలఁచలేదు. 'దానినైన భగవంతుఁడు సుఖపడఁజేయుఁగాక! మనయాక్షేపణమేల? యని వారు నిశ్చయించుకొనిరి. ప్రకాశమాహ్వానము గాంచినంతనే మండిపడిపోయెను. దానిని చదివిన వెంటనే ముక్కలు ముక్కలుగ చింపివైచెను' కొంతసేపటికా క్రోధముతగ్గి విచారముగా మారెను. తర్వాత నది దుఃఖములోనికి దిగెను.

దుఃఖపూరితుఁడైన ప్రకాశము వారల నాయుత్తరము ముక్కల నన్నిఁటి నేర్చికూర్చెను. అందులోని సన్నాహములకన్నిఁటికి నాతఁడాశ్చర్య పరవశుఁడయ్యెను. ఆవివాహ సందర్భమున జరుగు వేడుకలు, విందులు నొక ప్రక్క నుదాహరింపఁబడి యుండెను. ఈయేర్పాటులన్నియు చేతనొక కాసైనను లేని బుడుతనికి కెట్లు సాధ్యమయ్యెనాయని తలపోయ సాగెను తర్వాత నాముక్కలొక మూల బారవైచెను.

రాగలతిక తన వివాహ విషయమై తల్లిదండ్రులకు ముందే దెలుపవలయునని తలంచెను గాని యట్లు జరుగుచో వారెట్టి యాక్షేపణ మొనర్తురోయని సందేహించి భరతుఁడు వారికి ముందుగా వ్రాయవలదని యుత్తరము వ్రాయుటచే నట్లు చేయఁజాలకపోయెను. ఆయాజ్ఞ ననుసరించియే లతిక వారికెట్టిసంగతిని తెలుపఁజాలకపోయెను. ఆహ్వానములు బంపునప్పుడిఁక వ్రాయవచ్చును గదాయని యొక యుత్తరము వ్రాసెను. అది యీక్రింది విధముగా నుండెను.

"జనకా! బహుప్రభృతి నాయందవ్యాజానురాగముతో బెం పెద్దజేసితిరి. అట్టి ప్రేమమునే సదా కాంక్షించెదను. నాయజ్ఞానావస్థలో మీరు నాకొక పెండిలిగావించి నేను సుఖపడవలెనని తలంచితిరి. కాని దైవబలముచే నది యన్యథాజరిగెను. ఇంక నాకష్టసుఖము లెంతకాలము మీపై నుంతును? మీరు వయోవృద్ధులరు. నాయత్తవారన్ననో నూతన క్రొత్తవారు. వారికి నాయం దెట్టి మక్కువయుండెనో తెలియదు. ఇదం తయునేల యని నేను స్వయముగా వరనిశ్చయము గావించుకొని సంసారభారము వహింపఁదలఁచితిని. ఈవితంతువివాహము శాస్త్రనిగర్హితమని మాత్రము భావింపకుఁడు. వేదశాస్త్రములన్నిటిలో నిది యొప్పుకొనబడినది. ఆదృష్టాంతములన్నియు వీరేశలింగముగారి యుపన్యాసములలో స్పష్టపఱుపఁబడినది. వాని ప్రతులను మీకు బంపితిని. న్యాయపరిశీలనచే వాని సత్యాసత్యనిర్ణయము గావించుకొని మీయంతరాత్మశుద్ధిగా దీనిని నమ్మినచో మంచిదియే. కాని లోకమునకు వెఱచిమాత్రము నాప్రయత్నభంగమునకు దలపెట్టకుఁడు. ఇదియే నాముఖ్యమనవి. మీ కిష్టమున్నచో వచ్చి చూచి పొండు అట్లయినచో నాయానందమునకు మేరయుండదు. లేక నాప్రయత్నభంగమే చేతురా? దానివలన మీకు వచ్చునదేదియో తెలియునా? అది నాయకాలమరణముగాక వేఱు గాదు. వరుఁడేకులజుఁడని యడుగవలదు. ఏమన, సృష్ట్యాదిలో నీకులము లన్నియు నున్నవియా? బుద్ధిమంతుఁడెవ్వఁడైనను, పూజ్యుఁడేయగును. నాకంటికి మనస్సునకింపగు గుణగణసంపన్నునే, నవయౌవనసంపన్నునే ధైర్యసాహసమూర్తినే వరించితిని. ఆయన చిరకాలము నాజన్మాంతరనివాసియైయుండెను. నామనోహరుఁ డయ్యెను. ఈవిషయములన్నియు నా జననికిగూడ నివేదింపుఁడు. నాకు మీయాశీర్వచనములను బంపుఁడు.

చిత్తగించవలెను.

ప్రియకుమారి ["లలిత"]

# వ్యాఖ్యానము.

రామేశముగారీయుత్తరము జదివినవెంటనే యాతని మనసెంతయు నీరైపోయెను. అందుచే నాతఁడు గూడ నెట్టియాటంకమును జేయదలంచలేదు. లతిక తల్లియు నావార్త విన్నంతనే పరమానందభరితయయ్యెను. కాని పైకి పొంగలేదు. ఆమె కాపరిణయము దిలకింపవలెననిగూడ యుండెను. గాని లోకమునకు వెఱచి యందులకు సాహసింపదయ్యెను.

రాగలతికకు భరతునకు మొదట నెట్లు పరస్పర ప్రేమము గల్గెనదో మీరెఱుంగరు. దీనిని జెప్పుమని మీరాతురత పడుచుండవచ్చును. గాని యిది యొకవిధముగా చర్విత చర్వణమే. ఐనను దాన్ని వివరించెదను. రాజమండ్రిలో పాఠశాలా విద్యార్థులందఱికిని సాధారణముగా వితంతుశరణాలయ మత్యాకర్షణీయముగ నుండుటలో నాశ్చర్యములేదు. క్రొత్తయొకవింతయు, పాతదిరోతయు నని లోకోక్తి గలదు. అందుచే నీనూతన వీరేశలింగ శతాబ్దములలో నీవితంతుశరణాలయ మాకర్షింపఁబడుచున్నది. ఇదిగాక నూతనవిషయములు నేర్చుకొనుటయందు విద్యార్థులెప్పుడు చురుకుగా నుందురు. ఇది మానస్వభావమైనను, చిన్నతనమున నెక్కుడుగా నుండును. అందువలననె విద్యార్థిదశలో గ్రహించినన్ని విషయములు మనము పెద్దవారమై పిమ్మట గ్రహింపఁజాలకున్నాము. విద్యార్థిదశలో గ్రహించిన యమూల్యవిషయముల నాచరణలో బెట్టుటయే మానవుని పరమావధియు, చరితార్థమునని విజ్ఞులు నుడువుదురు. ఇది సామాన్యమానవుల విషయము. జితేంద్రియులగు వారెప్పుడును విశేషవిషయములను గ్రహించుచుందురు. వారిప్రస్తావమిచ్చటఁ జెప్పఁదలచుకొనలేదు. భరతుఁడుతనపాఠశాలలో జదువుచున్నపుడాతఁ డప్పుడప్పుడు వీరేశలింగముగారి యుపన్యాసములను వినుచుండెడివాఁడు. ఆమహాత్ముని బోధలన్నియు భరతుని మనస్సు నాకర్షించినవి. ఆతఁడు చెప్పినట్లే తాను

గూడ్ఢ చేయవలయునని భరతుని కుండెను. కాని ప్రకృతిబంధకము లెన్నియో నాతని సంకల్పతరంగములన్నిఁటిని చెదరగొట్టుచుండెను. ఐన నాతఁడా యుద్దేశ్యములను మార్చుకొనజాలకపోయెను. తల్లిదండ్రులు పూర్వాచారపరాయణులగుటచే వారి కిందేమాత్రము తెలిసినను తన్ను మన్నింపరని తోచెను. అందుచే నాతఁడు తనమనోభావము లన్నియు లోలోపలనే యుడంచుకొనెను. తరువాత కొన్నాళ్ళకవి కార్యరూపమునఁ బెట్టవలెనని సంకల్పించుకొనెను. తోడనే యాతఁడు శరణాలయ కార్యస్థానమునకేగి తనయుద్దేశ్యము నతిరహస్యముగా నచ్చటి యధికారి కెఱిఁగించెను. అప్పటికింకను బహిరంగముగా వితంతువుల వరించెటి ధైర్యసాహాములు విద్యార్థిలోకమునకు లేకుండెను. ఆయధికారి యచ్చటివారిలో నందఱిని విమర్శించి, భరతునికులమువా రందులేరని చెప్పెను. గాని యంతటితో నాతఁడు సంతృప్తిపడఁ డయ్యెను. సంకల్పసిద్ధుడను కావలసినదే యని భరతుఁడూహించుకొనుచుండెను. పిమ్మట నాతఁ డొక్కింత యాలోచించి, వర్ణాంతరమైనను సరే, వధువిచ్ఛగించినచో నే నుద్వాహమయ్యెదనని పల్కెను. అప్పుడా యధికారికి రాగలతిక పేరు తలఁపునకు వచ్చెను. రాగలతిక కప్పుడప్పుడే పెండ్లియాలోచన లారంభమయ్యెను. వరాన్వేషణమునకై యాబిడయు లోలోన విచారించుచుండెను.

రాగలతికావిషయము ముచ్చటింపఁగనే భరతుఁ డాయధికారితో నామెను దనకు జూపి పరస్పరసంభాషణ కవకాశమిమ్మని కోరెను. దానిపై యాయుద్యోగి రాగలతికకా వృత్తాంతము దెల్పి యామె యిష్టముపై వారి సమావేశము నేర్పాటొనర్చెను. వారిద్దఱొండొరుల లావణ్యాతిశయముల జూచుకొని సంతృప్తులై కొలదిసేపు సంభాషణ జేసిరి. ఇర్వురు మరలవచ్చి యధికారికి దమసమ్మతి దెల్పి యంతటినుండి పరస్పరముగా ప్రేమింపనారంభించిరి. భరతుఁ డామెను

యథావిధిగా వివాహము జేసుకొనునట్లొడంబడికలు జరగెను. అప్పటినుండియు భరతుండు స్వేచ్ఛగా రాగలతికవద్ద కప్పుడప్పుడు వచ్చుచుండుటయు, వారిద్దఱి వనవిహారములు తఱచుగా జరుగుటయు సంభవించెను. ఐన నిదియంతయు గోప్యముగనే యుండెను. గాని భరతుని తల్లిదండ్రులకు మాత్రము నెల్లడికాలేదు. భరతుండు ప్రకాశము గారి యొద్దికి కర్త గాబోవునప్పుడు పరస్పరసందర్శన సమావేశములు దూరముగుట కిర్వురు చింతిల్లిరి గాని యైనను భరతునికివచ్చు లాభమును గుర్తించి దానికి సమ్మతించిరి. అట్లొనపయావను లిర్వురు రతీమన్మథులవలె దమ ప్రణయసామ్రాజ్యమును విస్తరిల్లజేయుచు నా పురంబున సంతోషవార్ధిలో నోలలాడుచు దమ కాలము హాయిగ గడపుచు వచ్చిరి. ఆదినములలోనే రాగలతిక దినదినాభివృద్ధిగా పరిపూర్ణయౌవన విరాజమానయయ్యెను. అప్పుడే యామె శరణాలయనివాసము రాజాంతఃపురవాసము నకైయుండెనని తెల్పితిమి.

లక్ష్మణుం డొకనాడు రాగలతికాభరతులు వీరేశలింగోద్యానమున విహరించుచుండగా చూచెను. దారినిబోవుచున్నవాడా తోటలోని వారితో మాటలాడుటకు వీలుగా నుండకపోయెను. మరునాడెప్పుడో భరతుని ప్రశ్నించెను గాని యాతడు మరియొక విధముగా జెప్పి తప్పించుకొనెను. ఆవనవిహారమున గాన్పించిన యువతీమణి యొక వితంతువనియు, నదియొక విద్యార్థిని పరిణయమాడగోరి తన్ను దూతకార్యమునకై బిలువబంచెననియు భరతుం డాతనికి జెప్పెను. లక్ష్మణుండందుచే దానిని ముఖ్యమని తలంపజాలక పోయెను. దీనినే యాతడు రామునితో జెజవాడ వెళ్ళినప్పుడు తెల్పెను. రాగలతికాభరతుల వివాహ మహోత్సవ మతివైభవముతో జరుగుట కేర్పాట్లాయెను. విందులు వేడుకలు విశేషముగా జేయబడెను. ఆ పెండ్లి

గొప్ప గొప్ప యుద్యోగులందరు విందులు నారగించి పోయిరి, ఆవరి ణయ విశేషములన్ని వార్తా పత్రికలలోను బ్రకటింపబడెను. వధూ వరుల ఛాయాపటములు కూడ నంపుశోభాయమానముగా గూర్పబ డెను. భరతుడు పెద్ద దేశాభిమానియనియును, సంఘసంస్కర్త యు నియు, విశ్వమానవ సౌభ్రాతృత్వమున కతడు ప్రథమ సోపానమనియు నాపత్రికారాజములెల్లను వేనోళ్ళ శ్లాఘించెను. వానితో భరతుడు తానొకమేటినని భావింపసాగెను. రాజమహేంద్ర పురవాస్తవ్యు లా బాలగోపాలమా వివాహము గూర్చి చెప్పుకొనని వారులేరు. కొంద ఱాతడు దురభిమానియనియు, తల్లిదండ్రులనేమి పెంపుడు వారి నేమి లక్ష్యపెట్టక వనితావ్యామోహమునకు లోనై యాతడు కులభ్ర ష్టుడయ్యెనని కొందరును, మరికొందఱాతడు త్యాగమూర్తియనియు, సంఘదురాచారముల నిర్మూలించుటకై బుట్టిన వీరాగ్రగణ్యుడనియు, మరికొందరాతడు పోకిరియనియు నిట్లు తలకొక విధముగా బల్కు చుండిరి. ఈదూషణ భూషణ, తిరస్కారము లన్నియు భరతుని కర్ణపుటంబులం గూడ బడుచుండెను. కాని యాతడివియన్నియు లక్ష్యపెట్టడయ్యెను. ప్రకాశముగాగా వివాహము సభ్యతర పెట్ట వలెనని కోరికయుండెను గాని న్యాయవాదు లాతనిచర్య శాస్త్రీయము గాదని పల్కుటచే విరమింపవలసి వచ్చెను. అందుచే నాత డత్యంతవిషాద మనస్కుడై పోయెను. రాగలతిక తండ్రిమాత్రము నిజభార్యాప్రేరితుడై యొకమిత్రుని మూలమున గొన్ని కానుక లావధూవరులకు బంపెను. ఆవృద్ధదంపతులకు స్వయముగా నావ రిణయముం దిలకించు కోర్కియున్నను ధైర్యముమాత్రము గల్గ దయ్యెను.

రామేశంగారెట్టి చర్యయును దీసుకొనలేదు. అతడు జరుగు చున్న దానినుపేక్షసేయుటయే మంచిదని తలంచెను.

ఎవరెవరెట్లు తలంచిననేమి వివాహముమాత్ర మత్యంతవైభవోపేతముగ జరిగెనని చెప్పవచ్చును. ఆనూతన వధూవరులు పువీథులం దూరేగుచున్నపు డనేకవేల జనమాయుత్సవముం దిలకింప సాగిరి. నవీన సాంప్రదాయానుసారముగా నావివాహమునకు సానిమేళములు లేవు. దానికి బదులు విస్తారము బాణసంచాలు కాల్చఁబడుచుండెను. భేరీమృదంగాది వాద్యములన్నియు నల్దిక్కులు పిక్కటిల్లునట్లుగా ప్రయోగింపఁబడెను. ఇట్లావివాహము పూర్తియైనంతనే వధూవరులు బెజవాడపురమునకేగి యచ్చట భరతాశ్రమమున దిగి వారచ్చట కాలు వెట్టినతోడనే యచ్చటివారందరు వింతగా వారలఁ జూడవచ్చిరి. ఒకనాడాపట్టణమున గూడ భరతుఁడు విందొనర్చెను. సంస్కారప్రియులగు ప్రముఖులెల్ల నావిందునందు బాల్గొనిరి. ఆవిందు పూర్తియైనంతనే భరతుని యుగ్గడించుటకై యొక సభ జరిగెను. అందనేక యుపన్యాసములు గావింపఁబడెను. భరతుఁడు కార్యశూరుఁడనియు, సంఘసంస్కర్తయనియు దేశాభిమానియనియు బల్వురచే గొనియాడఁబడెను. ఆకొనియాడినవారిలో రాజశేఖరమును వానిమిత్రులును గలరు. రాగలతికా భరతులచ్చటనుండి మిక్కిలి యనురాగముననే నడచుచుండిరి. కాని యది చిరకాలము నిలువఁ జాలకపోయెను.

వారిద్దరొక్క సాంప్రదాయము నంటివచ్చిన వారుగాదు. భరతుఁడు వ్యవసాయ సంఘమునందును, రాగలతిక వ్యాపార సంఘమునందును జన్మించి పెరిగిన వారలగుటయే దీనికి కారణము. ఏపని జేయుచున్నవారికందు గొంతవరకు ప్రవేశమున్నను దానిని ముఖ్యముగా గణింపరు. దూరముననున్న దానిపైననే నాసక్తి గల్గియుందురు. ఇదిమానవనైసర్గికగుణమైనను హిందూదేశాధుని వాసులలో నిది

హెచ్చుగానున్నది. రాగలతిక భూములన్నియు మఱల స్వాధీనము జేసుకొని యాతనితండ్రివలెనే భరతుని వ్యవసాయము జేయుమని కోరుచుండెను. కాని భరతుని కిది వచ్చకపోయెను. ప్రకాశముగారి ముఖము జూచుచు నుండవల్లిలో కాపుర మెట్లుచేయుటయని యాతఁ డాలోచించు చుండెను. కాని రాగలతిక విషయమై యావగింజంత సందియమైనను లేకుండెను. భరతుఁ డాభూములనమ్మి గొప్ప వర్తక శాలను స్థాపింతునని పల్కుచుండెను. అనుభవవేద్యముగాని యీపనిలో బ్రవేశింపరాదని రాగలతిక యాతనికి నొక్కి చెప్పసాగెను. ఈవాద ప్రతివాదములతో కొన్నాళ్ళు జరిగెను. వారికి వచ్చురాబడి వారి వ్యయములకే సరిపోవుచుండెను. వివాహము ముందు భరతుఁడు తెచ్చిన ఋణము లప్పటికి పెరిగి దాదాపు పదివే లయ్యెను. దానిని దీర్చుటకై పదియకరముల భూమి నాతఁడు విక్రయించి వేసెను. ఇతఁడప్పుజేసి పప్పుకూడు దినువాఁడని యొకవిధమగు నిరాదరణ మారాగలతిక మనఃఫలకమున ప్రతిబింబించుచుండెను. గాని యిది సాధారణముగా నెవ్వరికిని దెలియక, దీర్ఘపరిశోధనా కుశలుల కప్పుడప్పుడు వెల్లడియగుచుండెను.

---

## షష్ట ప్రకరణము.
## తెగతెంపులు.

---

ప్రకాశముగారి కిప్పుడు మునుపటి గౌరవాదులు లేకుండెను. దీనికంతటికి నాతనిలేమియే యని పలుకవచ్చును. కలిమిలేములు కావటికుండలని యనుభవజ్ఞులు నిర్ణయించిరి. ప్రకాశమున వృద్ధవాక్యము వేదవాక్యమయ్యెను. ఈయన యాస్తియంతయు భరతునివశమై పోయెను. ఇఁక నీతని చేతిలో నున్నది సుమారు వ్రాసిన నాలుగు యకర

రముల భూమిమాత్రమే. ఇదివారిద్దఱి భుక్తికిమాత్రమే సరిపోవుచుండెను. అదియైనను పూర్వమువలె వెనుకముందు జూడక వ్యయమొనర్చుటకు చాలినంత లేదు.

ప్రకాశ మెప్పుడును మూలధన మించుకొనఁడయ్యెను. ఏసంవత్సరాదాయమా సంవత్సరమే వ్యయమునగుచుండెను. కొన్ని సంవత్సరములలో మిగిలిన సొమ్ముతో కమల వివాహము గావించెను. తరువాత వచ్చిన సొమ్మంతయు భరతునిదత్తతామహోత్సవమునకై సెలవుజేసెను. అందుచే చేతిలో నిలువలేకపోయెను. అయిదారువందల రూప్యములు మాత్రమాపంటలోనివి చేతికి వచ్చెను. భరతుఁడు నిర్భయముగా తెగించి విడివడిపోయినదాది నాతని విచారమునకు మేరలేకుండెను. ఆతనివలన తా నుజీవనభృతి నొందవలసినదిగా నేర్పడెను. దానివడిగి తెచ్చుకొనుట కాతఁడు సమ్మతింపఁజాలకపోయెను. పూలనమ్మినచోట నెవ్వఁడు కట్టెల నమ్మఁజాలఁడు. నూరుయకరములకు స్వేచ్ఛాధికారియైన ప్రకాశము తన భరణమునకై భరతునికడకుబోయి యాచించుట పౌరుషహీనమని భావింపసాగెను. కులభ్రష్టుడైన యాతఁడిక శాత్రవుఁడేగాని పుత్రుడుగాదని నిర్ధారణచేయసాగెను. పిమ్మట నాతని నెట్లయినను సాధించి తీరవలయుననియు, చేతిలోనున్న యైదువందలరూప్యములతో నాతనిపై యభియోగమును దెచ్చి న్యాయస్థానమున దనభూమి నంతటినిగాని యర్థభాగముగాని బొందవలెనని తలంపసాగెను అట్టిప్రయత్నమునకై యాతఁడు న్యాయవాదులను విచారింప నారంభించెను.

ప్రకాశము నిశ్చయమెఱింగిన న్యాయవాదశిఖామణులు నిజమును కప్పిపుచ్చి యవశ్య మీవాదము నెగ్గుననియు, దత్తతాఫలితము ప్రకాశ మనుభవింపనందున నాతని కిప్పుడు భాగార్హతయున్నదనియు, నాతఁడు వ్రాసిన దఖలు నామమాత్రమనియు జెప్పసాగిరి. గాని వ్రాసి

ముచ్చిన యాస్తి తిరిగి చెందనేరదనియు, భరణము మాత్రమే కోరవలెననియు జెప్పిరి. ప్రకాశమంతట వారి మాటలనే నమ్మి న్యాయస్థానమున నభియోగము జేసెను.

ప్రకాశమది వరకెప్పుడును కోర్టునకెక్కి దానిలోని బాధ లనుభవించినవాఁడు కాఁడు. వ్యాజ్యము దాఖలైనప్పటినుండియు నాతని పీడించి తిను వారనేకులు బయలుదేరిరి. సాక్షుల సమనులు చేయింపవలెననియు గుమస్తా ఖర్చనియు పండుగమామూళ్ళనియు, సమనులు జారీచేయువారి కనియు ననేక విధములుగా డబ్బు హాతమై పోవుచుండెను. రెండువందల రూప్యములు ముందుగనే ప్లీడరొకఁడు తీసుకొనెను. సర్కారు వారుకియ్యవలసిన రుసుముక్రింద మరియొక రెండువందలు సెలవయ్యెను. చిల్లర మల్లర మామూళ్ళన్నియు వంద రూప్యము లయ్యెను. వ్యాజములో నొక డెప్పుడు వెంట నుండవలసివచ్చెను. ఆతని రాకపోకల యొక్కయు, సంసారము యొక్కయు వ్యయమంతయు తానే భరింపనలసి వచ్చెను. ఇది దుర్భరమై నానాటికి కష్టమగుచుండెను. అప్పటికి మూఁడు సంవత్సరములు గతించిపోయెను. గాని వ్యాజ్యము విచారణకు రాదయ్యెను. ప్రకాశమునకు క్రమముగా యోపిక తగ్గుచుండెను. విమలానందము మున్నగు వారాతని ముఖ్యసాక్షులుగా నుండిరి. వీరందరు ప్రతివాయిదాకును బెజవాడ న్యాయస్థానమునకేగి, ప్రొద్దు గుంకువరకు, నచ్చట కూర్చుండి తిరిగి వచ్చువారు. ఆన్యాయాధికారి కేసులన్నియు వరుసగావిచారించి ప్రొద్దు గుంకబోవునప్పుడు మిగిలిన నన్నియు మరియొక తేదీకి వాయిదా చెప్పువాఁడు. ఈవాయిదాల కన్నిఁటికిని వచ్చిపోవుటకు రైలుబండ్లకును, పూటభోజనములకును, తదితర వ్యయములకును మితము లేకుండెను. ప్రకాశ మెట్లో వాని నన్నిఁటిని భరించి మూఁడు సంవత్సరములు వ్యాజ్యము జరపెను. చివరకు వ్యాజ్యము విచారణలో

నికి వచ్చెను. సుశీల యీలోపలనే ప్రసవించి యొక యాడు శిశువును గనెను. ఆశిశువును చక్కగా పోషించుటకే ప్రకాశమునకు కరవ య్యెను. అంతలో నాతఁడటు నిటు వ్యాజ్యమునకై తిరుగుటలో నాపిల్లలుతో సుఖముగా కాలక్షేపము జేసుకొనుటకైనను తీరిక గల్ల దయ్యెను.

ఈయభియోగము విచారింపక మున్నే రాజమండ్రిలోని రామా నందముగారు చనిపోవుట సంభవించెను భరతుఁడచ్చటికి బోవుటలో మరికొన్ని వాయిదాలు కోరఁబడెను. పాపమాతఁడు మరణించున పుడు గూడ ప్రకాశము భరతుల చింతతోనే చనిపోయెను. వారినా తఁడు తలంచని నిముసములేదు. ఆతని యవసాన సమయమున ప్రకా శమునకును, భరతునకును వార్త లంపబడెను. గాని ప్రకాశమచ్చటి కి బోవుటకే యిచ్ఛగింపఁడయ్యెను. భరతుఁడొకటిరెండు దినము లాలస్య మున్జేసి తుదకు బయలుదేరి వెళ్ళెను గాని యాతఁడెట్లు బోయెనో యట్లే యయ్యెను. ఆతఁడేగువరకే రామానందము పరలోక గతుఁ డయ్యెను. జనకునిమృత కళేబర సందర్శనమైనను భరతుఁడు పొంద గల్గెను.

రామానందముగారుగూడ నీవ్యాజ్యములో వాజ్మూల మియ్య వలసియుండెను కాని యాతఁ డింతవరకేవాయిదాకును వచ్చుట లేదు. ఇరువురిపక్షమునను, ఆతఁడు వాజ్మూల మిచ్చుటకై కోరఁబడి యుండెను. కాని యెవ్వరి పక్షమునను సాక్ష్యము జెప్పకయే నాతఁడు దివిషల్లోకమున జెప్పదలఁచి కాబోలీలోకమునుద్యజించెనని పక్షవారు తలపోయ సాగిరి. న్యాయస్థానమున నభియోగము విచారణకు వచ్చిన వెంటనే విమలానందముగారియొక్కయు, ప్రకాశముగారి యొక్కయు,

మఱికొందరు సాక్షులయొక్కయు ప్రమాణములు గైకొనఁబడి వారు జెప్పెడి విషయములన్నియు వ్రాసుకొనఁబడెను. భరతుని పక్షము న్యాయవాది కొన్ని యడ్డుప్రశ్న లడిగి చూచెను గాని యవియంత గా పాటింప దగినవికావు. పిమ్మట భరతుని వాఙ్మూలమును, ఆతని సాక్షులగు రాజశేఖరము మున్నగువారి వాఙ్మూలములును తీసుకోఁబడెను. తండ్రియొక వంకను కుమారుడొకవంకను వ్యాజ్యములో సాక్షులుగా నుండి యమూయకులగు వాది ప్రతివాదులను నడపించు చున్నారని ప్రక్కనున్నవారను కొనసాగిరి. విచారణలో దీని ప్రతిన్యాయవాదియు విచిత్రముగా జూడసాగిరి. చివర కాతండ్రి కుమాళ్ళసంగతి క్రాసుపరీక్ష లోనికి గూడ వచ్చి, యీది న్యాయమూర్తి మనస్సును గూడ నాకర్షించెను. పిమ్మట న్యాయవాదులవాద ప్రతివాదములు జరుపఁబడెను. ప్రకాశము న్యాయవాది యాతఁడు వ్రాసిన దఖలునామా నామమాత్రమే ననియు, కర్మకాండల కాశపడి ప్రకాశందత్తుగావించు కొనెననియు నది నెరవేరకుండగనే దత్తుఁడు తన హక్కునకు భంగము గలిగించు కొని కులభ్రష్టుఁడయ్యెననియు, నందుచే నాతఁడిప్పుడు దత్తుఁడుగా బరిగణింపఁ బడఁడనియు, నొకవేళ పరిగణించినను తండ్రి కొడుకుల సందిగ్ధావస్థలో భాగ నిర్ణయము గావించుట ధర్మమనియు, నందుచే ప్రకాశమున కర్ధభాగము పంచుటకై న్యాయమూర్తు లంగీకరింప వలయు ననియు, మనవి జేసుకొనెను. భరతుని న్యాయవాది పైహితము నంతయు ఖండించుచు, దత్తుడు కానీ, కాకపోనీ, దానితో నిప్పుడు ప్రశంస లేదనియు, బుద్ధిపూర్వకముగా ప్రకాశమేనాడు దఖలు వ్రాసియిచ్చెనో యానాడే యాతని హక్కులన్నియు నశించెననియు, యందులో వ్రాయబడిన భరణము నొసఁగుటకు భరతున కెట్టియాక్షేపణ ముండదనియు, నయ్యది న్యాయమూర్తుల చిత్తానుసార మిప్పించ వలెననియు వాదించెను. ఈవాద ప్రతివాదము లన్నియు న్యాయ

మూర్తి మిక్కిలి శ్రద్ధాళువై యాలకించెను. విచారణ యాలస్యమైన ను, వ్యాజ్యము లందరి నిజానిజములను బరిశీలించుటలో నా న్యాయ మూర్తి మిక్కిలి సమర్థుఁడని యచ్చటి వారందరు తలంచుచుండిరి. పాపము న్యాయమూర్తి దయార్ద్రహృదయుఁడు. అతఁడు ప్రకాశము యొక్కదుస్థితి నంతను చక్కగా గ్రహించెను. కాని యేమిసేయు టకును పాలుపోకపోయెను. న్యాయశాస్త్రము ననుసరించి మాత్ర ము ప్రకాశమునకు భాగార్హత నిచ్చుటకు సాధ్యము కాకపోయెను. న్యాయమూర్తి న్యాయశాసనములకు విరుద్ధముగా బ్రవర్తింప నేరఁ డు. ధర్మమునకు, చట్టబద్ధ న్యాయమునకు భేదమప్పుడప్పుడు కలుగు చునే యుండును. అట్టియెడ నాతఁ డవలంబింపవలసినది చట్టబద్ధన్యా యమే అందుచే నిజమైన ధర్మసూక్ష్మమువాది ప్రతివాదులు పొందు టకవకాశమే లేదు ? ఇట్టి ధర్మసూక్ష్మముల బరిశీలించియే మనపూ ర్వులు యెక్కడివారి కక్కడ పంచాయతీ సభ లేర్పాటు గావించిరి. అందు ధర్మములకే ప్రాధాన్య మొసఁగఁ బడుచుండెను. వానివలననే జనులందరు న్యాయమును పొందుచుండిరి. ధర్మబద్ధములైన యాన్యా యస్థానములు కాలవశమున బరాధీనమైన మనదేశములో నశింపఁ గా నిఁక మనకు చట్టబద్ధ న్యాయస్థానములే శరణ్యము లయ్యెను. న్యా యమూర్తి మనస్సున నొక సంక్షోభ ముదయించి, ధర్మమునకు చట్ట న్యాయమునకు నొక సంకుల సమరము జరిగెను. అప్పుడు ధర్మమే జయించెను గాని చట్టన్యాయ మొక యుక్తిచే దానిని బడ ద్రోసెను. అందుచే చట్టన్యాయమే నిర్ధారణ గావలసి వచ్చెను.

ప్రకాశము వ్రాసియిచ్చిన దఖలు నామాను పట్టి యాతనికి భాగార్హత నశించెననియు, గాని యాతని పోషణమునకై జగినంత భర ణార్హత కలదనియు న్యాయమూర్తి నిర్ణయించి, ఆరు యకరముల భూమిని ప్రకాశ మాజన్మాంతర మనుభవింప వచ్చుననియు, దానిని

వెంటనే యాతని స్వాధీనము గావింపవలెననియు, నిర్ణయించెను. అభియోగవ్యయము లెవరివివారే భరించులాగున నుత్తర్వులియ్యఁబడెను. అంతటితో ప్రకాశమునకు కొంత యూపిరి వచ్చిన ట్లయ్యెను.

భరతుఁడుమాత్ర మాశాభంగుఁడు కాలేదు. మిగిలిన యాస్థి యంతయు తనకే దక్కెనుగదాయని సంతస మాతని ముఖవిలాసము జూచువారికి గోచరమగుచుండెను. విమలానందము మున్నగు పెద్ద మనుష్యుల మధ్య వర్తిత్వమున నెట్లనో మిగత కాండలన్నియు బూర్తి గావింపకుండగనే యాభూమిని ప్రకాశముగారి స్వాధీనము జేసి తండ్రి కొడుకులకు తెగతెంపులు జేసిరి. అంతటి నుంటియు ప్రకాశమున కాదత్తుని గొడవ పూర్తిగా నశించెను.

దత్తునిపై వ్యామోహము పోయినపిమ్మట ప్రకాశమునకు క్రమముగా లోలోన కమలపైనను కమలాకాంతునిపైనను ప్రేమముగల్గజొచ్చెనుగాని యది వెల్లడించుటకేయాతని కభిమానముగనుండెను. కలగిన కాలములో కన్నకుమార్తెను, అల్లుని నిరాదరణజేసితినిగదా నిఁక నేమొగముబెట్టుకొని వారి తోహితోక్తుల నాడఁగలనని ప్రకాశముసర్వదాతలంచుచు పశ్చాత్తాప హృదయుఁడయ్యెడివాఁడు. అందుచేవారియింటికి రాకపోకలు తఱచుగాలేకుండెను. మానసపరిపక్వమైనపుడు, బాహ్యచిహ్నములు శాశ్వతముగానిలువజాలవు. బాహ్యకర్మలనన్నిటిని గూడ మానసమేజయించును. అందువలననే శరీరముపై మన సన్నియధికారములను చలాయించుచుండును. ప్రకాశము కొన్నాళ్ళవరకెట్టును మనస్థిమితములేక నింటికడనేయుండి యెల్లపుడు తనస్థితికై పరితాపపడుచునుండును. కొంతసేపాతనికివైరాగ్యోదయమగును. సంసారతాపత్రయబాధలతో గొంతకాలము వ్యర్థపుచ్చును. పురాకృతకర పరితాపమున తానిట్టి

బాధలన్నియు ననుభవింపవలసినదిగావిధాతలిఖించెననియొకొక్కప్పుడూర డిల్లుచుండును. అయ్యో! చేసినపనియంతయు నడవినిగాచిన వెన్నెలవలె వ్యర్థమయ్యెనే యని మఱియొకమారు తలపోయుచుండును. ఇఁక నా దినములెట్లో వెళ్ళిపోగలవుగాని ఈపసికూనయగు శాంతగతి ఎట్లనా యని మాటిమాటికి విచారపడుచుండును. ఇట్లాతని కాలము సులభము గాజరుగక పెక్కువిచారములకు లోనైయుండెను.

ప్రకాశమునకు క్రమముగా కమలపైనను కమలాకాంతునిపైనను యనురాగము గల్గెను. ఇది పూర్వవ్యామోహామువలె సతీప్రేరితమై యసహజమైనదికాదు. తాత్కాలికమై ద్రవ్యవ్యయముతో నశించు నదిగాదు. స్వయంభువును అచంచలమును, అవాఙ్మనస గోచరము నైన సహజానురాగము. కాచిన బంగరుకాంతివలె నీయనురాగము పెక్కుపుటములందలి వన్నెకెక్కెను. జీవనదీనదంబుల యూటనీటివలె నీయనురాగరసము ప్రకాశము హృదయాంతరమున వెల్లివిరిసి కమల తనూభవులపై బడుచుండెను. వారిద్దరిప్పుడు వరుసగా పదియునారేండ్ల వారైరి. ప్రకాశముగారిని వారలు "తాతా" యని పిలుచుచు మిక్కిలి సన్మానముతో దగ్గఱకుఁ జేరుచుండిరి. అప్పుడప్పుడు కమల తల్లిదండ్రుల జూచిపోవుటకై వచ్చినప్పుడుమాత్రమే తాతదగ్గఱ జేరుచుండిన యీ పసిబాలుర నెల్లపుడు దగ్గఱ నుంచుకొనవలెనన్న తాపమా ప్రకాశమునకుగల్గెను. కాలవశమున విరాగి రాగియైనట్లుగా నాతఁడు దహోత్రులయం దధికాదరణము జూపుచు వచ్చెను. మునుపు లేని దీయనురాగమంతయు ముక్కునుండియా వచ్చెన దని సుశీలయు కమలయుచలోక్తిగానప్పుడప్పుడు పలుకకపోలేదు. ఆతఁడామెత్తిపొడుపు లకు స్పష్టముగా క్షమార్పణము జెప్పుకొనుచునే యుండెను. ఇఁక నా నినెవ్వరేమనగలరు? కమలపైనను, కమలాకాంతునిపైనను, ప్రకాశము

నకు మఱల వ్యామోహము జనించినకోఁలదిని తఱుచుగా నాతఁడు వారియింటికిఁబోయి చూచి వచ్చుటయు, నెదురుగా వచ్చెడి మనుమల కేదియైన తినుబండారము లెత్తికొనివెళ్లి యిచ్చుటయు,పండుగ పబ్బములలో వారిని దనయింటికి భోజనమునకు పిలుచుటయు జరుగుచుండెను. పూర్వపుటౌన్నత్య దశలోనుండిన గౌరవవిశేషములీ నాడచ్చట లేకుండినను, అప్పటికలమానాదులప్పుడు పెట్టుకున్నను,కమలాకాంతుని కిప్పటిమామగారి యాదరణమే వేయిమడుంగులు హెచ్చుగాగన్పట్టెను. ఆతనికొరకై భోజనకాలము ననిరీక్షించుచు, నాతని సమపంక్తినే తానునుగూరుచుండి యిష్టాగోష్ఠిగామాటలాడుకొనుచు, నాతఁడు కొంచె మాలస్యముజేసినచో తానుగాని సుశీలగాని పరుగెత్తి వచ్చుచు నిట్లు ప్రకాశముగారు నడచుచుండగా నివియన్నియు జరుగుటజూచి కమలాకాంతునికి పూర్వపశ్చాత్తాపమంతయు నదృశ్యమయ్యెను. లోలోన నాతఁడు తన మాతులుని మెచ్చుకొనసాగెను. పూర్వ వైరము లన్నియు నాతఁడు మనస్సుననే క్షమించివైచెను. కమలాకాంతుఁడు తన తండ్రితాతలవలె రాబడిని గుర్తెఱుంగక వ్యయముజేయువాఁడుకాదు. ఆతఁడు మితవ్యయమును చక్కఁగానేర్చుకొనెను. కమలయునాతని పరిశీలనలోనన్లే గృహకృత్యములన్నియు నిర్వహించుచుండెను. అందుచే వారికేటేట నైదువందలరూప్యములాదాయము మిగులుచుండెను. అట్లేర్పడిన మొత్తముపది యేండ్లలో వడ్డీలతోగలిసి యేడెనిమిదివేల రూప్యములయ్యెను. దానితో మఱల నాతఁడుపది యకరముల భూమినికొనెను.

శాంత దిన దిన ప్రవర్ధమానయై చక్కఁగా విద్యనేర్చుకొనుచుండెను. పాఠశాలలో సంగీతముగూడ జెప్పుచుండిరి. కమల చదువుకొను దినములలోని యుపాధ్యాయులవలె గాక నిప్పుడు విద్యాధికులే యాపాఠశాలయం దుపాధ్యాయత్వపదవి వహించి శ్రద్ధగా నేర్పఁ దొ

డంగిరి. అందుకే శాంత విద్యోపార్జన యందెట్టి లోటుపాటులును లేవు

శాంతకు వివాహ వయస్సు సమీపించుచుండెను ఆమె తండ్రి యనుకూలవరాన్వేషణమునకై నల్దిక్కులు వెదుకసాగెను. గాని యెక్కడజూచినను వరుడు దొరకుటయే దుర్లభముగ గన్పట్టెను. కమల వివాహ మప్పుడు మాకు మాకని కలవరించిన బంధుకోటి యంతయు నిప్పుడెక్కడ నుండెనో కంచుకాగడలచే వెదుకవలసి వచ్చెను. ఒకరిద్దరు కన్పడినను వారి తల్లిదండ్రులు బాహాటముగా కట్నము లడుగ జొచ్చిరి. ప్రకాశమున కది యిష్టము లేకున్నను యిప్పుడాతని యుద్దేశ్యము ననుసరించువారే లేకుండిరి. తుదకెట్లో నతిప్రయత్నముపై నొక వరనిశ్చయము గావింపఁ బడెను. కమలాకాంతుని జ్ఞాతులలో నొక విద్యార్థికలఁడు. ఆతఁడు పాఠశాలాంతిమ పరీక్షలో జదువు చుఁడెను. దానిలో నొక సంవత్సర మాతఁడు తప్పిపోయెను. ఆతని కారు యకరముల భూమిమాత్రమే గలదు. వాని తల్లిదండ్రు లైదు వందలైన నిచ్చినగాని శాంతను చేసుకొనమని చెప్పిరి. ప్రకాశమున కిఁక నింతకన్న మంచి సంబంధము దొరకనందున నదియే యొప్పుకోన వలసి వచ్చెను. ఎట్లో తనయొక్కయు సుశీలయొక్కయు భారణము పై నావివాహము చేయింపవలసి యుండెను.

ఈవివాహ భారమంతయు కమలాకాంతునిపై బడెను. ఆతఁడు ప్రకాశముగారి భూమిని రెండువత్సరముల మక్తాకిచ్చి దానిపై వెయ్యి రూప్యములు దెచ్చెను. దానితో నాతఁడు శాంత వివాహము మిత వ్యయముగా జరపెను. కాని వట్టి యాడంబరములతోను దుర్వ్యయ ములతోను జరుపక జాగరూకతతో జేసిన యావివాహమువైభవో పేతముగనే యుండెను. ఆవివాహమునకు బ్యాండులు, సానిమేళములు బాణసంచాలు మున్నగు నవి లేవు. వివాహమొక్క దినము మాత్రమే

సామాన్య బజంత్రీల మేళముతో ఆప్తబంధువర్గము మొదట మాత్రమే వివాహము పూర్తిగావింపఁబడెను. బంధువులందరు శాంతకు విస్తారము కానుకలర్పించిరి. వానితో నామె కాభరణములకు సరిపోవునంత ద్రవ్యము లభించెను. సుశీల తన వస్తువులలో గొన్నిఁటి నామెకిచ్చివైచెను. శాంత భర్తపేరు రమాకాంతుఁడు. ఆతఁడు పరిణయమైన మరుసటి వత్సరములో పరీక్షయందు నెగ్గెను. వెంటనే యాతఁ డొక యుద్యోగమున జేరెను. తరువాత కొన్నాళ్ళకు శాంతను దీసికొని వెళ్లెను. శాంతయు పరమశాంత చిత్తయై భర్తతో జక్కగా గాపుర మొనర్పసాగెను.

---

## సప్తమ ప్రకరణము

### భరతుని చర్యలు.

---

భరతుఁడు బెజవాడయందొక నూతనవస్తు నిర్మాణ శాలను స్థాపించెను. అందు బంగరు వెండిసామానులు నిరాఘాతముగా తయారు కాబడుచుండెను. అందెందరో కమసాలులు పని చేయుచుండిరి. వారెల్లరును పనిలో నారితేరిన ప్రావీణ్యులై యుండిరి గాని భరతుని కాపనియందెట్టి యనుభవమును లేకుండెను. వారు చెప్పిడి వాక్యములే యాతనికి వేదవాక్యము లయ్యెను. నిత్యము వారాతనికడ పనికొఱకై దీసుకొను వెండి బంగారంబులలో కొంత మిగిల్చుకొని దాని బదులు టంకముగాని, యితర లోహములుగాని వానిలో కలిపి భర్తీ పఱచు చుండిరి. వారు చేసెడి వస్తువులు మాత్ర మత్యాకర్షణీయముగను సుందరముగ నుండుచు వచ్చెను. సామాన్య ప్రజలు వానిని జూచి భ్రమపడి హెచ్చుగా కొనసాగిరి. అందుచే నారంభ దశలో భరతుని కావ్యాపారము మిక్కిలి లాభకారిగా గన్పడెను. రాగలతిక వలదని

కొందఱు బోధించినను, లాభదాయకముగానున్న నీవ్యాపారము సాగించుటకు తమ[illegible] గట్టిగా నేమియు చెప్పుటలేదు. ఐనను భరతుఁడు నాగలతిక చెప్పినదే ప్రమాణముగా నంగీకరించు దినములు దాటిపోయినవి.

రాజశేఖర మహావ్యాపార సంస్థయందొక యజమానియయ్యెను. ఆతఁడు తన యుద్యోగమునకు నెలకు వందరూప్యములు తీసుకొనుచుండెను. పసివాండ్రకు మూడువందల రూప్యములు ప్రతి నెలకొ నియ్యవలసి యుండెను. భరతుఁ డప్పుడప్పుడు మాత్రమా సంస్థలెక్కల జూచుచు నుండుచుగాని నిత్య మచ్చట నుండుటలేదు. ఆతని మార్గములన్నియు వేరుగా నుండెను.

ఆతఁడు తరుచుగా సభల కేగుటయు, నందు వితంతూద్వాహములపై యుపన్యాసముల నిచ్చుటయు జరుగుచుండెను. చీమ చిటుక్కుమన్న నెక్కడ వితంతు వివాహమైనను, సంఘసంస్కరణ సభ లెక్కడ జరిగినను, భరతుని కాహ్వానము రాకతీరదు. ఇట్లాతఁడు గొప్పవారల ప్రతిసభకు ప్రతివితంతు వివాహమునకు బోవుచు నొక్కఁడ నైతినని తలపోయుచు దనవ్యాపారసంస్థను జాగ్రతగా బోషింపఁ జాలక పోయెను.

నాగలతిక యాతని వివాహమాడినపుడు తాను స్వేచ్ఛగా నుండునని తలంచెను గాని యామె యిప్పుడు భరతుని యాజ్ఞానుసారము [illegible]శివాసము చేయవలసి వచ్చెను. అదియామె కిప్పుడు కష్టమనిపించెను. ఐనను చేయునది లేకపోయెను సభలకు బోవుటకు నాగలతిక కెంతయో సంతోషముగ నుండెడిది గాని యిప్పు డారువ కావకాశమే లేదు.

భరతుఁడు క్లబ్బుల కేగుట నేర్చెను. ప్రతి క్లబ్బులోను నాతఁడు సభ్యుఁడయ్యెను. క్రమముగా నాతఁడు [illegible]

లంగోటిక తిరుగుచు బోవుచుండెను. అప్పటి మిక్కిలి విలువగల సారాయములన్నిటిని గ్రోలుచు వచ్చెను. సామంతులైన వకీళ్ళయొక్కయు నితర పెద్దమనుష్యులయొక్కయు, సహవాస మందుచే భరతునికి సులభముగా లభించెను గాని వారివలన నెంతయో ద్రవ్యనష్టము మాత్రము భరతునికి గలుగుచుండెను. భరతుండు వారిని సంతసింపఁ జేయుటకై మేలైన సారాయము లన్నియు గొని వారికి సమర్పింప సాగెను. మఱియు వారితో గలసి జూదము లాడుట నేర్చుకొనెను. వేడుకకై యాడుచుండిన పేకాటలు, పాచికలన్నియు తుట్టతుద కనివార్యములై దినకృత్యములలో జేరిపోయెను. ఇవి యాడని వొక్క దివసమైన నుండదయ్యెను.

భరతుఁ డంతటిచే భోజనమునకు దక్క నితరవేళల నింటియందు కరవైపోయెను. తరుణవయస్కయగు రాగలతిక కాతని దర్శనమే యరుదుగా లభించుచుండెను. రాత్రికాలము లందాతఁడు పదిగంటల పిమ్మట గాని యిల్లు జేరకుండెను. అంతవరకు నొంటరిగా రాగలతిక [illegible] దెఱచుకొని యుండవలసి వచ్చెను. వచ్చినపిమ్మట గూడ రాగలతిక ముఖము జూచుటలేదు. రాగలతిక యేమిచెప్పినను, చెవిటి శంఖూది నట్లయిపోయెను. భరతుఁడు మాత్రముతని దారినే బోవుచుండెను. పాపము రాగలతిక నిస్సహాయురాలై మెలఁగవలసి వచ్చెను. తల్లిదండ్రులకా దూరమై పోయెను. అత్తమామల కింతకన్న కదిమడుఁగు లెక్కువదూరమే. కావలెనని చేసుకొన్న మగఁడా యిట్లుండెను. నవనవోన్మేషమంజుల వికసితకుసుమ సౌరభప్రాయమగు నాతస్వీయమణి పరిపూర్ణ జవ్వనమంతయు నడవివెన్నెలవలె శుష్కింపవలసి వచ్చెను. నిత్యమామెమనస్సు కలతపడజొచ్చెను. ఐనను రాగలతిక భరతుని విడిచిపోవలెనని యెప్పుడు తలంచలేదు. దీనికి ముఖ్యమైన యింకొక హేతువుగూడ గలదు. దానిని మీరూహింపఁగలరా" చదువరీ

అపారపారావారమంతయు నీభూచక్రమునకన్న విశాలమై నదియు, నున్నతమైనదనియు నీకు తెల్లమేకదా. అట్లయ్యును నదియేల విచ్చలివిడిగా నీధరాతలముపై బ్రవహించుటలేదు ? దానికి హద్దులున్నవి. కట్టుబాటు గలదు. ఆహద్దులు ఆకట్టుబాటులు దాటి యది సాధారణముగా బ్రవహింపరాదు. ఏదేని యొక వైపరీత్యము కోఱకు మాత్రమే యది హద్దుదాటి వచ్చుటకలదు. అట్లేపశుపక్షి మృగాదులన్నియు నీప్రపంచమున వాని వాని హద్దుల గుర్తెరింగియే సంచరించుచున్న వినుమీ. ఆరాగలతిక కామానవులకు గూడ విచ్చలవిడి సంచరింప కుండ నెన్నియో హద్దులు గలవు. అవి నిష్కల్మషమాన వాంతరాత్మలు సులభముగా జెప్పఁగలవు. కాని యంతరాత్మ నానలకి ద్రోచి కామక్రోధాద్యరి షడ్వర్గములు మానవ జీవితమం దెప్పుడు పైకి వచ్చుటకు సమయము నిరీక్షించుచునే యుండును. ఇవి లోకానుభవము తక్కువగను, శరీరబల మెక్కువగను గల్గిన యువక సమాజములలో దఱచు గానవచ్చును.

భరతుఁడట్టి సమాజసభికు డేననివేఱుగ నుడువనక్కరలేదు. ఆతఁడు తనయంతరాత్మ మాటలనాతగా బాటింపక క్రమముగా సహవాసదోషముల వలన రాగలతిలకపై మోహము దగ్గించి మేడివండువలె ప్రకాశించెడి వారనారీమణులచేతులలోని కీలుబొమ్మయైపోయెను. అప్పటినుండియు నాతఁడింటికి దూరమై రాత్రి కాలములో రాగలతికను నిస్సహాయుగా నుండునట్లు జేసెను. ఇఁక నవయౌవనియగు రాగలతిక పాప మొంటరిగా రాత్రింబవళ్లెట్లు కాలము గడపగలదు? ఐనను రాగలతిక ధీరురాలు. గుణవతి. అందుచే నన్నిఁటికి నోర్చియుండెను.

స్వేచ్ఛావిహారుఁడైన భరతుఁనకువచ్చిన రాబడినంతయు వారకాంతలకును, సారాయములకును, చీట్లాటలకునువ్యయపరచుచుండెను. అందుచే నదియెన్నాళ్ళకును చాలకపోయెను. దీనికి తోడాతని పరక

శాలయందు ప్రతినెల నాలుగువందల రూప్యముల జీతము లియ్యవలసి వచ్చెను. దాని నుండివచ్చు రాబడియే కనబడక పోయెను. వర్తక శాలనిర్మాణమునకై తెచ్చినమొత్తము పెరిగి దాదాపిప్పటికి పదివేల య్యెను. అదియంతయు, నేమైపోయెనో తెలియకుండెను. కొంతజీతము లక్రిందను మఱికొంత పనివాండ్రు హరించిన సువర్ణసుష్వర్ణముల క్రిందను మఱికొంత రాజశేఖరముయొక్క స్వేచ్ఛాచంచారముక్రిందను సెలవై పోయెను. ఇది గాక భరతుని డంబాచారములకన్నిటికిని, వేశ్యాలోలత్వ మునకును మఱియొక పదివేయ్యెను. ఈవింశతి సహస్రముతోనిఁక భర తునకప్పుల నిచ్చువారు లేరైరి అప్పుడాతఁడు వెనుకకు దిరిగి చూచెను. రాగలతిక కంటికికడివెడుగానేడ్వని దినమేలేదు. ఆపెకొ క్కొక్కప్పుడు భరతుని వదలివైచి వెళ్ళుదమాయని పించుచుండెను. అయ్యో! ఇది పతివ్రతాత్వమునకు భంగమని మఱలఁబడలపోయు చుం డును. అసలే వితంతువును గదా ఈతఁడు రెండవభర్త గదా ఒకటి రెంటఁజెడిన దానికి నాకిఁక పాతివ్రత్యభయమేలయని మరియొక మారు తెంపరితనమున నాలోచించు చుండెను. ఎక్కడికేగిన నాప్రాదబ్ధ మక్కడనేయుండదా? ఇక్కడ వదలి యెక్కడికేగు దానని మఱల పరి తపించుచుండును. అయ్యో మగవారిని నమ్మరాదు. పురుషులు కుసుమ భృంగన్యాయము ననుసరించువారుగాని పూవుదాలివలె నెయ్యము జ్ఞాపెట్టరు. నేను తెలియక బేలనై తిని గాని యీవాలకమెవ్వరుసహిం తురు ఇప్పటికే పదియుకర్రముల నమ్మివైచినాడు. ఇప్పుడప్పులా యిరు వదవేలఁట. కనుక నిప్పుడొక యిరువదియుకిరములమ్మవలెను. పోనీ సొమ్ముబోయిన దటుంచి, సుఖమైన నాకున్నదాయని యోచించి నచో నది శశవిషాణమువలె కనుచూపు మేరలోలేకున్నది. అయ్యది గగన కుసుమమైనది. ఇఁకనాధుడా వెలయాండ్రకుజిక్కినాపై మాటి మాటికి కలుకవహించుచున్నాడు. నేనువచ్చినక్రొత్తదినములలో జూపెడి

యాయనురాగమంతయు నెచ్చట నటుమాయ మైపోయినదోగదా? ఆగోదావరీ పుణ్యసైకతస్థలంబులనేమి యచ్చటి యారామవిహారంబులనేమి పరిణయానంతర్యాయ్వము సన్మిత్రులాలించి మేలమాడెడివాడు! ఆ లాలన మేలములు అభిగిరేఖువింతలు ఆ వందహాసనుందరవదనారవిందము నేడన్నియు నపురూపమైనవి. ఇట్లునిరాగలతిక తలపోయుచు సంతతచింతాక్రాంతయై దినములు గడుపుకొనుచుండెను.

భరతుని కప్పుపుట్ట నిది కనిపెట్టి యింకనుండిన లాభములేదని దుకాణములోని పనివాండ్రు మెల్ల మెల్లగా జారిపోయిరి. వారందఱు వెడలిపోవువరకు తలకొక వంద రెండువందల బాకీలోనున్నవారే. వారి వద్దనది వసూలుచేసుకొనుటకు భరతుని కేమార్గముకన్పడలేదు. అందుచే వారిచేత వాగ్దత్తపత్రముల వ్రాయించుకొని వదలివేసెను. పనివాండ్రులేనిది రాజశేఖరమొక్కడేమి చేయును? ఆతనిపనిగూడ యంతముజేయువలసి వచ్చెను. రాజశేఖరము మఱల భూవిక్రయమధ్యవర్తిగానేర్పడి యుండవల్లికిబోయి వచ్చుచుండెను. ఇప్పటికి రాజశేఖరము పూర్వమువలె నుండలేదు. వ్యాపారమున నెక్కుడన్నియు గ్రహించెను. ధనమెట్లుగడింపవలయునో యా తెలివిదేటలన్నియునతనికిజిక్కెను. భరతునివ్యాపారసంస్థయందాతఁడు రెండు మూఁడు వేల యాదాయముజేసుకొనెను. నాసతో గొంతభూమిని తానేకొనవలయునని తలంచెను. ఆతని పొలములోనాదాయము గూడ నిప్పుడాతఁడు వ్యయ మొనర్చుటలేదు. స్వయంకృషిపైననే యాతఁడు జీవింపసాగెను. అందుచే నాతని కింటి వద్దభూమిలో మఱియొక రెండువేలు నిలువయేర్పడెను. భరతుఁడు విక్రయింపఁదలచుకొనిన భూభాగములోతాను* సగముతీసుకొనఁదలచి యుండెను. గాని యిదిబహిరంగముగా జేయుట మంచిది గాదని తలపోసెను. అందుచే నాతఁడుండవల్లి యందువేఱొక పెద్దమనుష్యుని గలుపుకొని భూమిబేరమునుసాగించెను.

ఈసంవత్సరములో భూమిధరలు తగ్గిపోయినవనియు నిప్పుడు కొనువారే లేరనియు, చాలభూము లమ్మకమునకు వచ్చినవనియు నందుచే నెవ్వరు గాని యడుగువారే లేరని రాజశేఖరము భరతునితో జెప్పుచు వచ్చెను. ఋణదాత లందఱు భరతుని యింటిచుట్టును మూగి బాకీల నిమ్మని వేధింపసాగిరి. మొదట నప్పిచ్చునప్పు డెట్లు బ్రతిమాలి బంగపడి యిచ్చిరో యదేరీతినే నయభయముల నాతనిఁ దొందరపెట్టజొచ్చిరి. ఆబాధఁబడలేక తుదకాతఁడేధరకైనను భూమిని విక్రయించును. కొనువాఁడుండిన తోడితెమ్మని యాజ్ఞాపించెను. ఇదే సమయమని రాజశేఖరము తానిదివరకే యాలోచించియుంచిన భాగస్థుని బెజవాడకు గొనితెచ్చెను. ఆతఁడు భరతుని సమీపించి యెకరమూరు వందలైనచో గొనెదననియు సంతసు దమ్మిడికెక్కువ యైనను గొనువాఁడుగానని ఘంటాపథముగ బలుకసాగెను. భూమి నమ్మక తప్పని సరియైనపుడు భరతుఁడు మాత్రమేమి చేయఁగలఁడు? తనయిచ్చవచ్చిన దుర్వ్యయములకెంత సెలవు జేసినను, భరతుని కిట్టిబేరసారములాటలలో మంచి తెలివితేటలే గలవు. ఐనను, ఆతనిశక్తిసామర్థ్యము లాషావుకారుక్రిందపనికి రాకపోయెను. ఎట్టకేల కాధరకే భూమినివిక్రయింపక తప్పదయ్యెను. అందుచే తన బాకీలన్నియు దీర్చుటకనీసము ముప్పదియైదు యకరముల నియ్యవలసివచ్చెను. ఇఁక నింతకన్నగర్తవ్యము లేదని రాజశేఖరము బోధించెను. భరతుఁడది నిజమేనని తలంచి యాబేరమున కొప్పుకొనెను. ఈబేరములో రాజశేఖరు మెనిమిదియకరముల భూమినిఁ దీసికొనెను. ఇదియప్పుడు వెల్లడి కాకున్నను, భరతునకు మెల్ల మెల్లఁగా రాజశేఖరముచే సమయోచితముగ జెప్పఁబడెను. భరతుఁడు దానికేమియు సంకోచింపఁడయ్యెను.

భరతుని వ్యవహారమంతయు పైకి పటాటోపముగను, లోపల [illegible] రముగనె యుండెను. మొదటినుండియు నాతఁడట్టి దారినే [illegible]

డెను. పైతఁడు గొప్పసంస్కర్తయు దేశాభిమానిగా నుండెను. పత్రికలన్నియు నీతనితో తుల్యుఁడు లేడని శ్లాఘించుచుండెను. కాని యాతని లోగుట్టు పెరుమాళ్ళకు మాత్రమే యెరుకగా నుండెను. ఆతని దురభ్యాసము లేరికి దెలియరాకుండెను. తెలిసియు నవిప్రచ్ఛన్నములుగనే యుండెను. సాహసించి బయటి కెవ్వరు వానిని చెప్పరు. ఎవరి కేమిపని? ఇవి యన్నియు నెల్లడి కాకుండగ భరతు నన్నిప్రక్కలవారును శ్లాఘించుట కొక్క రహస్య కారణమున్నది. అదే మన భరతుని ద్రవ్యము కొంచెమో గొప్పయో యనుభవింపనివాఁడందులో లేడు. అందువలన భరతుని కీర్తిమాత్రము జగద్విశ్రాంతమై పోయెను. అదిపూతమెఱుంగు వస్తువవలె రాణించుచుండెను కాని యాపై పూత యెన్నాళ్ళుండును? దురభ్యాసములలవాటైన కొలదిని భరతునిరాకపోకలు సభాస్థలుల యందు తగ్గఁ జొచ్చెను. భరతునిరాక ప్రముఖులదృష్టి నెప్పుడాకర్షింపఁబడుచుండెను. అందుచే నిప్పుడురాని కారణముకూడ వారాలోచింపసాగిరి. క్రమముగా వారికిగూడ భరతుని చైదము లన్నియు దెల్లమగుచుండెను. వానిపై నాదరణముగూడ క్రమముగా తగ్గిపోసాగెను.

ఒకనాటిసభలో వితంతుమహిళా సభ లేర్పాటుజేయుట కంగీకరింపబడెను. అచ్చటివారు భరతునిగూడ దానిపై చేవ్రాలుచేయుమనిరి. చేవ్రాలుచేయువారందఱు తమతమ సతీమణులనాసభలో బాల్గొనఁ బంపవలసి యుందురు. కానిభరతుని కిదియిష్టములేకపోయెను. అందుచే నాతఁడందు వ్రాలుంచఁ బోయెను. అప్పటినుండియు భరతుఁడు కార్యశూరుఁడు గాదని తలంపసాగిరి. ఇది జరిగిన పిమ్మట భరతుఁడు బొత్తుగా సభలకేగుట జాలించుకొనెను. ఆతని పేరిప్పు డేపత్రికారాజములోను గానబడుటలేదు. ఆతని పొగడ్తలిప్పుడెచ్చటను వినబడకుండెను.

భూమిని విక్రయించిన పిమ్మట నా దినములతో గాబోలుకొంతకాలము భరతుఁడింటివద్దనే యుండుచువచ్చెను. కాని యాతనిముఖవిలాసము మారిపోయెను. వెనుకటి జీవకళలన్నియు దగ్గిపోయెను. రాగలతికతో నెప్పుడోగాని మధుర సంభాషణ మొనర్చుటయే లేదు. రాగలతికతో తాను పూర్వమున్న స్థితిగతులు జ్ఞప్తికి వచ్చినపుడెల్ల భరతుఁడు తన దుష్కార్యములకు లోలోన నిందించుకొనుచునే యుండెను. గాని యది యొక క్షణమాత్రమే. మఱల నాతఁడే వెలయాలి తలఁపుననోబడి దానికై బోవుచుండును.

ఇంతకు భరతుని వయఃపటిమముగూడ సన్నగిల్లెను. ఆతని దుర్వ్యాపారములలోకెల్ల త్రాగుడే క్రమముగా విస్తారమయ్యెను. శరీరపాటవముదగ్గిన కొలఁది నది హెచ్చుచేయఁగలసివచ్చెను. నెల కెన్నివందల బుడ్లో వ్యయమగుచుండెను. మొదటనది యొక నాగరికతకని యారంభింపఁబడిన యీదురభ్యాస మెంతకువచ్చెను.

రిఫ్రెష్మెంటుగదులలోను వారకాంతామణీ గృహంబులలోను నాగరికతా చిహ్నముగను, తాత్కాలకోపయోగముకొఱకును వాడఁబడుచుండిన ఈపానీయమనివార్యముగుటతోడనే భరతుఁడు దాని నింటికడనే సేవింపసాగెను. ఒకప్పుడు మితిమీఱి యొడలు దెలియక పడి యుండునంతవరకును ద్రాగును. మఱియొకప్పుడు తెలిసియున్నను మనస్సు చాంచల్యస్థితి యందుండుటచే నేదియో యొక నెపమున నది రాగలతికపై విజృంభించును. అప్పుడామెకు దలనిండుగ దెబ్బలు తగులుచుండెను. అవి తప్పించుకొనుటకు మార్గము లేకుండెను.

రాగలతిక కప్పుడప్పు డాతని వదిలివేసి పోవలెనని తలంపుగల్గునుగాని సాహసము హెచ్చుగా లేకుండెను. పాపము రాగలతిక మిక్కిలి యోర్పుకలది దీనికింకొక కారణముకూడ గలదు. భరతుఁడు తిన్నగాత్రాగుడులేకున్నదినములలో రాగలతికపై పూర్వమున్నప్రేమయు

గన్నఁజువఁ జాలకపోయినను క్రోధముమాత్ర ముండదు. ఉచితజ్ఞని వలెనే భరతుఁడు సంచరించుచు రాగలతిక సహాయముతోనే దిన ములు గడుపుచుండును. ఇదియే యామె చిత్తనిగ్రహమునకు మూల కందమయ్యెను. ఇట్లుండెడి దినములు ప్రతినెలలో పదియుండ వచ్చును. ఇవియే రాగలతికకు సంతోషము గూర్చుచుండెను.

---

## అ ష్ట మ ప్ర క ర ణ ము.

(దుర్దశ)

ప్రకాశమునకు మఱల మంచి దినములు గతించెను. శనిమహా దశ యతనికి ప్రవేశించెను. అప్పటినుండియు నాతనికి క్రమముగా నేదియో యొక చెఱుపు గల్గుచువచ్చెను. భరతుఁడు భూమి నమ్మి వేయుట ప్రకాశముగూడ తెలుసుకొనెను. ఆభూమి పరాధీనమగుట కాతఁడెంతయో సంతాపము నొందెను. కాని ప్రయోజనమేమి?

ఇట్లుండఁగనే యాతని యత్తమామలు చనిపోయిరి. ఆబెంగ తో సుశీల క్రమముగా ననారోగ్యవతియై మంచమెక్కెను. కమలయు కమలాకాంతుఁడును, శాంతయు నామెభర్తయు సుశీల కుపచారములు చేయసాగిరి. ఎన్నియో యౌషధము లిప్పించిరి. కాని యారోగమంత కంతకు హెచ్చిపోవుచునే యుండెను.

సుశీల వ్యాధి క్రమముగా సన్నిపాతములోనికి దిగిపోయెను. పిచ్చిచేష్టలు పిచ్చిమాటలు తఱచుగా నామె పల్కుచుండెను అందులోగూడ కమల శాంత కమలాకాంతుఁడుమంచివారు. ప్రకాశము గారు వారితో నుండవలెను. నా కాలము దాటిపోయినది. నేను వెళ్ళు చున్నాను. నాకై యెవ్వరో పిలుచుచున్నారు. అని యాలోసింప

సాగెను. ఈమాటలు విని ప్రకాశమును తత్కుమారి తలును మిక్కిలి దుఃఖింపసాగిరి.

సుప్రసిద్ధాయుర్వేద వైద్య విశారదుఁడగు డాక్టరుడువచ్చి సుశీలను బాగుగా పరీక్షించెను. ఆమెస్థితి మిక్కిలి యననుకూలముగ నుండె నని తోడనే గ్రహించెను. అందుచే నాతఁడు వెంటనే వచ్చిగరళము దీసి వాడెను. దానితో సుశీలకు కావలసినంత వేడిమివచ్చెను.

సుశీల యిప్పుడు బాగుగా మాటలాడఁజొచ్చెను. గుణము తిరిగినదని యచ్చటివారెల్లరు తలంచిరి కాని నిజముగా నది యా మందు గుణమేకాని వేరుకాదు. ప్రకాశమును, కుమారితలును సుశీల మంచముచుట్టును మూగిరి. వారందరు గొల్లున నేడ్వసాగిరి. సుశీల వారి నందరి నివారించుచు నిట్లు పల్కెను.

"మీరందరు నాకొరకేమియు విచారింపకుఁడు. నేనదృష్టవంతు రాలను. నాదినము లెల్లను సుఖముగనే గడచిపోయినవి. నాభర్తనామా టలెప్పుడు పాటించుచునే యుండెను. అందుచే నాకెట్టి లోటుపా టులు లేకుండెను. నాయంత్యసందేశము మీయందరికిని జెప్పుచున్న దానను. నాభర్త స్వయంకృతాపరాధముచే వృద్ధాప్యమున గొన్ని కష్ట ములందినాడు. అవియన్నియు నొక విధముగా తొలఁగిపోయినవి. ఆయనను కడతేర్చెడి భారమంతయు కమలాకాంతలదే. వారిభర్తలే యాయనను వేయికండ్లతో జూచుచు బోషింపవలెను. వృద్ధాప్య మున యాయనకు సంచరింపవలసిన యదృష్టము నాకులేదు. కమలా కాంతలే యుపచారము లొనర్పవలెను." ఇట్లని పల్కుచు సుశీల కమలాకాంతునివంక జూచెను. ఇంక నేమియో ప్రత్యేకముగ జెప్పఁ బోవుచున్నదని గ్రహించి యాతఁడు దగ్గరకు జేరెను. అంతట నామె హీనస్వరమున నిట్లనియెను. "నాయనా! నీవు సుగుణవంతుఁడవు. కలిగిన దినములలో నీవంటి యుత్తముఁడైన జామాతకు నేమియు జెప్ప

టకు నోచనైతిని. పైని కష్టము లన్నియు నీపాలై పోయినవి. అజ్ఞాన వశమున జేసిన యపరాధముల కన్నింటికి నేనును నాభర్తయు ప్రతిఫల మనుభవించితిమి. తండ్రీ! నీవీ విషయములపై నేమాత్రము సంకోచము బెట్టుకొనకుము. కమల సంగతి నీకు జెప్పనక్కఱలేదు. మీదాంపత్యప్రేమను శాశ్వతముగ నుండుగాక! శాంత చిన్నది. ఇంకను లోకానుభవము చాలను సుఖమన నెట్టిదియో యెఱుఁగని కాలమున బుట్టి పెరిగినది. పాపము! దాని కదృష్టదినములు ముందుముందువచ్చును. మీరిద్దరు దానిని కనిపెట్టి యుండుడు. ఇదిగో! నాకాసులపేరు. దీనిని కమలకిమ్ము. ఈవడ్డాణము శాంతకు.” సుశీల యొక్కసారి భర్తవంకజూచెను. అది యామెని సెలవు గైకొన గోరుచున్నటులను సూచించుచుండెను. సుశీల యిఁక మాటలాడఁజాలక పోయెను. మందువేడిచే నింతవరకు బలికెను. ఇఁక శరీరము మంచుల జల్లనై పోయెను.

“అయ్యో సుశీలా! నీవెంత శీలవతివి. నీవంటి యోగ్యురాలెచ్చటను లేదు. నేనేది చెప్పినదానినే యొప్పుకొని సరిపెట్టుకొనుదానవు. నిన్ను విడచి నేనెట్లు జీవింపఁగలాఁడను? ఇంతకు దురదృష్టవంతుఁడను నేనే. కాసిచో నన్నికష్టపరంపరలొక్కొక్కటిగావచ్చి మీదబడుచున్నను, నాజీవితమున కంతము రాదే? నాది వజ్రసన్నిభహృదయము. ఇది భేదింపబడదు. అకటా! నాడే నీవు చెప్పినచొప్పుననున్నచో నిన్నిపాట్లురాకుండునేమో? ఎవ్వరుచెప్పగలరు? కాలకర్మవశమెవ్వరు తప్పింపఁగలరు? నీరోగమున్నంతటికిని మనోవ్యాధియే కారణముగదా. దానిని నిర్మూలింపని పాపాత్ముఁడను నేనే నామూలముననే నీప్రాణావసానసమయము దగ్గఱకు సమీపించెను. అయ్యో! సుశీలా.” ఇట్లని ప్రకాశ మేదియో తెలిసి తెలియని యాలాపములాడుచు నిస్పృహుఁడై పడిపోయెను.

సుశీల దినవారములన్నియు క్రమక్రమముగా జరుపఁబడుచుండెను. ఒకప్రక్క నేడ్చుచున్నను, సుశీలదివసములో బ్రాహ్మణులకిచ్చు ముడుపులుమాత్రము తప్పవయ్యెను. ఛత్రచామరాదులు, వస్త్రాభరణాదులు, గోవులు మున్నగునవన్నియు దానపూర్వకముగా బురోహితాది భూసురోత్తములకు జేరుచుండెను. కొన్నిదానము లీయలేక దశదానములకు తోటకూరకట్టయును సామ్యముగా తృణమో ఫలమో నియ్యబడుచుండెను.

ప్రకాశముగారిపేరు పూర్వమునుంచి విన్నవారగుటచే చాలదూరమునుండియు బ్రాహ్మణులు రాదొడఁగిరి. వారందఱు తమలోతాము దానములకై పోట్లాడసాగిరి. పురోహితుడు జెప్పినదే యచ్చట వేదవాక్యమయ్యెను. ఘనపాఠులు, జటపాఠులు, చయనులు సోమయాజులు మున్నగు బిరుదులుధరించిన బ్రాహ్మణులెల్ల నానాడు దానములకై యాసించియే వచ్చిరి. ఇందు కొందరు దానముల బట్టినచో పాతకమని పాత్రలతో తృప్తినొందువారై యుండిరి. మఱికొందఱు మహిష, తిల దానాదులుమాత్రము బట్టరాదని సౌమ్యముగా ధనధాన్యాదిదానములను గ్రహించుచుండిరి. మఱికొందఱు కాళ్ళుకడిగించుకొన్నచో దానముబట్టినవార మయ్యెదమనియు నట్లుగాకుండ నిచ్ఛామాత్రముగా నిచ్చినచో దీసికొందుమని యావిధమునగొన్నదానములను స్వీకరించిరి. మఱికొందఱి కవియైనను దొరకమిచే, దొరకినదేచాలునని యేదానమైనను తీసుకొనసాగిరి. ఎవ్వరుగాని గ్రహించుటకు సంశయించెడిదానములు పురోహితునివే యగుచుండెను. తక్కినవారికందఱికిని పాత్రలుగాని, యవిలేనివారికి సంభావనలుగాని యొసఁగఁబడెను.

అంతటితో నాకర్మకాండ ముగిసెను. భూతతృప్తికై యన్నదానము జేయబడెను. బంధుజనమంతయు నానాడచ్చటనే భుజించిరి. సుశీల దివసమైనతర్వాత మెచ్చటవారచ్చటి కేగిరి. ప్రకాశముగా రొంటరిగా

నుండవలసివచ్చుటచే కొన్నాళ్ళపాటు కమలయు, కమలాకాంతుఁడు నచ్చటనే వసింపసాగిరి. వారిపిల్లలతో ప్రకాశము కాలక్షేపము జేయుచుండెను.

సుశీలానంతరమాపెకు భర్తచే నొసఁగబడిన భూమి భరతు స్వాధీనము కావలసివచ్చెను. ఆవత్సరాదాయముతో సుశీలకర్మ పూర్తియయ్యెను. అప్పటినుండియు ప్రకాశము రాబడి మిక్కిలి తగ్గెను. వ్యాజ్యకారణము లేకుండఁగనే ప్రకాశమాభూమిని వదలివైచెను. భరతుఁడు దానిని స్వాధీనము జేసుకొనెను.

పాపము భరతునికి సుశీలపై కోపములేదు సుశీల జబ్బుగ నున్నదని తెలిసినప్పు డాతఁడు చూడవలెనని తలంచెనుగాని ప్రకాశమునుజూచి యూసన్నాహమును మానుకొనెను. రాగలతికకుగూడ నత్తగా నొక్కసారియైన జూడవలెనని కోరికయుండెను. గాని భరతుఁడే పో వుడు తానుమాత్ర మెట్లుపోగలదు? ఐనను భరతుని కెట్టికబుద్ధిరాలేదు. వారదివరకే తెగతెంపులు చేసుకొనిరి. కాని వారి యా తయు హాయిగా ననుభవించుచున్నామను తాపమా దంపతులకే ... కొక్కప్పుడు గలుగుచుండెను. ఆపరితాపము బాహ్యవృత్తులచే మఱ నడపఁబడుచుండెను. అంత ... త్మ నిర్మ ... ముగ నున్నపుడెట్టి యున్నతో శ్యములను వెలిబుచ్చఁగలదు? వారుపోయి సుశీలను చూడకున్న వారియంతరాత్మలో నది యొక బాధాకరమయియే పోయెను.

---

నుండవలసివచ్చుటచే కొన్నాళ్ళపాటు కమలయు, కమలాకాంతుడు నచ్చటనే వసింపసాగిరి. వారిపిల్లలతో ప్రకాశము కాలక్షేపము జేయుచుండెను.

సుశీలానంతరమాపెకు భర్తచే నొసంగబడిన భూమి భరతు స్వాధీనము కావలసివచ్చెను. ఆవత్సరాదాయముతో సుశీలకర్మ పూర్తియయ్యెను. అప్పటినుండియు ప్రకాశము రాబడి మిక్కిలి తగ్గెను. వ్యాజ్యకారణము లేకుండగనే ప్రకాశమాభూమిని వదలివైచెను. భరతుడు దానిని స్వాధీనము జేసుకొనెను.

పాపము భరతునికి సుశీలపై కోపములేదు సుశీల జబ్బుగా నున్నదని తెలిసినప్పు డాతడు చూడవలెనని తలంచెనుగాని ప్రకాశము నుజూచి యాసన్నాహమును మానుకొనెను. రాగలతికకుగూడ నత్తగారి నొక్కసారియైన జూడవలెనని కోరికయుండెను. గాని భరతుడే పోనప్పుడు తానుమాత్ర మెట్లుపోగలదు? ఐనను భరతుని కెట్టికబురు రాలేదు. వారదివరకే తెగతెంపులు చేసుకొనిరి. కాని వారి యాత్మయు హాయిగా ననుభవించుచున్నామను తాపమా దంపతులకే యెప్పుడొక్కప్పుడు గలుగుచుండెను. ఆపరితాపము బాహ్యవృత్తులచే మఱుగు నడపబడుచుండెను. అంత ఆత్మ నిర్మలముగ నున్నపుడెట్టి యున్నతోద్దేశ్యములను వెలిబుచ్చగలదు? వాకుపోయి సుశీలను చూడకున్నను వారియంతరాత్మలో నది యొక బాధాకరమయియే పోయెను.

---

ణలే, నీసౌజన్యస్వభావమే, నీయుచితజ్ఞతేయే, నీ యాదర్శములే నీసతీ హితైకచింతనమే, పూవునకుందావివలె నీకును వన్నెదెచ్చినవి. అవియే నిన్ను సుగంధివనిపించుచున్నవి. నీనిడారంబరత్వ సద్గుణపుంజమే నిన్ను మాల్యాభరణ భూషితగా జేసినది.

భళిరే! నీవు మహాపతివ్రతాతిలకమవు. అందువలననే, నిరంతర దుఃఖరసనిమగ్నవైయుండవలసిన నీవధికోత్సాహముతో, నతివిశాల భావముతో, నానందమూర్తివై యున్నావు.

... ... ... ...

నీలీల లద్భుతములు; నీచైదవములు పావనములు, నీయూహ లపారములు, నీయాదర్శము లనేకములు, నీజీవిత విశేషములన్నియు పవిత్రములు.

... ... ...

కొందరుకాంతలా గంగాతరంగిణియందు తానముడి సిద్ధినొందుదురు. కొందరు యమునాసరస్సుల దరిజేరుదురు. మరి కొందఱా సేతుహిమాచల మధ్యస్థ పుణ్యస్థలముల దర్శింతురు. కాని వారందఱు నిన్నొక్కసారి జూచినచో వారిజన్మలు తరింపవా? నీదర్శన మరుంధతీ దర్శనతుల్యము. నీదీవెన లమోఘశుభప్రదములు. నీ యనుకరణీయము లాదర్శప్రాయములు. భూనభోంత రాళముల నీతో బోటిసేయు వారేలేరు. అట్లయ్యును సంతతగోష్ఠి విహారాదులచే నెల్లెడల సంచరించుచునే యున్నావు. ఇదియే నీయపూర్వ ప్రజ్ఞావిశేషము.

నీవెచ్చటనుంటివో యెవ్వరెరుగరు కాని నీవెల్లరికి గోచరించుచునే యున్నావు. నీసచ్చరిత్ర ప్రవాహము నానాకర్ణపుటంబులంబడి ప్రవహించుచునే యున్నది. అది జీవనది దానికిక తెఱపిలేదు. సౌజన్యనిధి నీవొక విధముగ ధన్యవే. నీకన్యచింతనమేలేదు. తులసిపాదనలతోను వ్రత నిష్ఠాదులతోను నిత్యము నీవు సుఖముగా కాలము

గడపుచుందువు. నీభర్త దర్శనమెంతకాలమునకైనను, దానికై నీ వాయాస పడవు. భంగపడవు. పరితపింపవు. పరుషముతో జెప్పవు. ఆతని నేమాత్రము తిరస్కరింపవు. దూషింపవు, నీయట్టి సాధుశీల లేరే ?

కమలాసుశీలలు సుగుణవతులే. కాని వారు నీయంటివారా ? ముమ్మాటికి కాదు. నీకు వారికి బోటియే లేదు.

నీయందు శుద్ధసాత్వీక బ్రహ్మానందమే యున్నది. రజస్తమో గుణము లేమాత్రము నీకంటనేలేదు. అందుచే గుణవతులగు సుశీల కమలలు మానవతులేయైనను నీకును వారికి హస్తిమశకాంతర మున్నది. వారిద్దరి భర్తలౌక విధముగా యోగ్యపురుషులు. అట్టివారితో కాపుర మొనరించుట సాధారణకార్యమేగాని విశేషముగాదు. కాని నీవిషయమట్టిదికాదు. భర్తయా ధూర్తుఁడు. అత్తమామలా యాభర్తకే కర్తవ్యము నంతను వదలపెట్టినవారు. ఇదిఁగాక మాతులుఁ నేక కార్యాసక్తిచే గృహమునే కాచుకొనువాఁడుగాడు. నిర్భరకాంతా రత్నములవలె నీవు సుఖాసక్తినే గోరుదానవుకావు. నిరంతరదాస్య శృంఖలాబద్ధులగు కొందరు హిందూవనితల వలె నస్వతంత్రురాలవు నుగాదు. సంతతస్వేచ్ఛా విహారులగు పాశ్చాత్యా నారీమణు లవలె నీవు విచ్చలవిడి బోవుదానవును గాదు. కాని తరుణీమణీ నీవెవ్వతెవు.

విధ్యుక్తాచరణమే నీ పరమ సౌఖ్యము. బాధ్యతాయుత వర్తనమే నీస్వతంత్రత. నీయందుబుట్టి పెరిగిన శాంతా మణియే నిన్ను స్వైర విహారిణి జేసినది. అంతియే గాని నీవెచ్చట బుట్టితివో యెచ్చట మెట్టితివో నేటివరకు లోకులెవ్వరెరుఁగుదురు.

కొందరు నీవట్టి గోలవనియు, బేలవనియు, గోలకెత్తుదురు. అది యాలోచన సేయక తూలబలికిన పల్కులు ముల్కులవంటి యూపలుకులు వినియు గూడ నీవేమాత్రము నల్కవహింపవు. తరుణీ

నీపలుకులు చిలుకపలుకులు, వల్కలాజినధరులపాలిటి కవిసల్కములు కలి నివెవ్వతెవు?

నీవు వేదాంత శిరోమణివనియు, చిదానందవశీభూతవనియు, కొందరు మహాత్ములు నిన్ను దర్శింతురు. కొందరు రాలేక నంతరాత్మయందే సంప్రార్థన మొనర్తురు. త్రికాలజ్ఞాన వేదియని కొందరు నీకు మ్రొక్కులిడుదురు? తరుణీ నీవెవ్వతెవు?

లోకమున గల్పనలేని కవిత్వములేదు. అట్లే మహాత్మ్యము నందును నీబహిరంగ సౌజన్యవర్తన ప్రభావమే యున్ని మహత్తర ప్రజ్ఞావిశేషములను సమకూర్చినది. అవి నీయందున్నను లేకున్నను పనిలేదు. నిన్నాదర్శశీలగా గ్రహించి యెందరో యువతీ మణులు వారి వారి గుణశీలములు క్రమపరచుకొనుచున్నారు. మఱికొందరు నిశ్చలభక్తి పరవశులగుచున్నారు. దాంపత్య ధర్మ మెఱుఁగుచున్నారు. నీభర్తయెట్టిఁడైనను నీకు పనిలేదు. నీకు గావలసినదా కర్తృత్వమొక్కటియే, ఆకర్తయే యొక యధి దేవతగా నారాధింతువు. మానసము నిశ్చలమైనపుడెట్టి వస్తువులైననేమి? చరాచల వస్తుజాలము లన్నింట నిండి నిబిడీకృతమైనవరి పూర్ణజ్ఞుఁడెందుండఁడు? అట్లే భర్తయాదిదైవత స్వరూపముగా నిశ్చయింపఁబడెను. ఆయాకాంతమెట్టి పదార్థముల తో నిర్మింపఁబడిననేమి? అది భర్తయే నిజపతీ సందర్శన సంస్పర్శన సుఖాపేక్షచేత నాసతీతిలకమాతని సేవించి, పూజించి! ధ్యానించుట యనునది? ఈమె-కట్టితలఁపేలేదు. పతి యధి దైవతము అందుచే నారాధ్యుఁడు. సతీమణి దాని, నారాధించు ప్రకృతి. అధి దైవతము నారాధించువారు నిష్కామబుద్ధితో ధ్యానించుచుందురు. అట్లే యీతన్వీ మణియు నిరపేక్షయై నిత్యసేవన మొనర్చును. ఇది దాస్యముగాదు. స్వేచ్ఛగాదు. సుఖాసక్తిగాదు. మరేది? విష్యుక్తము.

పరుసమంటినంతనే లోహము పసిడిగా మారును. శాంత మనస్కయు సుస్థిర దృఢసంకల్పరాశియు నగు నీస్త్రీ విశేషముచే నద్యేదికాకుండును? భ్రష్టులు శిష్టులయ్యెదరు. వింధ్యులు వంద్యులయ్యెదరు. దుర్మార్గులు సన్మార్గులయ్యెదరు. ఇది నీపతి వ్రతా మహాత్వ విశేషమేగాని యన్యముగాదు. దానికి సాటియేదీ సాధు శీల యగు సావిత్రీసతి తొల్లి నిజమనోహరునకు సత్యవంతుని ప్రాణములను దేగలిగినది. దండధర దర్శనముకకైనను లోంకక నాథుని యండయే తనకుండవలెనని ప్రార్థించి యఖండ దిగ్విజయమును బడసినది. నీవుమాత్ర మట్టిదానవు ? నీచిత్తశుద్ధివలననే ధూర్తుండగు నీభర్త కర్తవ్యమును గుర్తెరుంగుచున్నాడు. క్రమముగా నాతఁడు దుష్టవర్తనమును మాని న్యాయవర్తనమును గమనించుచున్నాఁడు. ఇది యెల్లను నీయదృష్టమేగాని వేరొండుగాదు.

చల్లకువచ్చి ముంత దాచనేల? జగద్విహారయగు నిన్నింకను ముసుగులో నుంచుటేల ? తరుణీ! నీవా రాజ శేఖరుని సతీతిలక మవుగదా! అవును. కమల వివాహమైనంతనే యాతని వర్తనమును జూచి పరులెవ్వరు పిల్లనీయసాహసింపకుండఁగా నిరుపేదలగు నీజననీ జనకు లాతని కంటగట్టిరిగదా. అప్పుడైనను నీవేమియు నడ్డుజెప్పక వారియాజ్ఞనే శిరసావహించితివి ? నీయప్రతిమాన ధైర్యము పితృవాక్య పరిపాలనము మనోహర చరణ సేవాసక్తియు సర్వజనహృదయాకర్షములు. విమలానందముగారి యిల్లు జొచ్చినదాది నీనాథుఁడు నీకు దర్శనమే యొసఁగడు. ఇచ్చిన నది భోజనమజ్జనాదులప్పుడు మాత్రమే ఐనను దాని నోర్చిన నీతాలిమి నిరుపమానము.

కాంతాతిలకమా ! సంతాపకరమగు నీచరిత్ర మాద్యంతము చదువరులకు నివేదించెదను, రాజశేఖరుని సతీమణియగు నీమె నామము శకుంతల. ఈమె యొక పేద కుటుంబమునకు చెందినదైనను

కులగౌరవాదుల విమలానందముగారి వంశముతో సరి సమూనమై యుండెను. ఈపె తలిదండ్రులు మిక్కిలి గౌరవ నీయులై యుండిరి. వారి పట్టుబడు లన్నియు నదృష్టవశమున నీమెకుఁ బంచు ప్రాయూపోలి కగా నుండెను. విమలానందము కుమారుఁ డిచ్చవచ్చినట్లుగా దిరుగుట గనిపెట్టి పెండ్లియైనచో భార్యతో గూడియుండునని మొకట ప్రకా శముగారి కుమార్తెయైన బాగుండు ననుకొనెను. గాని యింతలోనే యాకన్నియ వివాహమైపోవుట తటస్థించెను.

అప్పటినుండియు విమలానందము ధనవంతుని కుమారిత నొక దానిని తెచ్చి చేయువలయునని నిశ్చయించెను గాని తా నొకటి దలఁచి నదైవ మింకొకటి తలఁచెనను సామ్యము సత్యమయ్యెను. రాజశేఖ రుని దుండగములకు వెఱచి యెవ్వరు కన్యనీయ సాహసించ రైరి. ఆదినములలో కనబడినవారితో నెల్ల పోట్లాడుటయు, లేనిపోనితగాదా లు దెచ్చుటయు నాతని పనులై యుండెను. వృధావాగ్వాదములును, కాపురుష లక్షణములును, దుష్టజన సాంగత్యమును, వేశ్యాలోలత్వ మును రాజశేఖరునికి చక్కఁగా పట్టుబడెను. అందుచేతనే యెవ్వరు గాని పిల్లనిత్తుమని ముందుకు రారైరి.

తరువాత క్రమముగా విమలానందము కొన్నిచోట్ల పిల్లకొఱకై ప్రస్తావించి చూచెను. గాని వారందఱు గ్రామములోని పెత్తనదారుఁల లో నొక్కఁడగు నాతని మాటలకు మోమోటపడి పైకేమియు జెప్పఁ బాలకను లోపల నిష్టములేకను నిదమిత్థము నిర్ణయించక నీళ్ళు నముల జొచ్చిరి.

విమలానందమికఁక పేలయూషన మెంతమాత్రము లాభములేదని కొందఱిని నిష్కర్షగా నడిగించెను. వారిప్పుడప్పుడే మాపిల్లలకు పెం డ్లిండ్లు చేయమని జవాబొసంగిరి. అట్లాతని ప్రయత్నములన్నియు వ్యర్థ ములైనంతనే యంతటితో సమాధానకొనలేదు. ఎట్లయినను చ క్కని

చుక్కను పెండ్లిజేసినచో నీయిక్కట్టులన్నియు దొలంగునని నమ్మినవాం డగుటచే శకుంతలతండ్రియగు విశ్వేశంగారివద్దకు రాయభారము బంపెను. వీరిగ్రామము మంగళగిరి. విశ్వేశంగారికిని విమలానందముగారికిని పూర్వమునుండియు సంబంధబాంధవ్యము లుండెను. అందుచే నాతని కావిషయమున నేమియు సంశయము లేకుండెను. విశ్వేశముగారితో వచ్చిన పెండ్లిరాయభారులా శుభవర్తమానము దెలిసినంతనే యాతం డత్యంత సంతోషస్వాంతుండయ్యెను. ఇదివర కాతండు శకుంతలా వివాహమునకై యాలోచించుచుండిన ట్లెమహర్నిశ మనె లోలోన సంకట పడుచుండెను. ఏమన నాతండు మిక్కిలి పేదగా నుండెను. కుటుంబ జీవనోపాధికి చాలినంత భూవసతిమాత్రమే యాతని కుండెను. పెండ్లి కార్యవ్యయ మేమాత్రము భరింపజాలని స్థితిలోనుండెను. ఆతండు నిష్కపటి యగుటచేత వచ్చిన రాయభారులతో బడాయీలు జెప్పక తన స్థితిగతులను నివేదించెను. రాయభారులదివిని పెండ్లికయ్యెడి వ్యయ మంతయు విమలానందముగారే భరింతురుగాని యది మంగళాద్రి నృసింహస్వామి సన్నిధానే జరుగవలెననియు, నట్లాదేవునికి మ్రొక్కుబడి యనియు జెప్పిరి. విశ్వేశంగారును శకుంతల యదృష్టమునకై యత్యానందపరవశుండై భార్యకుజెప్పి తన యంగీకారము నెఱుంగజేసెను. గాని యాయమాయకుండు రాజశేఖరము స్థితిని బాగుగా నాలోచించలేదు.

ఈవివాహము జరుగబోవు నాటివరకు నుండవల్లి గ్రామములో నొక్కరికిని గూడ యీమనుము రాజశేఖరమునకు స్థిరపడిన సంగతి తెలియదయ్యెను. వెళ్ళివచ్చిన రాయభారు లిద్దరును, మఱినలుగు రైదుగురు పెద్దలనుతోడ్కొని విమలానందమువివాహమునకై రాజశేఖరుని దోడ్కొని పోయెను. ప్రకాశముగారుగూడ నిందులో నొక్కండు. ఈ తండు పిల్లనియ్యకపోయినను, రాజశేఖరుని పెండ్లిపెత్తనమంతయు తానే జేసెను.

మంగళగిరి పురాతనమైన పట్టణము. ఇది పుణ్యస్థలములలో నొక్కటి. ఇందు నృసింహస్వామి యాలయము మున్నది. ఈస్వామికి పానకాలరాయుఁడను బిరుదున్నది. భక్తులెవ్వరైనను పానకములజేసి యర్పించినచో నందులో సగముబోయువరకే స్వామి వెషలగ్రిక్కును. మిగిలినదంతయు స్వామివారి భుక్తశేషముగా భక్తులు గ్రహించుచుందురు. అందుచే నిత్యమీస్వామికి త్రెద్ధికులు బెల్లముతోడను ఖండశర్కరతోడను పానకమునుజేసి యర్పింతురు. ఇచ్చట నెన్నిబిందెల పానకమర్పించిన నది యదృశ్యమై కొండలోపలికి బీల్చుకొనును. ఇంకొక్క చిత్రము గూడ గలదు. ఈపానకముబోయుచోట నొక్కచీమయైనను కానరాదు. ఇది స్థలమహాత్మ్యమని పౌరాణికు లెన్నుదురు. నవీనశాస్త్రజ్ఞులిది పూర్వమగ్నిపర్వతమనియు నిప్పుడు చల్లారినదనియు, లోపల గంధకముండునని యు బల్కుదురు. ఈ రెంటిలో మీరేదిగ్రహించినను ప్రమాదము లేదుఁ.

ఈనృసింహస్వామి యాలయము మంగళగిరియను నొకపర్వతముపై నున్నది. దీనికి క్రిందనుండియు ననేకభక్తులచే గట్టింపఁబడిన మెట్లువరుసలు కలవు. వానిపై నిప్పటికిని భక్తులపేళ్లెన్నియో గానవచ్చుచున్నవి దూరస్థలములనుండి వచ్చి పోయిన యాత్రార్థుల నామధేయములు గూడ నిందు గన్పడుచున్నవి. వెంకటాద్రిప్రభుడీ స్వామికి గాలిగోపుర నిర్మాణము జేయించెను. కొండక్రిందనే యొక కోనేరును, స్వామి దేవళములును గలవు. ఈదేవాలయ ప్రాకారముననే గాలిగోపుర మున్నది. దీని నానుకొనియే పట్టణమున్నది. ఇందు దేవునియుత్సవాదులు. కైంకర్యములతి శోభాయమానముగా సంవత్సరముపొడుగునను జరుగుచుండెను.

మ్రొక్కుబడులున్న వారందరుఁ కేశఖండనవివాహాది శుభకార్యములన్నియు నిక్కడనే జరుపుకొందురు. కొండయు నిజముగా నేదియో

మొక యాపత్సమయమున మ్రొక్కినందులకే యిచటికి వత్తురుగాని మఱికొంద ఱట్టివేమియు లేకున్నను, కేవలము భక్తితోఁగాకపోయినను, విమలానందముగారి చిక్కులవంటివే కల్గినపుడీనెపమున బరుగెత్తి వచ్చి యిట్టి కొండప్రదేశములలో కార్యములు జరుపుకొని పోవుటయుకలదు. ఇట్టి యొక్కచోటనేకాదు. తిరుపతి మున్నగు మహాస్థలము లన్నిటిలో గూడ నిట్లు జరుగును. ఐనను వీరి కార్యమంతయు దేవునిపేరుననే జరుగుటచే లోకమున కెట్టి సంశయమును గలుగకుండును. విమలానందముగారు గూడ నట్లే కుమారునికి మ్రొక్కుబడియని చెప్పి తీసుకొని వచ్చెను. నృసింహస్వామిసమక్షమున వివాహమొక ఝామములో ముగిసెను. అప్పటికప్పుడే కంకణవిసర్జనమును, నరుంధతీదర్శనమును గావించిరి. నిజమున కాపట్టపగలును దంపతుల కరుంధతి కనుబడనేలేదు. నాటిరాత్రియే శకుంతల పునస్సంధాన మేర్పరచిరి. అంతయు ననుకూలముగనే జరిగిపోయెను. సహవాసదోషము లేనిచో రాజశేఖర మంతదుష్టుఁడుగాను. నికృష్టుఁడునుగాను. కాని యిష్టమువచ్చినట్లుగా దిరిగెడి దుష్టబుద్ధుల మైత్రితో నీతఁడు భ్రష్టత్వముజెంది శిష్టజనద్వేషియై పోయెను.

శకుంతలా పునస్సంధానమైన కొన్నినాళ్ళవరకును రాజశేఖర మత్తవారింటికడనే యుండెను. ఉన్నదానిలో లోటుపాటులు లేకుండగనే యత్తమామ లల్లుని యాదరించుచునే నాతనికి గావలసినవెల్ల నిచ్చుచుండిరిగాని రాజశేఖరునికి వారిమర్యాద మన్ననలు చాలకపోయెను. ధనవంతునికుమారుఁడగు రాజశేఖరుని తృప్తికై విశ్వేశ్వముగా నెన్నియోపాట్లు బడుచునేయుండెనుగాని యివియింకను రాజశేఖరుని దృష్టిలో సాధారణములే యైపోయెను. అతనికి నగరములలోవలె కాఫీ యుపమాలు తెల్లవారుసరికి గావలసియుండెను. కాని యాగ్రామములో నలవాటులేదు. కత్తెరమార్కు సిగరెట్లు కావలసిన యాతని కాయూరి

రాగాను నీయుఁదొసంగిరి. ఏదైని బజారున దెప్పించుటకు విశ్వేశంగారు ధనవంతుఁడుగాదు. ఇట్లొకవిధముగా రాజవేఖరుని కత్తమామలయందును, తత్కారణమున నిల్లాలియందును నిరాదరణము గలుగఁజొచ్చెను. ఇంతలో నూతనదంపతుల నుండపల్లికి దీసుకొనివచ్చిరి. అందుచే నాతని నిరాదరణమంతగా నత్తమామలకడ వ్యక్తముగా లేదు. మఱియొక కారణముగూడ కలదు. శకుంతల సుందరియైనను వర్ణము శ్యామవర్ణము గలదిగా నుండెను. రాఖశేఖరునిదృష్టికి శ్యామవర్ణము హీనమైనది. అందుచే నామె శరీరకాంతి యాతని దృష్టి నాకర్షించుకొన జాలకపోయెను. ఇదిఁగాక ముగ్ధయగు నాకాంతకు హావ, భావ, విలాసాదులలో నైపుణ్యము తక్కువగ నుండెను. అదివరకే గణికాంగనల కూటమిలో నుండిన రాజశేఖరుఁడవి యన్నియు ననుభవించినవాఁడగుచే శకుంతల నిపుడా హీనతకెంతయు మానసములో రోఁతజెందెను. కాని యేమియు బల్కుటలేదు. క్రమముగా నిదియంతయు శకుంతలపైని విముఖుఁడగు నట్లుగా జేసెను. కాని ధీరస్వాంతయగు శకుంతల దీనినెవ్వరికిని జెప్పనే లేదు. సరిగదా నేమాత్రముగాని చింతించనుకూడ లేదు.

శకుంతల యది యంతయు దనపూర్వ సంచితమని తలపోసెను. ఆమెకు దినదిన మాధ్యాత్మకచింత హెచ్చయ్యెను. దానితో పతిభక్తియు, విస్తారమయ్యెను. ఆతని శుశ్రూషజేయుటయే కైవల్య సాధనోపాయమని గ్రహించెను. ఆతని దర్శనమే దేవతా దర్శనమువలె నెంచుకొనెను. దానికై యెల్లపుడు నిరీక్షించుచు, సంతత భగవద్ధ్యానచింతానిమగ్నయై మెలఁగఁజొచ్చెను. నిత్యమామె తులసిపూజ చేయుచుండును. ఏదియో నొక వ్రత నెపమున పుణ్యాంగనలను బిలిచి పసుపుకుంకుమలు పండ్లు మున్నగునవి పంచిపెట్టు చుండును. ఈమె సుగుణపుంజములకు మెచ్చుకొనివిమలానందము వ్యయమునకైన

నోర్చుకొనెడివాఁడు. ఇక రాజశేఖరుని శానోశవయే పట్టనుగదా.

ఈప్రకారముగా దినములు మాసములు, వత్సరములు గతించిపోయెను. రాజశేఖరుని దుష్కీర్తియు, శకుంతలకు కీర్తియు దిగంత విశ్రాంతములై పోయెను. ఇవియప్పుడప్పుడు వారి కర్ణపుటంబులం గూడబడుచుండెను. అవి విన్నపుడెల్ల వారిద్వరును పశ్చాత్తాప మానసులయ్యెడివారు. కాని కారణములు వేరువేరుగా నుండెను. అవి మీరూహించుకొనిరేని యుందురుగదా.

భరతుఁడు సువర్ణవస్తు నిర్మాణశాల బెట్టినదాది రాజశేఖరునికి ద్రవ్యోపార్జన మెట్లో తెలియజొచ్చెనని ముందే తెల్పి యుంటిమి. సంపాదించినవాఁడెప్పుడును సులభముగా సెలవొనర్పఁజాలడు. అందును దుబారావ్యయముల కసలే యంగీకరింపఁడు, సంపాదన హెచ్చుగా జరుగుచున్నపుడును, లేక నది నిత్యకృత్యములకు సరిపోవునట్లుగా నున్నప్పుడును మాత్రము దానిని ఖర్చుచేయుటకు వెనుదీయరు. ఇది లోకస్వభావము. దీనికి విరుద్ధముగా గూడ గొన్ని ప్రత్యేకవ్యక్తులుండుటయు నైజమే. రాజశేఖరుఁ డింతవరకు విచ్చలవిడిగా భరతుని ద్రవ్యమువాడినవాఁడు. ఇప్పుడాతఁడు తనకు వచ్చెడి వందరూప్యముల జీతములో నేమాత్రమును సెలవు జేయుటలేదు, దానిని భద్రముగా నెప్పటికప్పుడు సేవింగ్సు బ్యాంకులో వేయజొచ్చెను. వస్తువిక్రయములలో కాజేసిన సొమ్ముతో తన నిత్యవ్యయమును భరించుచు వచ్చెను.

కూడినకోలఁదిని కుండలక్కున్నుకను సామ్యముగలదు. రాజశేఖరుఁడు సంపాదనపరుఁడైన కొలఁదిని యాతఁడు చేయు ఖర్చు లన్నియు మట్టమయ్యెను. ఇప్పుడాతఁడు పానీయములకుగాని, వనితా వ్యామోహములకొఱకుగాని ద్రవ్యము వ్యయమొనర్చుట లేదు. అందుచే నీతఁడెప్పుడును సాపుసందే యుండుచు వచ్చెను. ఉండవచ్చుగాక మాఁడవ

కట్టడే చేయుచుండెను. ఆవస్తువుల విక్రయములో నాతఁడొక వీస పాలుహరించుచు వచ్చెను.

క్రమముగా నీతని దృష్టి స్వగృహ యోగమునకై మరలెను. ఇంటికి కావలసిన వస్తు సంబారము లన్నియు నాతఁడు విజయవాడ నుండి పంపసాగెను. వారమున కొక తూరియైన నుండవల్లికి వచ్చి పోవుచుండెను. అప్పుడెల్లను శకుంతల ననురాగముతోనే జూచుచు వచ్చెను. శకుంతల తన పుణ్య వశమున భర్త దారికి వచ్చు చున్నాడని సంతసించెను గాని యుబ్బితబ్బిబ్బులు పడదయ్యెను. ఇంతలో రాజశేఖరము తల్లిదండ్రుల మన్ననలకు పాత్రుఁడయ్యెను. ఆతఁడు సంపాదనలోనికి దిగి మంచి దారికి వచ్చు చుండుటయే దీనికి కారణము. రాజశేఖరము గూడ మునుపటివలె నుండక మాతాపితృభక్తి గల్గి వారికను సన్నలనే మెలఁగుచు వచ్చెను. కొంతకాల మిట్లు గడచెను. ఈదినములలో శకుంతల పూజా పురస్కారములును వ్రతోద్యాపనలును హెచ్చి యెల్లరకు నామె సుగుణపుంజములు వెల్లడియైపోయెను. ఇది పూర్వచరిత్రము.

కాలమొక్కరీతిగా నుండదు. ఓడలు బండ్లు బండ్లోడలు నగును. ఈదినమున లక్షాధికారి రేపట భిక్షాధికారి యగును. నేడు సంపాదన కుశలుఁడుగా నున్న రాజశేఖరమునకు గూడ నట్లే భంగము కల్గెను. భరతుని వాణిజ్యశాల యింతలో నెత్తివేయఁబడెను. అందుచే నాతని యుద్యోగ మంతరించిపోయెను. కాని యాతఁ డిదివరకు సంపాదించిన ద్రవ్యముతోడను, ఇంటివద్ద మిగిలెడి దానితోడను కొంతభూమిని కొనటడెను. ఇక నాతఁడు సంపాదింపక పోయినను, కుటుంబమునకు కావలసినదిలేదు. అందు నీతఁడొక మాదిరి ధనవంతుడే గాని నిరుపేద గాడుగదా. రాజశేఖర మప్పటి నుండియు తనవాసము విజయవాడనుండి యుండవల్లికి మార్చుకొనెను. ఈమార్పు జరిగిన నాటి

నుండియు నాతఁడు గ్రామములో జాగరూకుఁడై సంచరించుచునే వచ్చెను.

వచ్చినవాడు చచ్చినను పోదను లోకసామ్య మున్నది. రాజశేఖరము కొఁడీలలో నొక్కఁడని గ్రామములో నెల్లరి హృదయములలో దలఁపబడుచుండెను. ఇప్పు డాతఁడు మునుపటి వర్తన మంతయు వదలిపెట్టి యింటికివచ్చి న్యాయమార్గమున నున్నను జను లాతని డొంటి రీతినే యనుమానించుచు దగిన మర్యాద మన్నన లీయకుండిరి. దీనికై రాజశేఖరము లోలోన పశ్చాత్తాపము జెందెడి వాఁడు. ఒక్కొక్కప్పుడు బహిరంగముగా బల్కువాఁడు. కాని ప్రయోజనమేమి? లోకులు కాకులనుటకు కారణములేకపోలేదు. ఒక రేదైన బల్కినచో దాని నందఱనెదరుగాని సాధారణముగా నిజానిజముల నారయలేరు. ఏవస్తువెట్టి పరిణామ దశలోనున్నదో గ్రహించెడివారు మిక్కిలి యరుదు. దానిని గుర్తెఱిగి పూర్వమున్న భావమును మార్చవలెనన్నచో గోటితో జేసెడి పని గొడ్డలితో జేయవలసి నట్లుండును. అప్పుడైన నది సంపూర్ణముగా ముగియదు.

పూవు పరిమళించినకొలందిని దాని సువాసన వాయువులలోఁ గలసి లోకమంతయు వ్యాపించును. అట్లే నదీనదంబుల ప్రవాహము గూడ దేశదేశములగల నానా భూములలోనికి బోయి యచ్చట నింకిపోవును. వీనిని తిరిగి బోగుచేసి తెచ్చి పూవునందుగాని, నదీ నదములయందు గాని యుంచుట మానవ సాధ్యమగు కార్యముగాదు. సాధ్యాసాధ్య విచారణ మటుండనిచ్చి యది ప్రకృతి సిద్ధమైనదియును గాదు.

రాజశేఖర మింటికడనుండి వ్యవసాయమును శ్రద్ధతో జేయఁ సాగెను. శకుంతలపై నాతని ప్రేమానురాగము గాఢమై పోవుచుండె వయోవృద్ధులగు నాతని తల్లిదండ్రులు సంసారభారమంతయు నాత

నిష్ఫలమైచిరి. రాజశేఖరునకుగూడ నిష్కళంకమగు భవము సంపాదించినను, యేపని జేయదలచినచ్చినను వారి నడిగియే చేయుచు, వారికి గావల సిన సపర్యలను భక్తితో జేయుచు వారిని ప్రీతులం జేయు చువచ్చెను.

---

## సప్తము ప్రకరణము.

### ప్రారబ్ధము.

మనము రాగలతికా భరతులవిషయము గ్రహించి చాలకాల మైనది. కావున వారేమిచేయుచున్నారో పోయి గమనించుదము. చదు వరీ! నీకింకను సంసారభారముచు లోకానుభవమును గొలంతిగాను న్నచో రాగలతికా భరతుల వృత్తాంతమువల్ల పూర్తి కాగలదు. కావున శ్రద్ధాళుడవై పరికింపుము. భరతుని దుర్జనతలచే విసువెత్తిన రాగలతి కకు విజయవాడయందేమియు సౌఖ్యదాయకముగ నుండదయ్యెను. అందుచే నొకసర్యాయము పూర్వపరిచితమగు రాజమండ్రికి బోయి యచ్చట ప్రాతస్నేహితురాండ్రతో కొంతకాల ముండవలెనని తలం చెను. సమయమునకై నిరీక్షించి యొకనాడామె తనసంగతి భరతునకు నివేదించెను. ఆవేళవిశేషమేమియోగాని యాతడు దానికి వెంటనే సమ్మతించెను. రాగలతిక బయలుదేరి రాజమహేంద్రపురి జేరి యచ్చట శరణాలయమున నొక మిత్రురాలి బసలో ప్రవేశించెను. పూర్వము తన తోపాటు చదువుకొన్న వితంతువు లిర్వురు ముప్పురచ్చట యుపాధ్యా యినులుగా కాలముగడుపుచు బ్రహ్మచర్యవ్రతము సల్పుచుండిరి. వారే రాగలతిక రాకకు సంతసించి బసనొకదాని నేర్పఱచిరి. వారు రాగలతికకు సంతోషము గొల్పునటుల నెన్నియో వేడుకలు, విందులు కల్పించిరిగాని రాగలతిక ముఖము దీనముగా నుండుటవల్ల విచారప

సారిరి. రాగలతిక వారిద్దరి స్థితియు తనదానికన్న మిక్కిలి స్వేచ్ఛగను సౌఖ్యముగ నున్నదని గ్రహించెను. గతజలసేతుబంధనమువలె నిప్పుడు దురపిల్లిన ప్రయోజనమేమియు లేదనియు, ప్రారబ్ధమనుభవింపక నెవ్వారికిగాని తీరదనియు నామె చివరకు తనవిషయమై నిశ్చయపరచుకొనెను. స్నేహితురాండ్రు భరతుని ప్రస్తుతస్థితికెంతయు మిక్కిలి విచారించి, రాగలత నూరడించిరి. భరతుని దారికి దెచ్చుటకై రాగలతికకనేకవిధములగు సలహాలను వారొసగుచుండిరి. ఒకనాడు వారందఱికీ క్రింది రీతిగ సంభాషణము జరిగెను.

రాగలతిక—అక్కయ్యలారా! మీయందఱిమధ్యను నేనిప్పుడు హాయిగానున్నానుగాని నాసంసారస్థితి దలంచినపుడెల్లను మిక్కిలి భయమగుచున్నది. నిజముగా మీరే ధన్యురాండ్రు. మగనాలివై సంచరించుటకన్న వేరొండు బంధనమేమియు లోకమున కష్టముగాదని నాస్వానుభవమున దెల్పుచున్నాను.

శ్యామల—అక్కా! నీవు పొరబడుచున్నావు. ఆడుదివైపుట్టినపుడే, మగనాలిగనుండని విధాత లిఖంచియుండెను. అదియొక బంధముగానెంచుట కూడదు. దానిని మనసౌఖ్యమునకయియే భగవంతుడు నిర్దేశించెను. కఠినచిత్తులగు కొందఱు పూరుషులు మగనాలిని బంధించి తుదకు తమ్ముగట్టుత్రాళ్ళు తామే తెచ్చుకొందురు. చూడుము పుష్పావతి కమలావతి పునర్వివాహితులై చక్కగా కాపురముచేయుచుండుటలేదా అంతియేగాని స్త్రీ మగనాలిగానుండుటకన్న కావలసినదేది? కాని మేమీజన్మమున నట్టిభాగ్యము నోచుకొనలేదు. అంధన్మిమానుల కష్టములు చూచుటేల యని మాకు తోచువిధముగా దేశసేవ జేయుచున్నాము.

రాగ—అక్కా! శ్యామలా! పుష్పావతి కళావతు లదృష్టశాలులే. దానికి నేను కాదనుటలేదు గాని నిజముగా మీరు చేసెనపనియే

శ్లాఘనీయమైనది. స్వల్పభోగమున కాసించి నేనొక పురుషుని చెప్పుచేతలకు లోబడియుండుట, తప్పనియే నాయంతరాత్మ యిప్పుడు తేటతెల్లముగా బోధించుచున్నది. అందును ఋజువర్తనములేని వారితో గలిసి మెలసియుండు బాధ్యత నాకెంతవరకుండును? నేను మీవలెనే స్వేచ్ఛగానుండి దేశసేవ జేయనైతినే యని చింతించుచున్నాను. ఒక్కొక్కప్పుడు నేను నాభర్తనువదలి యిచటికి రావలెననుకొందును.

పద్మావతి—రాగా! నీవనురాగవతివై భర్తతో సర్వసౌఖ్యముల బొందెదవని తలంచితిమిగాని యిట్లగునని తెలియఁజాలమైతిమి. మనము చిన్నతనముననే ప్రారబ్ధవశమున విగతభర్తృకలమైతిమి. దైవోపహతులమగు మనమంతటితో నూరకొనక, దీనిని క్రొత్తగా దెచ్చిపెట్టుకొంటిమి. కావున నిప్పుడు చేయదగినది కానరాదు. నీవు మఱల కొన్నాళ్ళయినను సుఖమనుభవించితివి. ఆసుఖమెట్టిదియో యెఱుగక మేము నిత్యమాందోళన పడుచుందుము. కనుక కష్టసుఖములీ ప్రపంచములో కలిసియే యున్నవిగాని కష్టములువచ్చినప్పుడు మన మోపికపెట్టజాలక యిట్లనుకొందుము. అందుచే కష్టసహనముకై తగినంత యోపిక పెట్టవలెను. నీవన్నట్లు మేము కష్టమునకు దూరులమైతిమిగాని సుఖమునకు గూడ దూరులమే దేవసేవయే మాసౌఖ్యముగా నెంచితిమి. స్త్రీలోకమున పశుప్రాయులుగా నున్నవారికొకింత జ్ఞానప్రసారము మావలన నయ్యెనేని అదియే మాకు గొప్ప శుభమని నిర్ణయించుకొంటిమి. నీవు మాత్రమట్టి శుభమునే కోరుదువేని, నీయింటికడనే నల్గురు బాలికలకు నీకు వచ్చినవిద్య నుపదేశంచి, వారిని జ్ఞానవంతుల జేయరాదా. నీభర్తకై నీవు చింతిల్లకుము. ఆతని నీవారాధింతువుగాని ప్రతిఫలమునకై యాసింపకుము. నిష్కామమైన యారాధనచే నన్నియు సమకూరగలవు సుమీ. ఇది భగవద్గీతావాక్యమని నీకు తెలిసియే యుండును గనుక మఱపు జెందకుము.

శ్యామల—లతికా! శ్యామ జెప్పినది ముచ్చటగనే యున్నది. అవకాశము చిక్కినపుడెల్ల నీవు పదిమందిపిల్లలతో కాలము గడుము. నీచింతనంతయు మఱచిపోవుదువు. నీమనస్సునకు శాంతి చేకూరును. నీకష్టసుఖములను గుఱించి నీవు తఱచుగా వ్రాయుచుండుము. ఇటీవల ఉత్తరములు వ్రాయుటయే మానినావు.

రాగ—నిజమే శ్యామలా! సంతతాందోళనాయత్త చిత్తముతో నేను మిమ్ముల నందఱిని మఱచితిని. దానికి నన్ను మన్నింపుడు. నేనిక మీయుంపఱికెలవును గైకొని స్వగృహమున కేగెదను. ఇంతమాత్ర మనకాశమైనను నాకు నాభర్త యొసంగినందుల కాతని కనేక ధన్య వాదములు.

శ్యామల, పద్మావతి—నిజముగా మేముగూడ నట్లే సమ్మతించుచున్నాము.

వీరిట్లు మాట్లాడుచుండగనే యొక సేవకుఁడు వచ్చి రాగలతిక కొక యుత్తరమిచ్చెను. దాని నామె నాతురతతో జదివి వారల కందిచ్చెను. అందిట్లు వ్రాయఁబడియుండెను.

విజయపురి,
4—7—20

లతికా,

నీవిచ్చటినుండి వెళ్ళినదాది నాకు జ్వరము తగులుచున్నది. అది క్రమముగా హెచ్చుచున్నదిగాని తగ్గకున్నది. నాకు పరిచర్యజేయుటకై యెవ్వరును లేకున్నారు. అత్తమామలు తల్లిదండ్రులు లాప్తులందఱు నిది

వరకేదూరమైసి దా. నీవుకూడ దగ్గఱలేకపోవుటవల్ల నాకు మతి స్థిమితములేదు. కావున వెంటనే బయలుదేరి రావలెను.

ఇట్లు,
"భ ర తు డు."

భరతుని వార్తవిని వారందరి మనస్సులు చిన్నబోయెదు. లకకు గోరుచుట్టుపై రోకటిపోటువలె నయ్యెను. వెంటనే వారందఱివద్దను సెలవు దీసికొని విజయవాడ కాయబలప్రయాణ మయ్యెను. సేవకుఁడును తానును రెండుగంటల బండికి నెక్కి సాయంకాల మూరుగంటలగుసరికి బెజవాడ జేరిరి. ఇంటికి వచ్చుసరికి భరతుఁడు మిక్కిలి బాధపడుచుండెను. ఆతనికి విదాహము పుట్టెను. జ్వరవేగము హెచ్చుగనే యుండెను ఆతఁడిదివరలో స్వేచ్ఛానుసారముగా దిరిగి తెచ్చుకున్న సుఖవ్యాధులే యాజ్వరమునకు కారణమని వైద్యులు నిర్ణయించిరి. భరతుఁడు తనకు జీవితాశలేదని క్రమముగా నదైర్యపడుచుండెను. రాగలతిక మాత్రము లోపల భయపడుచున్నను పైకాతనికి ధైర్యము జెప్పుచుండెను. ఎవరేమి చెప్పిననేమి ! వ్యాధి యంతకంతకు తీవ్రమయ్యెను. భరతుఁడప్పుడు లతికను జూచి యిట్లనెను. 'లతికా! నీవునన్ను పెండ్లాడినందులకు సుఖపడలేదని నేనెరుఁగుదును. మనమిద్దరము ప్రేమించియే వివాహమాడినను ప్రారబ్ధముచే నాప్రేమము కొలఁది కాలములోనే మార్పుజెందినది. అందుచే నిర్వురకును సౌఖ్యము గల్గుగలేదు. ఇందులో నాతప్పిదమే హెచ్చుగా నున్నదని యొప్పుకొనుచున్నాఁడను. బంధుమిత్రులందరిని నేనవిష్టుఁడనై పోయితిని. పెంచుకున్నవానికా విరోధినైతిని. పోనీ యాతని వంశమైనను వృద్ధిగావించితినా? అదియును లేదు. తుద కాతనితో పోవలసిన వంశము నాతోనేగాక, నేను సంపాదించిన యాస్తిమత్తోడను, నాపెంపుడు తండ్రిపదేశి నానాకష్టములకోర్చి

యంతరింపదు. ఇప్పుడనే నాకునక్కట్టి క్షమాపణము జెప్పుకొనియు ప్రయోజనములేదు. కాని యీయన యుప్పు పులుసు దిన్నందుల కాతనిపై విశ్వాసముమాత్రమున్నది. దాని కార్యరూపమున బెట్టఁజాలక పోయితిని మదాంధుఁడనై యొక యెరుంగక చేసిన నాయపరాధము లన్నిఁటికి నేను పరలోకమున నుత్తరవాదినే యైయుండెదను నీకిప్పుడే నేను స్వేచ్ఛనొసఁగుచున్నాఁడను. నీవు నావితంతువుగా నుండనక్కరలేదు. నీయిష్టమున్నచో మరొక వరుని చేఁబట్టి సుఖింపుము. లేదా నీయిచ్చవచ్చిన తెరంగున నుండుము. నాయాస్తి నంతటిని నీకేయిచ్చి పోవుచున్నాఁడను.'

ఈమాట లన్నియు వినువరకు లతికకు భయము విస్తారమయ్యెను. అప్పుడు బిగ్గరగా నేడువసాగెను. భరతుఁడు సైగలతో నామె నోదార్చెను. భరతుని జబ్బుగా నున్నదని తెలిసి రాజశేఖరుఁడు కనపల్లినుండి వచ్చెను. ఆతఁడు వచ్చువరకు భరతుఁడు కొనయూపిరితో నుండెను. డాక్టరు వచ్చి చూచి నిస్పృహుఁడై వెడలి పోయెను. భరతుఁడొక్కసారి రాజశేఖరము నంకను, మరొకసారి రాగలతికవంకను కన్నులు దెఱచి చూచి వారి రోదన ధ్వనుల మధ్య తన కడపటి యూపిరిని వాయువులో గలిపివైచెను.

---

## ఏకాదశ ప్రకరణము

(గాతులు వర్ణనము)

---

భరతుఁడు చనిపోయినపిమ్మట రాగలతిక రాజశేఖరుని సాయమున నాతని యపరకర్మ లన్నిఁటిని ముగించివైచెను. ప్రకాశము గారు మున్నగు పూర్వాచార పరాయణు లాసమయమునను రాలేదు.

కాని రామలక్ష్మణులు మాత్ర మెట్లో తెగువజేసుకొని వచ్చిరి. అప్పటికి దేశములో వితంతు వివాహములు విచ్చలవిడిగా జరగిపోయెను. బహిష్కారణము చాలా సన్నగిల్లెను. అందుచే రామలక్ష్మణు లిప్పుడు పూర్వాచార సాంప్రదాయకులకు భయపడలేదు.

ప్రకాశం మున్నగు వారు గూడ భరతుని మరణమునకై పశ్చాత్తాపము జెందకపోలేదు గాని వితంతూద్వాహుల యింటికి వచ్చుటకై వారు పూర్వసాంఘిక కట్టుబాటులకు లోనై పోయిరి. అందుచే సంఘసంస్కారులగు కొందరు బందుగులు తప్ప తక్కినవారెవ్వరును భరతుని దివసమునకై రాలేదు. నవీన నాగరకతానుసారముగ కొందరు రాగలతికకు సాను భూతిలేఖల నంపిరి. వారందరును భరతుని స్నేహితకోటిలోనివారు. ఇంక వైదిక బ్రాహ్మణులకు మాత్రము కొరంతలేదు. వారు విరివిగావచ్చి యచ్చట నిచ్చిన దానధర్మములన్నియు గైకొనియే పోయిరి. సుశీలా దివసమున నెట్లో నీమారు నట్లే వారివిషయమై జరిగెనని చెప్పవచ్చును.

ప్రకాశముగారికి భరతునిపై నెట్టి పూర్వ క్రోధమున్నను ఆతని మరణవార్త నాలించినంతనే యాతఁడు దాని నంతను లోలోపల మ్రింగివైచెను. అప్పటినుండియు నాతఁడు మిక్కిలిగా విచారింప సాగెను. ఒక్కొక్కప్పు డాతని విచారము మితిమీరి పోవుచుండెను. భరతుఁడు దుర్మార్గుఁడైనను కాకున్నను, నల్గురు కుమారుల్ని గలిగి యాతని వంశమైనను నిలిచినచో బాగుండునేయని తలంచుచు కొంతంతయా సతోనుండిన ప్రకాశమునకీ మరణము మిక్కిలి బాధాకారమయ్యెను. అందుచే నాతఁడు విఫలమనస్కుఁడై ‘ అయ్యో ! పురుషప్రయత్నమే ప్రధానమని నేను వ్యామోహమునకు లోనై యిన్నాళ్లు తలంచితిని. దైవ మనుకూలింపని ప్రయత్న మేమియు మానవులకు సాధ్యముగాదుసుమీ. నావంశాభి

వృద్ధిగా నుండుటకు దైవమున కిచ్ఛలేదుగాబోలు. నిష్కారణముగ దైవమున కిచ్ఛయేల లేకుండును ? దానికి నాజన్మాంతర ప్రారబ్ధమేదియైన కారణమై యుండును. నేనేజన్మమున యెవ్వనివంశ క్షీణము గావించితినో అది నాకిపుడు సంభవించియుండును. అట్లే యైనచో నేను దాని నిపుడు కోరుటయు తప్పేగదా. నావొక లెక్కయా? శ్రీరామాది మహా రాజులవంశములు సైతము తారుమారై కొంత కాలము పిమ్మట నశించిపోలేదా? చంద్రవంశముగూడ నష్టమైనది ఇఁకనాయట్టి యల్పుని విషయము శాశ్వతముగ నుండునా ? దానికై ప్రయత్నించుటయు గగనకుసుమము వంటిదే. భగవంతుఁ డిచ్చినదాని తో నేను తృప్తినొందఁజాలక పోయితిని. గుణశీలురగు కొమార్తెల నల్లుండ్రను నాకా పరమేశ్వరుఁడు ప్రసాదింపలేదా? నేను వారిపై నిర్హేతుకముగ ననాదరణము సల్పుట నాలోపమేగదా. పోనీ వారి నాదరింపకున్నను నాద్రవ్యముతో నాయిచ్చవచ్చినట్టుల ధర్మకార్యము లనైన జేసి పేరు సంపాదించలేకపోయితిని. మీదు మిక్కిలి యప్ర తిష్ఠను లోనైతిని. భగవంతుఁడు ద్రవ్యము ధనవంతుల కిచ్చినది సుఖముగా తమకు గావలసినంత యనుభవించి, మిగిలినదైనను ఆప న్నులగు నిరుపేదలకిచ్చి వారిని పోషించుటకే గాని వేరుగాదు. భరతా ! నీవలన నాకెన్నియిక్కట్టులు వచ్చినవిరా! కన్నకూతుం డ్రకైన నింత సమృద్ధిగా నిచ్చుకొనకపోతిని. పోనీ నీవైన సుఖపడి తివా! నదియు సున్న. నేనా బ్రదికినన్నాళ్ళు చింతించుచు లోకమునను సుఖమునకు దూరుఁడనై కూపస్థమండూకమైతిని. ' యిట్లని చింతింప సాగెను.

భరతుఁడుచేసిన అప్పులకు భూముల గొన్నింటిని నమ్మవై వఁగా దినవారక్రియలకు చేసిన యప్పులకు మరికొంత భూమిని విక్ర యింపవలసి వచ్చెను. కావలసిన బంధువులు రాకపోయినను వితంతూ

వ్యాహము చేసుకున్న స్నేహితులందరు భరతుని కర్మలందు హాజరైరి. వారందరిని సముచితరీతిని సత్కరించి పంపుటకును, కర్మ కొరకుగాను తెచ్చిన రాగిచెంబులు, అంగవస్త్రముల క్రిందను సంభావనలక్రిందను విశేష ద్రవ్యము సెలవయ్యెను. అట్లు సెలవుజేసినగాని భరతునిపై భక్తియున్నట్లుగ లోకము భావింపదని తలపవలసి వచ్చెను. ఇది సాంప్రదాయిక వ్యామోహమని వేరుగ జెప్పనక్కరలేదు. అందుచే నావ్యయమ్మున కమ్మిన భూమిపోగా నింక రాగలతికకు నాల్గు యకరములుమాత్రమే మిగిలెను. దానితో నామె తన కాలమును గడపుకొనసాగెను.

ఇప్పు డామెకు కావలసినంత విశ్రాంతి చేకూరెను. "నా" యను వారులేకపోయినను లతిక పూర్వము శ్యామలా పద్మావతులు చెప్పినట్లుగా పదిమంది బాలికలను, జేరదీసి వారి కుచితముగా విద్య నేర్పుచుండెను. లతికకు కుట్టుపనియందును పేముపనియందును, అసమానమైన ప్రజ్ఞకలదు, కాని యిదివరకు దానిని చూపుట కెంతమాత్రము తీరిక యుండెడిదేకాదు. ఇప్పుడామె కుట్టుపనిలో నానారంగుల పూలుతో ననేకచిత్రములు తయారు గావించుచు పేముతో చిన్న చిన్న కుర్చీల నల్లుచు, నాబాలికలకు తీరికవేళలయందు నేర్పుచు వచ్చెను. కొలంది కాలములోనే వారిని గూడ తనవలె ప్రజ్ఞావతులుగా నొనర్చెను. మక్తాను వసూలుచేసుకొనుట మున్నగు కార్యములుండుటచేతను విజయవాడయందిట్టి అద్దెలు, మునిసిపలు పన్నులు మున్నగునవి భారమై సామాన్యజనుల కందుబాటులో లేనందునను లతిక తానిక మెల్లగా నుండవల్లి జేరుటయే మంచిదని తలపోయసాగెను. ఏలన పన్నులభారమునుగూర్చి చెప్పుకొన్నను వినువారే లేకుండిరి. క్రమముగా తన యుద్యోగమునకు స్వస్తి జెప్పి తాను విద్యనేర్పిన బాలికలను వదలి యుండవల్లిజేరెను. అచటికి జేరినపిమ్మటగూడ లతికకు నేరు

విధమైనసపని లేనంతమైన కుట్టుపనులు పేముపనులు జేయుచు కొన్నిటి-
నమ్ముచు మరికొన్నిటి పొరుగువారి కిచ్చుచు నా గ్రామములో కొంత కలుపుబడిని స్నేహము సంపాదించెను.

ప్రకాశముగారి సంగతులు తెలియుచునే యుండెను. భర్త తనని చెరచుటకు లతికయే కారణమని మొదట నామెపై యాతడు కినుకవహించియే యుండెను గాని లతిక వచ్చినదాది నామె సంగతులు చూచి వెళ్ళినవారు చెప్పుటవిని లతిక మంచిసుస్వభావయని తెలుసుకొనెను. అంతటనుండి లతికపై కోపముమాత్రము వదలివైచెను. కాని ప్రకాశమునకు లతిక ప్రస్తావము వచ్చినప్పుడెల్లను గతమంతయు జ్ఞప్తికివచ్చి లోలోన పశ్చాత్తాపపడువాడు. ఈవిషయము గ్రహించి ప్రక్కవారా ప్రస్తావమును కట్టిపెట్టుచుండువారు.

ఇట్లుండగా నొకనాడు లతిక యొక చిన్నిపేము పళ్ళెరమును దానినిండుగ గొన్ని ఫలపుష్పములును కుట్టుపనితో జేసిన యొక చిత్రమును ప్రకాశముగారికి కానుకగా పంపెను. తలవనితలంపుగా వచ్చిన యీకానుక త్రిప్పివేయవలయునా, స్వీకరింపవలయునా యని ప్రకాశమాలోచింప దొడగెను. ఇంతలో కమలా శాంతల కుమాళ్ళిద్దరాక్కపెట్టున వచ్చి యాపండ్లను లాగుకొనిపోయిరి. ఇక ప్రకాశమేమి చేయును? తక్కినవన్నిటినిగూడ స్వీకరించి వచ్చినసేవకుని బంపివైచెను.

వోట్లకొరకు ప్రచారముచేయు దినములలోనిమాటలు కొన్ని-
ర్లప్పుడే మఱచిపోవుచుండిరి. ఛైర్మనువంటివాడీ సామాన్యులకు దర్శనమీయగలడా. వారెప్పుడు మంత్రులతోను, కలెక్టర్లతోను కాలక్షేపములు చేయుచుండును. అందుచే నామె ఇంతవరకును లతికను ప్రకాశముగారు చూడనేలేదు. లతికమాత్ర మప్పుడప్పుడు చాటుననుండి వీధులలోబోవునపుడు ప్రకాశముగారిని గుర్తించుచుండును. లతికకు క్రమముగా మామగారి ముఖావలోకనము [illegible] గల్గుచున్నకొలది

ద్దియు నాతనితోజేరి సంభాషింపవలెనను కోర్కెగల్గుచుండెను. దానికై సమయము నిరీక్షించుచుండెను.

మఱియొకమారు లతిక ప్రకాశముగారికేవియో వస్తువులు బహుమానముగాబంపెను. అప్పుడు ప్రకాశముగారు బలవంతము దీసికొని ఇకమీదట నేమాత్రము తనకొరకై పంపవలదని చెప్పి పంపెను. ఒకనాడు ప్రకాశముగారికి జబ్బుచేసి జ్వరముదగిలెను. అది రెండుమూడు దినములవరకు నుండెను. ఇదేసమయమని లతిక యొక చెలికత్తెను దోడ్కొని యాయనను చూడబోయెను. కమలా శాంతలిదివరకే లతికనుజూచి పల్కరించియుండిరి. అందుచే వారామెను వచ్చినదే తడవుగ పల్కరించిరి. ప్రకాశముగారు మంచములో బరుండి యాయాసపడుచు వారి మాటలసందడిని విని 'కమలా! ఆవచ్చినదెవరు?' అని ప్రశ్నించెను. కమల లతికను జూచుచు "రాగలతిక! మిమ్ములను చూడవచ్చినది. మీరు జబ్బుగానున్నారని యెవరో చెప్పినారట. పాపము దులకని యాసీధినుండి యిక్కడికి వచ్చినది" అనెను.

రాగలతిక తనను జూడవచ్చినదని విన్నంతనే ప్రకాశమునకొకవిధమగు ననురాగముగల్గెను. 'దగ్గఱకు రమ్మనుము' అని మఱల ప్రకాశము కమలతో బల్కెను. కమల యంతట రాగలతికను, చెలికత్తెను మంచముకడకు గొనివచ్చెను. లతిక యవనతవదనయై నిలుచుండి 'జ్వరము తగ్గినదా?' యని ప్రకాశముగారిని ప్రశ్నించెను.

ప్రకాశముగారు లతికనుజూచి యామె సౌకుమార్యమున కాశ్చర్యపరవశుడై యామె ప్రశ్నించినదానికి సమాధానముగ "జ్వరము నన్నేమిచేయును? ఇక నేమిజేసినను నాకు లెక్కలేదు. కావలసినవంతయు నిదివరకే యైనదికదా. ఇక యీపాడుజీవముండి యెవరిని యుద్ధరించగలదు? ఈవేళ కొంచెము తగ్గినది. రేపటికదియేపోవును. కాని నాకుమాత్రము మృత్యువు వచ్చునట్టులలేదు" అనెను.

లతిక దానిసందుకొని అట్లనెను. మీకు చెప్పునంతటిదానను గాను కాని మామగారూ! మీకేకొదువయులేదు. మీకాలమెట్లయినను బాగుగనే వెళ్ళిపోవును. మంచి పేరుప్రతిష్టలు మీకు లోకములో కల్గి నవికదా! ఇక కలిమిలేములు కావటికుండలువంటివి. కావున మీరు చింతించరాదు. ఈగ్రామములో మీకన్న పెద్దపేరుగలవా రెవ్వ రున్నారు చెప్పుడు? ఇది ముఖస్తుతిగా ననుచున్నమాటగాదు" అని పల్కెను.

ప్రకాశము మాటలకు మిక్కిలి హర్షించెను. గాని పైకిమాత్రము "ఏమిప్రతిష్టలులే! ఇప్పుడు కలిమిలేముల కేడ్చుటలేదమ్మా! నావల్ల నీపిల్లలకు కష్టము కలుగుచున్నదిగదా? అందులకని యనుచున్నాను" అనెను.

"పెంచినపిల్లలు తల్లిదండ్రులకు జేయనిచో మరెవ్వరికిజేతురు?" అని లతిక ప్రశ్నపూర్వకమైన సమాధాన మొసంగెను.

ఇట్లు కొంతసేపు సంభాషణ జరిగినపిమ్మట రాగలతిక ప్రకాశముగారివద్ద శెలవుతీసుకొని వెడలిపోయెను. ప్రకాశముగారి జ్వరము నెమ్మదించెను. సంభాషణనుబట్టి లతిక తెలివితేటలుగల పిల్లయేయనియు వితంతువును, అన్యకులసంజాతయు గానిచో తనకోడలనుకొనుట కేమియు సంకోచము లేదనియు ప్రకాశముగారి మనస్సున స్ఫురింపక పోలేదు.

రాగలతిక గాత్రము మనోహరమైనది. ఆమె యప్పుడప్పుడు వీణపైని పాడుచుండెను. ఆపాటను వినుటకా వీధివారందరు జేరుచుండిరి. ఒకనాడు ప్రకాశము వీధిలోనికి బోవుచుండగా నాపాట వీనుల విందుగా వినబడెను. ఆపాడెడిది తనకోడలేయని విన్నపుడాతడు శోకవిధముగు ఘోసమునకు లోనయ్యెను.

రాగలతిక క్రమముగా తీరికవేళలయందు ప్రకాశముగారి యింటి కేగి కమలతో ప్రొద్దుపుచ్చుచుండెను. దానికి ప్రకాశముద్దుపలుకుచలేదు. 'ఆత్మాభిమానము సాగిపోయిన బాలికనుండెడిదే' యని ప్రకాశ మప్పు డప్పు డూహించువాడు. లతిక "అయ్యో! నేనెంత పొరబడు చున్నాను. ఎంతనోచితినో యంతఫలమే గల్గును గాని సొంతకోరుదునో అంతవచ్చునా? నాపేరు నాతోనేపోవుటకు దైవనిర్ణయమై యున్నది. అంతకు నేనితరము గోరరాదు" అని తలచుచుండెను.

లతికకొకప్రక్క శకుంతలయు, మరియొకప్రక్క కమలా శాంతలు నెచ్చెలులైరి. శకుంతలనుజూచి లతికయు పూజాపునస్కారము లారంభించెను. ఆమెనుజూచి కమలయు, కమలనుజూచి పొరుగూరున నున్నను వచ్చినపుడెల్లను చూచుచుండిన శాంతయు తులసిపూజాను ష్ఠానము గావించుచు బ్రాహ్మణులకు తోచిన దానధర్మములిచ్చుచు, తీరిక కాలములో సద్గ్రంథములనుజదువుచు నుండిరి. లతిక శరణాలయములో నున్నపుడనేక నవలారాజములను చదువుచుండెను గాని యిప్పుడవి ముట్టుటలేదు. ఏరామాయణమో, భాగవతభాగములో, యేభగవద్గీతాసారములో, మరేవేదాంతగ్రంథములో శ్రద్ధతోపఠించి, వానినే మననము జేయుచుండును. శకుంతలాసహవాసముచే నాయువతీమణులకందరికిని సత్కార్యరచనాకౌసల్యమేర్పడి దానితో గ్రామమునగల నారీలోకమునకే పేరువచ్చెను. వారిని జూచి మునుపు జదువకున్నను గ్రామములో బాలికలందరు చదువ నారంభించిరి. కుట్టు పేముమున్నగు పనులందరును నేర్వసాగిరి. ఇట్లచ్చట బాలికలలో నొక నూతన తేజ ముదయించి ప్రసరింపనారంభించెను. సుగుణశీలురగు శకుంతలా లతిక లిద్దరిచే గ్రామమంతయు నెట్లు బాగుపడుచున్నదో చూచితిరా? ఇదికూడ దైవనిర్ణయమే.

# ద్వాదశ ప్రకరణము.

(నూత్నభావోదయము.)

---

ప్రకాశముగారి కండ్లయెదుటనే లోకములో ననేక మార్పులు గల్గెను. ఆయన చిన్నతనములో బాలికలకు చదువు జెప్పించుట లేదు. బాలురుకూడ నుత్తమ విద్యోపార్జన జేయుటలేదు. వితంతూద్వాహము లులేవు. బాల్యవివాహములు మెండు. కులాచారప్రవర్తనమే పరమావధి. ఎంతటిధీశాలియు, బాలకులుగనైనచో, వారిడాయంధకారమున బడి క్రుంగవలసినదేగాని పైకివచ్చుట కవకాశములేదు. ఆతని తెలివితేటలుప్రకాశించుటకు వేరొకలోకము సృజింపబడవలసి యుండెను. ధనవంతులు ఋణమిచ్చువారిపై చేయు సవారీలు హెచ్చుగానుండెను. వారు గిరిగీచి యందులో ఋణమిచ్చుపర్యంతము నిలిచియుండుమన్న నుండితీరవలసినదే. పాపమా ఋణగ్రస్తులట్టిభయముతోనే సంచరించుచు తీర్చగలఋణమునే దీసుకొనుచు సంసారము జాగ్రతగా బోషించుకొనుచు వచ్చిరి. ఋణదాతలకిచ్చు చెల్లులకు బాకీతీరుమానము వరకును ఋణగ్రస్తులకు కొన్నిచోటులలో చెల్లువడ్డీలేదు. ఋణగ్రస్తుడు బాకీని తీర్చలేనపుడు దాతకోరినధరకే తనయాస్తిని విక్రయింపవలెను గాని గత్యంతరము లేదు. అయితే దాతలు సాధారణముగా ఋణస్తుల నొత్తిడి పరుపకుండిరి. ఇదిగాక యాకాలములో న్యాయమునకును, ధర్మమునకును, ప్రజలు విశేషము కట్టుబడిరి. కొంతకాలమువరకప్పుడు తాటాకులమీద పద్దులు వ్రాసినచో చలామణి యయ్యెడివి. దాని మీదసాక్షులు హరిహరాదులు. అట్లున్నయెడపద్దులు చెల్లిపోయెడివి. ఆ విశ్వాసమువేరు. ఆ దినములు గనుకనే భరతుడుగూడ బాకీల నన్నిటిని చెల్లించివైచెను. ఆభయభక్తులువేరు. ఇక ప్రకాశము చూచుచుండగనే బాలిక లుత్తమవిద్య నార్జింప మొదలిడిరి, వారికి సంసారకార్య

ములందన్నిఁటియందును స్వాతంత్ర్యము హెచ్చెను. వారిసమ్మతిపైననే
వరనిశ్చయము గావింపఁబడుచుండెను. వితంతూద్వాహములు విచ్చల
విడిగా చెలరేగెను. వారినిప్పుడు బహిష్కరించువారే కానరాకు
న్నారు. ఒకవేళ నది విద్యయందువేళలనేమోగాని, భోజన ప్రతిభోజన
ములతో పరిపాటియైపోయెను. బాల్యవివాహములు చాలవరకుతగ్గి
వధూవరు లన్యోన్యమైత్రి నాధారముగా జేసుకొనియే కరగ్రహణము
గావించుచుండిరి. కులాచారములన్నియు క్రమముగా మాయమగుచుం
డెను. ధీశాలియగు వాఁడేకులజుఁడైననువారి కగ్రస్థానము లభించుచుం
డెను. ముఖ్యముగ నిమ్నజాతులకే రాజకీయోద్యోగములు ప్రసాదింపఁ
బడుచుండెను. అందుచే నాయుద్యోగధర్మమును బట్టిగూడ ప్రజ లట్టి
వారిని కొలువవలసివచ్చెను. దానికై పశ్చాత్తాపపడువారుకూడలేరు.
ఇఁక ధనదాతల దర్జాలన్నియు బోయెను వారిపై ఋణగ్రస్తులుచూపు
భయభక్తులుగూడ నశించెను. వానితోబాటు తెచ్చుకున్నఋణము
తీర్చవలెనను పట్టుదల చాలవరకు నశించెను. ఋణగ్రస్తుఁడు బాకీపెట్టి
చ్చుకొనగానే కొంత యాస్తిని పరాధీనముచేయుట, బాకీనెగవేయుటకై
యాలోచించుట మున్నగువిషయములు బయలుదేరెను. కర్మకాండలను
నమ్మువారే లేకపోయిరి. ఒకవేళ చేయువారున్నను డాంబికమునకు
మాత్రమేగాని భక్తితో జేయకుండిరి. ఈతారుమారులన్నియు గాంచి
కొలదిని ప్రకాశము తన పూర్వపుటభిప్రాయములన్నిఁటిని మార్చుకొన
వలసివచ్చెను. కాలప్రవాహవేగమున కెవ్వరేమిచేయగలరు? అందు
లన దేశకాలపాత్రములను ప్రతివారును ప్రతికార్యమందును చక్కఁగ
గుర్తెఱిఁగి యుండవలెను.

ప్రకాశ మిట్టిలోకముతో తాను విశేషసంబంధము గల్గించుకొన
నవో నయ్యది తనకు బాగుండనేరదని గ్రహించెను. అందుచేఁ నాతఁ
డిఁక నైహిక చింతను గట్టిపెట్టి నిశ్చలమైన వైరాగ్యము నవలంబిం

పరమునకై తలపోయసాగెను. ప్రతినిత్యమాతఁడుదయముననే లేచి బాహ్యకర్మల ముగించి, స్నానమొనర్చి నిమీలితనేత్రుఁడై భగవద్ధ్యాన మొనర్చుచుండును. చాలసేపటివరకట్లు ధ్యానించుచు కమలవచ్చి భోజనమునకు పిలుచువరకు నదేరీతిగ నుండుచువచ్చెను. ఆతఁడిప్పుడు కేవల సాత్త్వికాహారముననే మితముగా భుజించుచు వచ్చెను. భోజనమైనంతనే మఱల నాతఁడేదియో గ్రంథములదీసికొని యందుగల భగవత్స్తోత్రములే పఠించుచుండును. కమలపిల్లలు మున్నగువారిప్పుడు దరిజేరుటకే వెరచుచుండిరి. క్రమముగా నాయనమనస్సులో నూత్నభావోదయ ముదయించెను. ప్రకాశము వానప్రస్థోపన్యాసాశ్రమములు రెంటి నొకేకాలములో నడుపుచున్నట్లుగా నెల్లరికి గోచరించుచుండెను. ఒక నాఁడు రాగలతిక మాతులుని జూడవలెనని వచ్చి యాతని చర్యల న్నియు జూచి విస్మయపడెను. ఇప్పుడాతఁడొరులతో ముచ్చటించుటయే లేదు. అయినను ధైర్యముజేసుకొని యాతఁడు భోజనము ముగించి చదువు నారంభించులోపల మెల్లఁగా దగ్గఱకుజేరి పల్కరించుటకై "మామగారు బొత్తుగా పిల్లలనైన పల్కరించుటలేదు." అని పల్కెను.

ఆమాటలువిని ప్రకాశము కండ్లెత్తిచూచి "లతికా! నీవా! రమ్మ. అమ్మా! యిక నాకు పిల్లలుజల్లలు కావలెనా? నాకు కావలసిన తరుణోపాయమేదియో దానికొఱకై వెదకుచున్నాను." అనెను.

అంతట లతిక "మామయ్యా' నేనొక్కప్రశ్నము నడిగెదను. మీరిపు డఖండజ్ఞాన సంపాదన గావించుచున్నారు గాన దానికి బదు లొసంగగలరని తలంచెదను. సంసారకూపములోబడి మునింగి పిల్లలు జల్లలతోనుండు గృహస్థులకు పరమేశ్వరుఁడు పరము నొసంగఁడా?" యనెను.

"ఎందుల యుఁడమ్మా! గృహస్థు తాను లోకములో నున్నం కెట్టి కర్మజేయవలెనో దానినాచరించుచున్నచో నాతఁడు

తిప్పక యిచ్చెను. అది యాతని విఘ్యుక్తము. కాని గృహస్థు సంసారము చేయుచున్నాడనుగదా యని కావలసిన దైవ చింతనమును మరువరాదు. ఈ బంధుమిత్రపుత్రకళత్రాదులే నిత్యమని భావించి మాత్రము నావలెనే మోసపోకూడదు, దీనికి దార్కాణము గా భాగవతములో శుకమహర్షియేమి పచించెనో వింటివా?

ఉ॥ ఎక్కడి తల్లిదండ్రిసుతు లెక్కడివారు కళత్రబాంధవం।

బెక్కడిజీవుఁడెట్టితను వెట్టి

కావుననే నిప్పుడందరిపైనను వ్యామోహము దీసివైచినాఁడను. ఇప్పుడు నన్ను కమల యిల్లు వెడలగొట్టినను నాకెట్టికోపముగాని తాపముగాని లేదు. ఈయిల్లు యీశరీరము, గూడ నావికావు. ' అని ప్రకాశము పల్కి తనగ్రంధపఠనము నారంభించెను.

రాగలతిక యచ్చటనుండి వెడలిపోయెను. ఆమె మనస్సులో మాతులుఁడు పచించిన పద్యమే శాశ్వతముగ నాటుకొనెను. స్వభావముగ నామె జ్ఞానవతి. చదువరి. అందుచే నామె యిఁక తన దినములు ప్రశాంతముగా దైవచింతనతో గడపవలెనని తలంచెను. దాని కనుకూలమైన ప్రదేశ మెయ్యది యాయని యాలోచింపసాగెను.

మంగళగిరి కొండయందు సాధుపుంగవులు చరించుటకై యొక బిలముండెను. అందులోకేకి యామె తన జీవితశేషమును తపమాచరింపవలెనని నిశ్చయించుకొనెను. తరువాత తనవారి కెవ్వరికిని జెప్పకయే లతిక బయలువెడలిపోయి యాబిలములో ప్రవేశించెను. దినమున కొకమారామె యాహారమునకై బయటికివచ్చి యేవియో పండ్లు ఆకులు దిని మఱల లోనికి బోవుచు మిగత వేళల దపమాచరింపసాగెను. ఆమె కిప్పుడు లోకముతో పనియే లేకపోయెను. కానీ యాహారమునకై యామె బయటికి వచ్చినప్పుడు మాత్రము

కొందరు దైవభక్తు లామెను గొప్పయోగినిగా భావించి యామెకు పండ్లు ఫలాదు లర్పించుచుండిరి. ఆమె వలదనుచున్నను, వారు ప్రతి మాలి యొసఁగుచుండిరి. రాగలతికయు వానిని దీసుకొని ముందు గా దేవుని కర్పించి, భుజించును. వచ్చిన భక్తుల సందియము లేమైన నున్నచో వానిని దీర్చుచు వారిని సంతోషపెట్టి పంపుచు వచ్చెను.

మంగళగిరి బిలములో నొక యోగి నివాసము జేయుచున్న దనియు, నామె గొప్ప తపస్వినియు మహాత్తు గలదనియు వదంతి బయలుదేరి యాంధ్రదేశమంతయు వ్యాపించెను. నానాప్రదేశముల నుండి భక్తులువచ్చి యామెనుచూచి సాష్టాంగ దండ ప్రణామము లొనర్చి యామె యాశీస్సులనంది పోవుచుండిరి. ఆమె యాశీర్వదించి నచో బిడ్డలు లేనివారికి బిడ్డలు కలుగుదురనియు, రోగులారోగ్యవంతు లయ్యెదరనియు జనులలో విశ్వాసము గల్గెను. ఈ విశ్వాసము వలన చాలమంది సౌఖ్యపడిరి. దీనికంతటికిని పరమేశ్వరుఁడే కారణము గాని తనలో నేమియు లేదని యాయోగిని విశ్వసించెను.

---

## త్రయోదశ ప్రకరణము

(పర్యవసానము)

---

ఒకనాఁడు కమలాశాంతలు ప్రకాశముగారి యింటికడ నేదియో సంభాషణ జేయుచు కూర్చుండి యుండిరి. పిల్లలు వారివద్దనే యాట లాడుచుండిరి. ప్రకాశము తన నిర్ణీతమైన స్థలముననే ధ్యానయోగము నందుండెను. అప్పుడొక సేవకుఁడు వచ్చి ప్రకాశముగారిల్లిదియేనా ? యని ప్రశ్నించెను. కమల దాని "కవు"నని సమాధానమిచ్చెను. అవు తఁడు వారి కుమార్తెలు మీరేనా యని మరల నడిగెను. అవునని కమల వచించినంతనే యాతఁడు వెనుకముందు దిరిగి చూచి

యొక యుత్తరమును, చిన్నపెట్టె నొకదాని నందిచ్చి ఈయుత్తరములో నన్నియు వ్రాయఁబడినవి. చూచుకొనుఁడు అని పలికి వెడలిపోయెను. ఆయుత్తరముపై ప్రకాశముగారి కుమారితలు చిరంజీవులగు కమలా శాంతలకని వ్రాయఁబడెను. ఆయిర్వురు వెంటనే యాయుత్తరము దీసి చదువుకొనిరి. అందిట్లుండెను.

మంగళగిరి బిలము.

'సోదరీమణులారా! మీరు నాకు పూర్వాశ్రమ బంధువులు. విశేషించి నెచ్చెలులు. నేను మిమ్ము వీడిపోవునప్పుడు చెప్పిరాలేదు. కారణము మీ యనుజ్ఞనొందుట దుస్థరమని తలంచుటయే. ఏయెండ కాగొడుగే పట్టవలెనుగదా. నాపూర్వాశ్రమములోని వస్తువులను మీకింపుతో బంపితిని. అవి తిరస్కరింపకుఁడు. నాకిపుడు వీనితో బనిలేదు. మీయాశ్రమమున కివి యనుకూలించును. ఇదిగాక నాజీవన భృతి క్రిందనున్న నాలుగు యకరములభూమిని మీయిద్దఱు సమానముగా ననుభవించుటకై యొక నిర్ణయపత్రము వ్రాసి యిందుతో బంపితిని. అది యాభరణముల పెట్టెలో గలదు. దానిని భద్రపఱచుకొనుఁడు నన్ను మీరిఁక జూడరాకుఁడని కోరెదను. ఒకవేళ వచ్చినను, పూర్వాశ్రమ విషయములగు నాకు జ్ఞప్తికిదేకుఁడని కోరుదును. ఇదియే నాకడపటి విజ్ఞాపనము. మరొక్కటి గలదు. మీహృదయేశ్వరులకును మీజనకునికిని నావందనములు.

ఇట్లు

యోగిని,

చాలసేపటివరకా యుత్తరము వారి కర్థమేకాలేదు. ఎవరీ యోగినియని వారు తలంపసాగిరి. తుదకు పెట్టెదీసి నిర్ణయపత్రము జూడగా నందు 'రాగలతిక యని వ్యావహారిక నామము వ్రాయఁబడి యుండెను. రాగలతిక వైధవ్యదశ ననుభవించు దశలో సొమ్ములు

ధరింపలేదు. అందుచే కమలాశాంతలు వానిని చూడనైన లేదు. అవి చాల విలువగలవిగా నుండెను. మిక్కిలి రమణీయములై యుండెను. రాగలతిక తల్లిదండ్రులు ధనవంతులుగదా. అందుచే వారు నవరత్నములచే బొదుగఁబడిన దివ్యాభరణములను జేయించిరి. భరతుఁడుకూడ చేతిలో పాపున్నపుడు మరికొన్ని నగలను చేయించెను. వీని యన్నిఁటిపైనను రాగలతికా భరతులపేర్లు కానవయ్యెను. వీని నన్నిఁటిని జూచువరకు వారు మిక్కిలి యాశ్చర్యపడిరి. లతిక యంతటి ధనికురాలని వారెరుఁగరు.

ప్రకాశమున వార్తతోడనే తెలుపఁబడెను. లతిక యోగినియై సందులకాతఁ డత్యాశ్చర్యముజెందెను. ఎంతటిభోగినియో చివరకంతటి యోగినియై లతిక యున్నతస్థాన మలంకరించెనని యాతఁ డాహ్లాద పడెను. లతికబంపినవస్తువుల జూచి యాతఁడు విస్మయ పడెను. 'నావలెనే లతికకూడ సంవత్సరాలు. ఇంపుర మొక్కనావలోనే ప్రయాణముజేసి నానాశ్రమల పడితిమి. తుదకిరువుర మొక్కటే యొడ్డునకుగూడ జేరుటకై యనుకూల వాతావరణమును నిర్మించుకొంటిమి. పరమేశ్వరా! ఇఁక మమ్మొడ్డునకు జేర్చు భారము నీదియే" యని ప్రకాశము మఱల తన ప్రార్థనలో మునిగి పోయెను.

రాజశేఖర మిప్పుడొక గ్రామపెద్ద. ఆయన తల్లిదండ్రులు గతించిరి. శకుంతల భర్తృసేవాపరాయణయై తనకాలమొకరీతిగ గడపజొచ్చెను. ఆమె యిప్పుడు గ్రామములో పెద్ద ముత్తైదువ. ప్రతి శుభకార్యమున కామె వచ్చినగాని గ్రామములోని స్త్రీలోకము పనులారంభింపరు. అందుచే విధిలేక యామెయు నట్టి సమయములలో బోవ దొడంగెను. శకుంతల జెప్పినట్టు లేశుభకార్య సమయములందుగాని పూజాపునస్కారములు జరుపబడుచుండును. రామలక్ష్మణుల జాడ తర్వాత దెలియకయేపోయెను. భరతుని నిర్యాణానంతరమిటు రాకపో

కలు తగ్గించిరి. అందుచే "ఎవరికివారే యమునాతీరే" యన్నట్లు
య్యెను. కమలాకాంతుఁడు ప్రకాశముగారిని వేయికండ్లతో కనిపెట్టి
యుండెను. ఆతఁడు విచారగ్రస్తుఁడుగా నున్నదినములలో కమలాకాం
తుఁనకు నిద్రయేలేదు. తనపిల్లలకన్న నాతని నెక్కువగా గనిపెట్టవలసి
యుండెను. శాంతయు నామెభర్తయు నప్పుడప్పుడు వచ్చిపోవుచు కమ
లతో నన్యోన్యమైత్రిగా నుండిరి. లతికయిచ్చిన యాభరణములతో
నిపుడు వారు భూషణభూషితులైరి. విద్యాభూషణము వారికి తోడయి
సంపూర్ణభూషితులనుటకు సావకాశమిచ్చెను.

భరతుఁడుచనిపోయిన పిమ్మట ప్రకాశముగారికి భరణముగా
నొసంగఁబడిన యాస్తికిగూడ ప్రకాశముగారే వారసుఁడయ్యెను.
అందుచే నాభూమిప్రకాశముగారికే ఘరలచెందెను. దీనికొకవేళరాగల
తిక యాక్షేపణముండునేమోయని తలంచుచున్న దినములలోనే రాగల
తిక యోగినియైపోయి, తనయాస్తినంతయు కమలాశాంతలకిచ్చివైచుట
సంభవించెను. అందుచే నిఁకనట్టి సందియమున కేమియుతావులే
కుండెను. భూమినిగూడ ప్రకాశముగారు కమలాశాంతలకు సమానము
గాపంచియిచ్చినది.

శాంతభర్తయగు రమాకాంతుఁడుక్రమముగా నూరురూపాయల
యుద్యోగియయ్యెను. ఈయుద్యోగములో మిగిలిన ద్రవ్యముతో
నాతఁడు మఱికొంత భూమినిగొనెను. ఆతఁడుశాంతయెడల మిక్కిలి
యనురాగముతో ప్రవర్తించుచువచ్చెను. అప్పుడప్పుడాతఁడు ప్రకాశ
ముగారిని చూచిపోవుచు నాతనికిమంచిమంచి ఫలాదులు తనమకాముల
లోసమకూర్చి పంపువాఁడు. శాంతలేమిడిలో బుట్టిబెరిగినను, స్త్రీలజ
న్మిసస్సుగనే యదృష్టవతియై చక్కఁగాభర్తతో సంసారముజేయ
సాగెను. భర్తయుద్యోగియగుటచే నెప్పుడాయిల్లాలివద్దకొందఱుసేవకులు
హాగియర్ష్ణములిచ్చుచు నిలబడుచుండిరి. ఐనను శాంతవారిచే జేయింప

వలసిన పన్నులనుమాత్రమే వారికి జెప్పుచు, గృహకృత్యములలో తక్కి-నవన్నియు తానే జేసుకొనుచు నమ్రతగా మెలఁగుచువచ్చెను. అనప్రూత కాసేవకులుగూడ మిక్కిలికొనియాడుచు విధేయులై యుండిరి.

రమాకాంతుఁడు కమలాకాంతునికెప్పుడును కృతజ్ఞుఁడయియే యుండెను. తన వివాహమున కాతఁడు జేసిన సాయమాతనిజీవితములో మఱువరానిదని తలంచెను. ఇదిఁగాక కమల తన చెల్లెలగు శాంతను కుమార్తెవలెనే పెంచెను. కమలాకాంతుఁడుగూడ శాంత తనకుమార్తె వలెనే చూచుచువచ్చెను. వారందఱు కలిసిమెలసి యుండి పరస్పర ప్రేమానుబంధముతో ముడివైచుకొని తమదినములుహాయిగా గడపు కొనుచుండిరి. కమలకిద్దఱును శాంతకిద్దఱును పిల్లలుగలిగిరి. వారెప్పుడు ప్రకాశముగారియెదుట నాటలాడుచుండుట మఱిమెఱుఁగుదుముగదా.

రమాకాంతుని తోడియుద్యోగులు కొందఱుగలరు. వారందఱు రమాకాంతునియెడల మిక్కిలిగౌరవము జూపుచుందురు. దీనికి కారణ మాతఁడుద్యోగ విషయమున మిక్కిలిశాంతమూర్తిగానుండి యెప్పుడును న్యాయమార్గానుసారిగా నుండుటయే. రమాకాంతుని సద్గుణములనువిని రైతులెందఱోవచ్చి వారివారికష్టసుఖములను జెప్పుకొని కావలసినపనులను జేయించుకొనువారు. రమాకాంతుని స్నేహితబృందములో శ్యామసుందరము, నీలకంఠమూర్తియను వారిర్వురుగలరు. వారెవ్వరోగాదు. మనకమలాకాంతుని సోదరులే. వీరిని గుఱించి మనమింత వఱకును తలపోయనేలేదు. వారిని బెజవాడలోచదువుచుండఁగా వదలివేసితిమి. కానివారుశ్రద్ధగాచదువుచు కమలాకాంతుని తెలివితేటలవల్ల పట్టపరీక్షవరకును జదివింపఁబడి తుదకుదానియందునెగ్గిరి.

వారిద్దఱికిని కృష్ణామండలములోని కలెక్టరాఫీసునందుద్యోగములులభించెను. రమాకాంతునివలెనే వారిర్వురును తమయుద్యోగములను జాగరూకతతోనిర్వహించుచువచ్చిరి. పైయధికారులకు వారెల్లపు

డువినమ్రులై యుండిరి. రైతులయందుమిక్కిలి దయాళువులై సంచ రించిరి. తక్కినయధికారులవలె వారొక్కకాసైనను పరద్రవ్యమును లంచముగాగ్రహించరైరి. మీఁదుమిక్కిలి గ్రామోద్యోగులుచేయు'నష్ట యి'లకుకూడ వారు సొమ్మునిచ్చివేయుచుండిరి. తమక్రింది తాబేదార్ల కేమాత్రమొత్తిడియు గల్గింపకుండిరి. ఇట్లుండియు వారివారిపనుల యందప్రమత్తులయియే చరించుచుండిరి, వారినడవడిక్రమముగాపై యుద్యోగులచే గుర్తింపఁబడెను. అంతుచే కొలఁదికాలములోనేవారిర్వు రును సబుమేజస్ట్రేటుహూదాలోనికివచ్చిరి. వారివద్దకువచ్చు తగవులలో న్యాయముచక్కఁగానిర్ధారణయగుచుండెను.

కమలాకాంతుని యెడల దమ్ములిర్వురును, కృతజ్ఞులై యుండిరి. వారుసంపాదించెడి ద్రవ్యములో సగపాలన్నగారికి బంపుచుండిరి, దాని నాతఁ డుపయోగించుకొనక కుటుంబముక్రిందనిల్వజేసి భూములను కొన సాగెను. పదిసంవత్సరములలోవారు మఱల నిరువదియకరముల భూవ సతిని కొనిరి, కమలాకాంతుఁడు తమ్ములవివాహములు జరిపి వారికి వేరువేరు గృహనిర్మాణములొనర్చెను. పిమ్మటవారుదమ యాస్తిని విభాగించుకొని సుఖముగా కాలక్షేపముజేయుచుండెను.

---

## చతుర్దశ ప్రకరణము

### సింహావలోకనము.

---

ప్రకాశముగారి యంత్యదినములన్నియు కమలయింటివద్దనే గడచి పోయెను. కమలయు, కమలాకాంతునియొక్కయు నిశ్చలప్రేమైక సేవ నలతోనే యాతని జీవితముముగిసెను, ధనాఢ్యుఁడగు ప్రకాశముగారి యాస్తి యెల్లతారుమారైపోయినను, తుదకందులో పోయినదిపోను

శేషించినదిద్దైనను కమలాశాంతలకే జేరిపోయెను. 'కష్టేఫలీ'యన్న వాక్యమునకునిదర్శనముగా కమలాశాంతలు తమతండ్రిసొత్తును చివరకు స్వీకరించినను నిరపేక్షితులై వారివలె పితృసేవనమొనర్చిన వారరుదని భావింపఁబడెను.

'పుట్టేఁడాముదములో పోరి నను అమకనప్పుడదుకద' ను సామ్యముగా విమలానందముగారెంతగనో తంటాలుపడి ప్రకాశముగారి యాస్తిని రామానందముగారికుటుంబములో జేర్చవలెనని ప్రయత్నంజేసినను, తుట్టతుదకది చెల్లాచెదరై పోయెనేగాని రామానందముగారి పుత్రునకంటకనేపోయెను. అంటకపోగా నాప్రయత్న మిరుదెగలవారికిని కష్టములుయేపోయెను. ఎవ్వరును సుఖమనుభవింపలేకపోయిరి. రామానందమా చింతతోనే చనిపోయెను. ప్రకాశము బ్రదికినన్నాళ్లుదుఃఖింపవలసి వచ్చెను.

వితంతూద్వాహ మపేక్షించిన రాగలతికయు ననేకయవతారములుగా మారవలసివచ్చెను. దైవబలమునకు మానుషబలము సాటిరాదని తెలుసుకొని తుదకువైరాగ్యచింతనమేకర్తవ్యమని దానినవలంబించెను. కాని శకుంతలను జూచి నేర్చుకొన లతికయామెనుదాటి పరిపూర్ణ వైరాగ్యమానసయై యోగినియయ్యెను. ఆమెకుగల్గిన కష్టసుఖానుభవములే యామెనీ దారిలోనికి త్వరగాలాగుకొని పోగలిగెను.

నిరుపేదయింటి బాలికయగు శకుంతయు హద్దాపులలో బెరిగి పెద్దదగుటచేత రాజశేఖరమువంటి పోకిరినివివాహమాడియు తన శీలమును పేరును జక్కఁగా గాపాడుకొనెను. తుదకు పుట్టినింటికిని మెట్టినింటికినామెయేపేరుదెచ్చెను. ఆమెను జూచి సిగ్గుపెచ్చుకొని రాజశేఖరము క్రమముగా బాగుపడెను.

కమలాకాంతుఁడు మొదట గొప్పధనికుఁడు గాకున్నను, ప్రకాశముగారాతనికి చేయూతనీయకున్నను, దైవబలముచేనాతఁడు లేమిడిలో

లేకుండ కుటుంబమును చక్కఁగా బోషించుకొనగల్గెను. ఆతనియొక్కయు నాతని తమ్మునియొక్కయు ఋజుప్రవర్తనలచేతనే వారుతగిన పదవులను బొందుటయేగాక సౌఖ్యమును కీర్త్యైశ్వర్యములనుగూడ బొందగల్గిరి. రమాకాంతుని స్థితియుగూడ నట్టిదియే.

విమలానందము స్థితిని జూచిన చిత్రమగును. దృతరాష్ట్రునివంటి సుగుణ సంపన్నుఁడు. ఇతఁడుపైకి పెద్దమనుష్యుడు. మొదటినుండియు ప్రకాశముగారి యాస్థినపహరించుటకై యెత్తులువేసితనకుమారున కాతని కుమారెయగు కమలను వివాహమాడ సంకల్పించెను, గాని యదినెరవేరదయ్యెను. తనకాయాస్థి దక్కకపోయినంతనే తనతో పాటుగానున్న పెద్దమనుష్యునికైనను దానిని దక్కనీకుండజేయవలెనని తలంచి కొంతవరకు జయమొందెను. దానివలన ప్రకాశముగారికెన్నియో క్రొత్తచిక్కులు దెచ్చిపెట్టెను గాని తుట్టతుదకది చెల్లాచెదరై మఱల నది యాపెద్దమనుష్యునికుమారుఁడగు కమలాకాంతునికే జేరిపోయెను. విమలానందము జేసిన పన్నుగడలన్నియు దరువాత ప్రకాశము మూలమున నెల్లరునుగ్రహింపఁగల్గిరి, అందుచే నాతనిపేరున కొంకింత కల్మష మేర్పడెను. రాజశేఖరము వర్తనముతో నాతండ్రి బిడ్డలిట్టి వారేయనిలోకులాడు కొనుటకవకాశ మయ్యెను.

ధర్మము కాలమునుబట్టియు, దేశమునుబట్టియు నుండుననియు నొకకాలములో పరిపాటియైన సదాచారములు వేరొకకాలములోను, లేక వేరొకదేశములోను దురాచారములుగాపరిగణింపబడవచ్చుననియు నందుచే నొకేవిధముగ పూర్వాచారములనే యనుసరించుట వలన చిక్కులేర్పడుననియు నందుచే కాలానుసరణమే శ్రేయస్కరమనియు నిదిబోధపఱచుచున్నది.

సంపూర్ణము.

---

శ్రీ ంతాణీ ముద్రాక్షరశాల, వైగాంరోడ్డు రాజమండ్రి:-1936.